


శ్రీ శివరామదీక్షిత నిజగురు పరబ్రహ్మణే నమః

# పరిపూర్ణబోధదర్పణం

అను

## పంచదసీగురుబోధ.

ఆరట్ల రామారావు

సమరస నిర్మల ప్రజ్ఞాన విలక్షణ స్వామిచే రచియింపబడి

శ్రీమత్పూర్ణాకళ సరస్వతీ పూర్ణానంద పంచదసీస్వాములవారిచే

పరిష్కరింపబడి

శ్రీమతి పడాల గంగయ్యమ్మగారి ద్రవ్యసహాయమున

కోమరిపాలెం

శ్రీ లక్ష్మాంబా ముద్రాక్షరశాలయందు

మ.రా.శ్రీ చింతావెంకటకృష్ణారెడ్డిగారిచే ముద్రింపబడియె.

1962

వెల రు. 3-0-0




శ్రీ శివరామదీక్షిత విజయము పరబ్రహ్మార్పణమగు

# పరిపూర్ణబోధదర్పణం

అను

# పంచదసీ గురుబోధ.


ఆరట్ల రామారావు

సమాన నిర్మల ప్రజ్ఞాన విలక్షణ స్వామిచే రచియింపబడి

శ్రీమత్పూర్ణాకుల సరస్వతీ పూర్ణానంద పంచదసీస్వాములవారిచే

పరిష్కరింపబడి



శ్రీమతి పడాల గంగయ్యమ్మగారి ద్రవ్యసహాయమున

కొమరిపాలెం

శ్రీ లక్ష్మీవరాంబా ముద్రాక్షరశాలయందు

మ.రా.శ్రీ చింతావెంకటకృష్ణారెడ్డిగారిచే ముద్రింపబడియె.

**1962**

వెల రు. **3-0-0**




నిజగురవేన్నమః

శ్రీ శివరామదీక్షిత నిజగురు పరబ్రహ్మణేన్నమః

# పరిపూర్ణబోధదర్పణం

బను

శ్రీ సరస్వతీ దుర్గానంద పంచదసీ సద్గురు బోధాంతర్గత

శుద్ధ నిర్గుణ తత్వ కందార్ధార్ధ

## అమృతగంగాతరంగిణి.

ఆరట్ల రామారావు

సమరస నిర్మల ప్రజ్ఞాన విలక్షణ స్వామిచే రచియింపబడి

శ్రీమత్కూరాకుల సరస్వతీ దుర్గానంద పంచదసీస్వాములవారిచే

పరిష్కరింపబడి

శ్రీ తొస్సిపూడి గ్రామనివాసులైన

ద్వారంపూడి బుచ్చెమాంబా వెంకటాద్రియుడుగార్ల

గర్భశుక్తి ముక్తాఫలంబైన

పడాల సత్యనారాయణమూర్తిగారి ధర్మపత్ని

శ్రీమతి పడాల గంగయ్యమ్మగారి ద్రవ్యసహాయమున

ముద్రింపబడియె.

**1962**

౧౧౦

నిజగురువే నమః

# కృతిసమర్పణ

శ్రీ మదచలఋషి శ్రీ శివరామదీక్షితపీఠ
పరంపరా సాంప్రదాయార్యులైన
శ్రీరామలింగార్య పరమారాధ్య దేశికేంద్ర
నాగనార్య, బాలరామార్య, కృష్ణమాచార్య
శ్రీ పరమగురు **సమరస** నిర్మలానంద సన్యసార్య
ప్రియశిష్య శిరోమణులైన
శ్రీమద్గురు సరస్వతీమద్గానంద పంచదసీ స్వాములవారికి
కృతిసమర్పణ చేయబడినది. వారేకృతిభర్త.

ఇట్లు,
గురుచరణరేణువు
అరట్ల రామారావు.
కృతికర్త.

జై బోలో శ్రీశివరామదీక్షిత ప్రభుమహారాజుకీజై.
జై బోలో శ్రీ సమరస నిర్మలానంద సన్యసార్య ప్రభుమహారాజుకీజై.
జై బోలో శ్రీ సరస్వతీమద్గానంద పంచదసీస్వామిసద్గురు మహారాజుకీజై.
జై బోలో శ్రీ బోధానంద సజ్జా రామమూర్తి సద్గురుప్రభు మహారాజుకీజై.



శ్రీమద్రాజాధిరాజ మహారాజయోగీంద్ర చంద్రునైన

—: భాగవతకృష్ణ ఋషివర్యుల దివ్యవాణి :—

కం॥ జతనముగ దాచీ చదువుము । రతనమ్ముల హారమిదియు । రసి
కుల గళమా । యతనము దీనికి। నేబహుయతనముగావించి తెచ్చి।
యి స్త్రీరనేడు । బోధకు బందోబస్తార చూడు । రతనాలెట్లా రాళ్లు
రతనాలంచని యంటె । రతనాలీ పద్యాలె రసికు లెరిగెదరివి నీ ।
కి స్త్రీరనేడూ । బోధకుబందోబస్తార చూడూ॥

కం॥ సూరిజనులె । యీగ్రంథపు సారముగనువారు కాని । సంసార
మహాఘోరవారాసి జేరినవారలువిని।దీన్ని చూచి వచియింపుదు రే॥

కం॥ గొప్ప ప్రతిష్ఠకు మిక్కిలి । తిప్పలబడు నృతతికెపుడు । తీరదు।విన
నీవెుప్పలకుప్పగు బోధను తప్పక నామాట నమ్మదగు తప్పనకన్॥



ఓం

శ్రీ సద్గురువే నమః

శ్రీ మద్బృహద్వాశిష్ఠ శిద్ధాంతము

శ్రీ మత్పరమగురు శివరామ దీక్షిత అచలపీఠము.

శ్రీ వృషనామ సం॥ కార్తీక శు॥ ౧౫ పౌర్ణమీ రోజున అనగా 1941 సం॥ నవంబరు 3 తేదీని అనగా సోమవారం రాత్రి మత్ప్రియ శిష్యుండగు అరట్ల రామారావు పంతులుకు అనుగ్రహపూర్వకముగా (సమ రసనిర్మల ప్రజ్ఞాన విలక్షణస్వామి) అని దీక్షానామంబొసగి వ్రాసి యిచ్చిన అధికారనామ పట్టా.

బిడ్డా, ఈ దినము మొదలు నిన్నాశ్రయించిన ముముక్షువులకు, అనగా భక్తిజ్ఞాన వైరాగ్యపరులకు, వారివారి ప్రజ్ఞననుసరించి, సాంఖ్య, తారక అమనస్క పరిపూర్ణబోధలను ప్రసాదించి, ద్వాదశి, షోడసీ, పంచ దశి, మంత్రమూల, మంత్రసార, మంత్రధ్యాన, మంత్రార్థములను బోధించి, తరింపజేయగల సమర్థతగలవాడవని.

కం॥ నేజెప్పినట్లుజెప్పర । నే జెప్పినబోధ లెస్స నీకతికుంటే । నేజూతు
నీచమత్కృతి । రాజితసుగుణైక సాగరమ్యవిచారా॥

అను ఆర్యసిద్ధాంతము ననుసరించి, ప్రేమాస్పదముగా నాస్వహస్త లిఖితముతో వ్రాసియిచ్చిన అధికారనామపట్టా వ్రాసి యివ్వడమైనది.

ఇట్లు

శ్రీమత్పరమగురు శివరామదీక్షిత అచలపీఠ స్థాపనాచారి

కూరాకుల దుర్గానంద సరస్వతీ పంచదసీ స్వామిన్రాలు అనియున్నది.

యిందుకు సాక్షరహిత సాక్షులు

1. పూసర్ల కృష్ణదాసుగారి శిష్యుడు జ్ఞానానందస్వామి పసుపురెడ్డి అప్పలదాసు సాక్షివ్రాలు అని.

2 అద్వైతకేసరి గంగుదుర్యోధనస్వామి శిష్యుడు కొంక్యాన నాయుడు సాక్షివ్రాలు అనియున్నది.

తంగుళ్ళపేట ఇదియే

3-11-1941 తేదీ. పూర్వపు కళింగగంగులపేట. శ్రీకాకుళంజిల్లా.

శ్రీ కాసీబుగ్గపుర శివరామదీక్షిత పీఠస్థాపకులు

శ్రీ యదార్థ బోధోపదేశిక పెంట దాలయార్యులు.



శ్లో॥ శ్రీసన్యసార్య సద్గురుపాద । కమలాంమృతపానభృంగం
శ్రీయదార్థబోధోపదేశిక । దాలయార్య చరణంభజే॥

## —: భక్తులకు నేనిచ్చు సందేశము :—

నేను సుమారు ఇరవై రెండు సంవత్సరములక్రితం మాసద్గురుమాత గారైన విమలాంబ కామేశ్వరమ్మ రామచంద్రపుర శ్రీ సమరస నిర్మలానంద ఆశ్రమస్థాపకుల చరణసేవలుచేస్తూ పెద్దలు సెలవిచ్చినట్లు పెద్దలనెవరిని జూచిన ముద్దుగమాట్లాడి వారుముదమున జెప్పే శుద్ధులకడ్డము చెప్పక ఒద్దికతో మ్రొక్కి విని అనుభవములో పెట్టుకున్న సారాంశము. నాలుగు కందార్థములలో సూచన జెప్పి ముగించెదను. శ్రీ భాగవతకృష్ణ ప్రభునర్యులు.

కం॥ పరిపూర్ణమనెటి పల్కేయెరుకను ।
బల్వాక్షరముల కెచ్చటగనినన్ తిరమైయున్నది
గనుగొని యెరుకను బల్వాక్షరములనికగట్టిపెట్టూ ।
యెవరికీ తెలియదిది మూలగుట్టూ ॥

అని శెలవిచ్చిరి. అక్షరములకు లోవెలి పలకేయున్నటు అంతర్బాహ్యములు నిండి నిబిడీకృతమై పరిపూర్ణమనే రూపనామక్రియా రహితమై శుద్ధప్రకాశ కరెంటు కెరటములులేని, మహాఅచల పరిపూర్ణసముద్రము కలదని భావములో గ్రహించితిని. దానినే క॥ ధ్వని మొదలగు తన్మాత్రలు కనుగొనగా లేశమైన కాన్పించని చోటును బట్టబయలుగా కని. అనగా విచారించి తెలుసుకొని, ధ్వనిముఖతన్మాత్రలుతో కూడుకొనున్నదే యెరుకని తెలుసుకొని ఇదే గుర్తెరిగే శరీరమని. ఈగుర్తెరిగే శరీరమే నేనుమేనులని అనగా నేననేదే శబ్దము లేక పలుకు. మేననేదే ఆవరణ. అదే ఆకాశము ఈ ఆకాశమే మహాకాశము శుద్ధజ్యోతి స్వప్రకాశము. దీనినే ఉపమానముగా కలకు చెప్పిరి. అనగా పరిపూర్ణములో ఈశుద్ధప్రకాశస్వరూపమెరుక యెట్లు తోచినది ? అనుప్రశ్నకు ఆధారముయేమిూ లేనందున కలవలె తోచినదని నిశ్చయించుకొంటూ కర్పూరదీపమువలె గుర్తెరిగే శరీరములు ఒకటై పరిపూర్ణమనే హారిలోవెలిగి రెండూఒక్కమారే లేక పోవునట్లు, మానసికములో నిశ్చయించుకొని, “గుప్తకర్పూర

శిఖిని యెరిగియు। సుప్తినొందియు నుండరా” అని ఆర్యులు తెలవిచ్చి నట్లు తారహితముకావలెను. ఈ స్థితియందెప్పుడూ వున్నవారే కం॥ అన హంకారు డనిమిషులు కనుక విశ్వాంబనేటి కలుగానడు॥ అని తెలవిచ్చి స్థితికుదిరిన వితరణశాలి యితరజనుల నిందాస్తుతులన్ తారేగి శాయజ న్నడు వారలు మరిచేసిరేని వలదనియనడు. వారు మీవారు మావారు వీరని సారెకు వీధిలో పోరాడెవారిని వలదనియనడు।

కనుక సోదరులారా! గురువుయందు భక్తిన్నీ పెద్దలయందు మిత్రత్వము లేనియెడల ఈబోధనిరర్థకము. లోకములో ధనము శాశ్వతము కాదు. మానవుడు జన్మమెత్తి నందుకు తన, తనుమనధనములు పరమ ధర్మమునకు ధారబోసి తరుగు విరుగులులేని ధనమును సంపాదించుకోవలె నని భక్తులకు నేజేయుహెచ్చరిక నాజీవితము. నాజీవితాంతమూ యింతే.

జై (శ్రీ) గురు.

## —: కృతికర్త విజ్ఞప్తి :—

పాఠక మహాశయులారా ! శ్రీ సరస్వతీ దుర్గానంద పంచదశీసద్గురు ప్రభువర్యులు శ్రీ విజయనగర శ్రీశివరామదీక్షిత సింహతలాట పాదుకా పీఠస్థాపనాచార్యులైన పరమగురు శ్రీ సమరస నిర్మలానంద సన్యాసాచార్యులవారి ప్రియశిష్యులు. వీరు పూర్వజన్మార్జిత సంచితకర్మచే, 1940 సం॥రం నాటికి ముప్పది సంవత్సరములనుండి ఆసనస్థానమున రణబాధచే బాధపడుచున్ననూ, పరమగురు కృపచే పరమెరుకలనెరిగి యెరుకను గురుదక్షిణ క్రిందఅర్పించి, బోధస్థితిపురుషులై దీక్షితపీఠ సాంప్రదాయ రహస్యములను తెలుసుకొనుటకు నైజామ్‌రాజ్యములోగల హైదరాబాదు, శికిందరాబాదులనుపరిశోధించి అచ్చట ఆకాలములో శ్రీభాగవత కృష్ణప్రభువర్యుల మందిరము ఇప్పటిబేగంపేట విమానాశ్రయస్థలములోవుండెడిది. ఆమందిరమునకు శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వర అవధూత ప్రభువర్యులు అధ్యక్షులుగనూ శ్రీ భూమానంద మందిప్పల హనుమంతరావు ప్రభువర్యులు కార్యదర్శులుగనూ, కొండోజు సీతయార్యులు, అబ్బుగారి వీరయార్యులు, కేసాస వీరయార్యులు, అరిగె రామస్వామిగారు, బండి రామస్వామిగారు, బి. రామసింగార్యులు మొదలైన మిరపకాయల యల్లయ్యశ్రేష్టిగారు ఉడతా శంకరయ్యగారు,గుండా భూమయ్యగారు, ఇత్యాది భక్తులందరి ప్రేమల ఆదరాభిమానముతో దీక్షితీయ చలాచల వాక్య ద్వితీయభాగ ముద్రణాకాలములో అనగా 1923 సం॥రం, మాప్రభువర్యులైన శ్రీదుర్గానందులు బేగంపేట శ్రీభాగవతకృష్ణ ప్రభుమందిరముకు వెళ్ళిరి. అచ్చట పూర్ణబోధపదములకు నల్లభై ప్రశ్నలువేసిన అచ్చుపేపరుచూపి, దీనికిమీరు వాక్యలక్ష్యార్థములుగా సమాధానము వ్రాసిన యెడలమీరు శ్రీశివరామ దీక్షిత సాంప్రదాయకులని సమ్మోదమనిరట. మూడురోజులు ఆశ్రమ వరండాలోనేఉండి ప్రశ్నలను పూర్తిచేసి శ్రీ సచ్చిదానంద అవధూత ప్రభువర్యులకుచూపగా ప్రేమపంచాయితీదారులు చూచిరి. రచనలో పంచదశీ దృష్టాంతమునే యెక్కువగా ఉపయోగించినందున, వీరిగురువుగారు వీరి

"పంచదశీ" దీక్షానామమిచ్చిరనిసంతోషించి. వీరికవిత్వధారకుమెచ్చి విజయనగర శివరామదీక్షిత పీఠస్థాపనాకాలమున శ్రీ అవధూతాచార్యులు, "ఈపీఠమునకు సరస్వతివిరా!" అని ఆశీర్వదించిరి. ఆనాటినుండి శ్రీసరస్వతీ దుర్గానంద పంచదశీస్వామిఅని పిలువబడుచుండి దేశాటనముచేస్తూ, నరసన్నపేటలో ఒకపీఠముస్థాపించిరి. తరువాత 1943లో ఈ తోస్సిపూడి శ్రీమతి పడాల గంగయ్యమ్మగారు శ్రీప్రభువర్యుల సనాతనరోగ దుగ్ధతను ఇంగ్లీషువైద్యసేవలు సుమారు మూడుమాసములు చేయించి, వారి దుగ్ధతనుపూర్తిగా మాన్పించి సంపూర్ణఆరోగ్యవంతుగాజేసి, స్వభాను నామసంవత్సర కార్తీక శుద్ధ పౌర్ణమినాడు వారిగురుమాతయైన విమలాంబ కామేశ్వరమ్మగార్కి శ్రీ సరస్వతీ దుర్గానందస్వాములవారికీ మహాపూజలుచేసి వారినిపంపించిరి. అప్పటిలో నేనువచ్చి పూజాకార్యక్రమము జరిపించితిని. అప్పుడే మాతృశ్రీ గంగయ్యమ్మగారి దర్శనము ప్రారంభము మగుచటిసంవత్సరము వర్షాకాలం తీరుబడిరోజులలో నా ద్వారా బోధవినుటకు సన్నురప్పించిరి. తారణనామ సంవత్సర శ్రావణ బహుళ చతుర్దశినాడు అనగా 1944 సం॥రం ఆగస్టునెలలో వచ్చితిని. నాడు మొదలు నేటివరకూ ఇక్కడనేను పొందినగౌరవాదరాభిమానములు మీారందరూ యెరిగినవే. కనుక శ్రీసరస్వతీదుర్గానందప్రభువర్యులే నేను ఇక్కడకు వచ్చుట, ఈమాతృదేవతను కనుగొనుట. ఈపీఠము వారిచే స్థాపింపబడుట ఇత్యాదులు జరిగినవికనుక ఈకృతిభర్త శ్రీ తోస్సిపూడి పురశ్రీ శివరామదీక్షిత పాదుకాపీఠ సంపాదకులని చెప్పవలసి వచ్చెను.

జై శ్రీ గురు.

ఇట్లు:

అరట్ల రామారావు

—: పరంపరా మంగళహారతి చరణం :—

అంటేఅంటనిపరమున్ । కంటితో సూచించె । జంటా జానికమ్మా ।
మాతాసహితా । వెంటదాలయ్యార్య యదార్థబోధోప । దేశిక
స్వామి । సద్గురువర్యునకూ॥ మంగాళం । మంగాళం ॥ నిజగురుదేవా
మంగాళం । మంగాళం ॥

—: హారతిపాటలో చరణం :—

అనగ సన్యాసార్యుల చరణములేనమ్మా ।
తానేతానై స్నాతను తక్షణమేరోసీ ।
జానకిమాతనుగూడీ జగమెరుకలకలలో పూనీ పరమును దెల్పె ।
వెంటదాలయ్యార్యుల ॥ కిదిగో హారతి ॥

—: (శ్రీ) జానకీ మాతాసహదాలయార్య పూజపాట :—

శ్రీ దాలయార్య గురుపూజలుశాయగ । కలలో భక్తులుకలియండీ
కాలాకాలములంతటనిండిన । కనుసొన్నలో గురుప్రభుడండీ॥ శ్రీ॥

యమనియమాసనసాధనతీతుని ఆగచ్ఛాయని పిలువండీ । సమయమిదే
నెలకొన్నమిపూజకు । తల్లి జానకితో గొలువండీ॥ శ్రీదాల॥ శ్రీ॥

వ్రాత త్యాగి పరధర్మవిహారుకు । పాద్యార్ఘ్యాచమ్యములండీ । వీతరాగునకు
పంచామృత శుద్ధోదక స్నానాలివ్వండీ। శ్రీ॥

క్లేశములుసాహస్రంబులమధ్యను । సరగునవెలసిన ప్రభుడండీ । తళుకు
బెళుకు తత్వాల వస్త్రముతో తారకసూత్రమువెయ్యండీ॥ శ్రీ॥

బోధకగురునకు సాధనసంపత్భూషణ గంధాక్షతలండీ । యాదిలో యింద్రి
యనిగ్రహ శమదమశాంతి పుష్పములపూజండీ॥ శ్రీ॥

ధనములుపంచతన్మాత్రవిషయములె ధూప । దీపదర్శనమండీ
ఘనముగ మహానైవేద్యంబుగ । తనుమనధనములు యివ్వండీ॥ శ్రీ॥

ఉదకముమధ్యను దాహామునిచ్చీ ఊహాతో బోధలువిసరండీ
బదులు లేని యాపదియార్ఘ్యము । ఫలహారంబుగనీయండీ॥ శ్రీ॥
పలుకులొప్పుట్టిన దుర్వృత్తులు వదలుటె । తాంబూలంబుగనివ్వండీ
చలనమువిడి నిశ్చలముగనుండుటె । సువర్ణ దక్షిణ యనరండీ॥ శ్రీ॥
దేవతలందరి దేవుండితడని । భావమందు మగితలచండీ
కావుడనుచు కనుసౌంజ్ఞనుగని । అక్షిజ్యోతినే హారతియ్యండీ॥ శ్రీ॥
శమదమశాంత సమరసహృదయులు । సన్యాసార్యగురు తనయునకూ
అమలనిర్గుణాతీతపరమనీ । ఆత్మప్రదక్షిణచేయండీ॥ శ్రీ॥
స్వానుభవంబును చక్కగదెల్పిన । స్వానందరహితాగురుడండీ॥
భాను తేజ ప్రజ్ఞానవిశక్షణు । బాబయ్యను మదిదలచండీ॥ శ్రీ॥
విధ్యస్వప్న నిజభక్తుల కిప్పుడు । తధ్యముజూపిన ప్రభుడండీ॥
విద్యతీతులై కాసీబుగ్గలో । వెలసిన నిజగురు ప్రభుడండీ॥ శ్రీ॥

—: మంగళ హారతి :—

హారతీ అర్పింతునో దేవా । యదార్థబోధను బోధపరచిన దేశికారావా
జంటగా (శ్రీ) జానికమ్మతో పెంటదాలయ్యార్యగురువర । ఉంటిరా
యీయింటిగురుగారి । గంటియంటని ఒంటువెలుపల॥ హారతీ॥
సాధనాసంపత్తి నెరిగించీ । సాధనలోనుండిన బాధలన్నియు వేగతొలగించీ
బోధచే సాంఖ్యంబు తారక మరియు యమనస్కంబుదెల్పి।ముందుగా
పరిపూర్ణబోధను ముదముతో బోధించె గురువర॥ హారతీ॥
అష్టతనువుల వివరమంతయునూ । స్పష్టముగదెల్పిదినష్టమూ కలవలెను
యనుచూనూ । స్పష్టముగ బోధించి ద్రష్టను । దృష్ట ద్రాష్టాంతముల
చేతను । శృష్టికీరాకుండ జేసిన । సన్యాసార్య కనిష్ఠతనయా॥ హార॥
సమరసంబగు గురుని నామమునూ । అమరీననిజగురు । కమలజాప్తునికరుణ
చూడ్కులతో । సమముగా కాసీబుగ్గలో వైశ్యకులసంజాత దినకర
భూమ (శ్రీ)యదార్థబోధోపదేశస్వామి గురువర॥ హార॥

## —: గ్రంథకర్త లఘుస్వీయచరిత్ర :—

పాఠకమహాభక్తులారా ! ఈవ్యావహారిక నామధేయుడగు రామారావనుకలనేను, ఎప్పుడుకల్గినదో తెలియదుగాని, ఈకలనేనుకు ఎనిమిది సంవత్సరముల దగ్గరనుంచీ జ్ఞాపకము. అప్పటికి నేనుకంటున్నకలలో మాయింటి యజమానులచేవిన్న సంగతులనే, మనవిచేయుచున్నాను.

విశాఖపట్నంజిల్లా జయపురం మన్యప్రదేశమునకు ముఖద్వారమైనసాలూరుగ్రామములో మాతృదేవి, పితృగృహమైన కాళూరి హనుమంతరావుగారి ఏకైకపుత్రికైన నరసింగరావుపంతులుమామగారియింట 1915 సం॥రంలో జన్మించితిని. ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతత్రయములలో, మాదిద్వైతమతమైన మాధ్వమతము. భారద్వాజసగోత్రము. అరట్ల శ్రీనివాసరావు, కృష్ణవేణమ్మ అనువారు. తలిదండ్రులు. చాలా చిన్నతనమున తల్లిస్వర్గస్తురాలయిన కారణమున, తండ్రిపునర్వివాహము చేసుకొని వేరేవుండుటచేత, నన్ను పినతండ్రిగారైన అరట్ల నరసింగరావు కామేశ్వరమ్మగార్లే పెంచిపెద్దవానిగాజేసి విద్యాబుద్ధులు చెప్పించిరి. నాకు 14 సం॥రం వచ్చినప్పుడు తండ్రిగారు పరమపదించిరి. 16 సం॥రంలో పినతండ్రిగారు పరమపదించిరి. ఆనాటినుంచీ ఈ అనాథుడు కలలో పడిన కష్ట నష్ట నిష్ఠూరాదులు ఇంతంతని చెప్పుటకువీలులేదు. ఎవరైనా అడిగితే శ్లో॥ మాతానాస్తి.........” అనుశ్లోకమునకు సరిపడివున్నది. నాజీవితమనేవాడిని. ఇంతయెందుకు కూటికిగుడ్డకీ కరువై భిక్షాటనముచేసుకుంటూ విరక్తి భక్తిభావమున కాలినడకను తిరుపతివరకూ కొన్ని క్షేత్రములు సంచారముచేస్తిని. తరువాత 1932 సంవత్సరములో శ్రీసరస్వతీ దుర్గానంద పంచదసీ స్వాములవారి దివ్యచరణసేవ విశాఖపట్నంజిల్లా విజయనగరంలో లభించినది. తరువాత 1941 సంవత్సరం అనగా వృషనామ సంవత్సర కార్తీకశుద్ధ పౌర్ణమినాడు, శ్రీకాకుళంజిల్లా తంగుళ్ళపేటలో కార్యకారణబోధాదికార పత్రికనిచ్చి గురుదీక్ష “సమరసనిర్మల ప్రజ్ఞాన విలక్షణుడవై,” జగతిలో బోధించమని ఆజ్ఞనిచ్చిరి. అప్పటినుంచి సంచా

రముచేయుచుండగా 1944 సం॥రం అనగా తారణనామసంవత్సర శ్రావణ బహుళ చతుర్దశినాడు తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకాలో పందలపాక సరిహద్దులోనున్న తొస్సిపూడిగ్రామములో లేటు పడాల సత్యనారాయణమూర్తిగారిభార్య శ్రీమతి గంగయ్యమ్మ అమ్మను కలుసుకొంటిని. ఈమాతృదేవివల్ల తల్లిప్రేమ యెట్టిదో యెరుగనినేను, తల్లియొక్క ప్రేమాతిశయ మెట్లుండునో పూర్తిగా అనుభవించి, చిన్నప్పుడు తల్లి నెరుగనిలోటును పూర్తిచేసుకుంటిని. ఈ నా తాతగారివంశము కొంచెము చెప్పవలసిన విధిన్నై యున్నదికనుక చెప్పెదను. ఈనామాతృ శ్రీ గంగయ్యమ్మగారి తలితండ్రులు ద్వారంపూడి వెంకట్రాయుడుగారు బుచ్చెమ్మగార్లు. వీరికి రామిరెడ్డిగారు, సత్యనారాయణరెడ్డిగారు, నారాయణరెడ్డిగారు, వీర్రెడ్డిగారు, అనినలుగురు కుమార్లున్నూ, ఈనామాతృదేవియైన గంగయ్యమ్మగారు ఆఖరుకుమార్తె. పై నలుగురు మేనమామలకూ పుత్రపుత్రికా సంతానము మొత్తం ఇరవైఒక్కమంది కలరు. నేను మా మాతృదేవివద్దకు వచ్చేసరికి మూడవ అన్నగారైన నారాయణరెడ్డిగారు 4 లుగవ వారైన వీరెడ్డిగారు సజీవులైయున్నారు. తరువాత నాలుగవఅన్నగారుకూడా పరమపదించిరి. మిగిలిన శ్రీ ద్వారంపూడి నారాయణరెడ్డిగారు, మేనల్లుళ్లైన (1) ద్వారంపూడి రామిరెడ్డిగారి కు॥ కృష్ణారెడ్డి, వెంకట్రెడ్డి, వీరాఘవరెడ్డిగార్లు, వీరికి 3రు అప్పచెల్లెళ్ళు (2) సత్తిరెడ్డిగారనే ద్వా॥ సత్యనారాయణరెడ్డిగారి కు॥ పెద్దరెడ్డి అనే వెంకట్రెడ్డిగారు, పాపారెడ్డి, రామారెడ్డి, సూరారెడ్డి, వీరాఘవరెడ్డిగార్లున్నూ, (3) ద్వా॥ నారాయణరెడ్డిగారికి సూర్యనారాయణరెడ్డిగారుఅను కుమారుడు ముగ్గురుకుమార్తెలు కలరు. 4 లుగవ వారైన ద్వారంపూడి వీరెడ్డిగార్కి రెడ్డిగారుఅను వెంకట్రెడ్డిగారున్నూ నలుగురు కుమార్తెలునూ కలరు. వీరందరకీ నాయందు పూర్ణముగా బంధురూప ప్రేమచేత నన్ను శ్రీ గంగయ్యమ్మగారి కుమారునిక్రిందనే భావించి, సుమారు 50 వేల రూపాయలు విలువగల స్థిరాస్థిని శ్రీ మాతృదేవి నాకుయిచ్చుటకు అంగీకరించి ప్రోత్సహించి రిజిష్టరీ దస్తావేజుల రూపముగా నాకుఅప్పగించి

నన్ను గృహస్తుగా జేసి, నామంచిచెడ్డలు విచారించుతూ తీరుబడిరోజులలో బోధలు శ్రద్ధగావింటూ ఒకప్రక్క గురుభావభక్తికలిగి గౌరవించుచున్నారు. మాతృశ్రీని 1961_5_2 తేదీని కోలుపోతిని. అనగా ప్లవ నామసంవత్సర వైశాఖ బహుళ విదియా మంగళవారం ఉదయం 10 గం టల 3 నిమిషములకు పరమపదించిరి. అప్పటినుంచికూడా పైనిపేర్కొనిన బిడ్డలందరూ గ్రామస్తులూ గురుభావముచే గౌరవించి చూస్తున్నారు. ఇటువంటి త్యాగధర్మబుద్ధి బీజములుగల వృక్షమూలము శ్రీ ద్వారం పూడి బుచ్చెమ్మా వెంకటాద్రియుడుగార్లు, ఇటువంటిపవిత్రవంశ సంజాతులైన ఈబిడ్డలందరకూ శ్రీ నిజగురుమూర్తియైన శ్రీమన్నారాయణుడు ఆయురారోగ్య అష్టైశ్వర్య భోగభాగ్య, వివేక విజ్ఞాన వైరాగ్యత్యాగ సద్గుణసంపత్తులిచ్చి ఆచంద్రార్కమూ పుత్రపౌత్రాభివృద్ధులుగా జేయుగాక అని నిత్యమూ భగవంతునిప్రార్థించుచున్నాను.

—o—

## —: ఈ గ్రంధముయొక్క శాశ్వతమహారాజపోషకులు :—

పందలపాక గ్రామ కాపుస్తులు పడాల సత్యనారాయణమూర్తిగారిభార్య, తొస్సిపూడిపుర శ్రీ శివరామదీక్షిత పాదుకాపీఠ పాఠపీఠాధ్యక్షకుటుంబ స్థాపనాచారిణి యును మహాత్యాగ ఉదార సకల సద్గుణ సమరసశాంతగుణ సంపన్నులైన "పరిపూర్ణ బోధకంఠీరవ" పడాలగంగయ్యమ్మగారు తొస్సిపూడి

శ్రీ పడాల కృష్ణమూర్తిగారి కుమారులైన పెద్దపుల్లారెడ్డిగారు వీరిసహధర్మ చారిణి సరస్వతమ్మగారు పందలపాక

శ్రీ పడాల సుబ్బన్నగారి కుమారులైన చిన్నపుల్లారెడ్డిగారు వీరిసహధర్మచారిణి అమ్మన్నమ్మగారు పందలపాక.

శ్రీద్వారంపూడి నారాయణరెడ్డిగారు వీరిసహధర్మచారిణి ఆదెయ్యమ్మగారు తొస్సిపూడి.

| | | |
|---|---|---|
| శ్రీ | ద్వా॥ సత్తిరెడ్డిగారిభార్య సూరయ్యమ్మగారు | తొస్సిపూడి |
| ,, | ద్వా॥ వీరారెడ్డిగారిభార్య ఆదెయ్యమ్మగారు | ,, |
| ,, | ద్వా॥ రామిరెడ్డిగారి కుమార్లు కృష్ణారెడ్డి, వెంకటరెడ్డి, వీరాభ్రాజుగార్లు | ,, |
| ,, | ద్వా॥ సత్తిరెడ్డిగారి కు॥ పెద్దరెడ్డిగారనే వెంకటరెడ్డి పాపారెడ్డి, రామారెడ్డి, సూరారెడ్డి వీరాభ్రమరెడ్డి యం. యస్. సి. గార్లు | ,, |
| ,, | ద్వా॥ నారాయణరెడ్డిగారి కు॥ సూర్యనారాయణరెడ్డిగారు | ,, |
| ,, | ద్వా॥ వీరెడ్డిగారి కు॥ రెడ్డిగారనే వెంకటరెడ్డిగారు | ,, |

వీరందరికీ శ్రీసద్గురుమూర్తి ఆయురారోగ్య అష్టఐశ్వర్య పుత్రపౌత్రాభి వృద్ధులుగా జేసి రక్షించుగాక॥

ఇట్లు
అరట్ల రామారావు

## —✻ గురుబంధువర్గము ✻—

| | | | |
|---|---|---|---|
| అ॥ ప॥ శ్రీ | బోధానంద సజ్జా రామమూర్తిగారు | | ఆచంట |
| ,, | నిత్యానందకొండోజు సీతయ్య | ,, | శికిందరాబాదు |
| ,, | భూమానంద తోట వెంకటస్వామి | ,, | ,, |
| ,, | పూర్ణానంద అరిగె రామస్వామి | ,, | ,, |
| ,, | దయానంద పొన్నాల రాజయ్య | ,, | ,, |
| ,, | గురుకరుణానంద గుండా ఈశ్వరయ్య | ,, | ,, |

| | | | |
|---|---|---|---|
| ఆ॥ ప॥ శ్రీ॥ | తొత్తడి నరసమ్మ నిర్మలాంబ | ,, | విజయవాడ |
| ,, | కూరాకుల రంగనాథపంచదసీస్వామి | ,, | నరసన్నపేట |
| ,, | సత్యనారాయణమ్మ అమలాంబ | ,, | ,, |
| ,, | జొన్నలగడ్డ కామేశ్వరమ్మ విమలాంబ | ,, | రామచంద్రపురం |
| ,, | పెంట దాలయ్య యదార్థబోధోపదేశికస్వామిగారు | | కాసీబుగ్గ |
| ,, | రొంగల అచ్చమాంబ సమరసనిర్మలాంబ | ,, | విజయనగరం |
| ,, | జొన్నాడ బాలయ | గారు | శికిందరాబాదు |
| ,, | హరికృష్ణ | ,, | ,, |
| ,, | వెంకటేశం | ,, | ,, |
| ,, | హనుమంతరావు | ,, | ,, |
| ,, | గురుచరణపావని తోలేటి నరసమాంబ | ,, | రామచంద్రపురం |
| ,, | నిత్యానంద జంపన జగన్నాధరాజు | ,, | బాలాంతరం |
| ,, | కొండరాజు | ,, | ,, |
| ,, | సమరసనిర్మలానంద దువ్వూరి రామసుబ్బారావుగారు | | రామచంద్రపురం |
| ,, | భూమానంద జోశ్యులజననీ జగన్నాధంగారు | | పెనుగొండ |
| ,, | పూర్ణానంద రామేన ఆదినారాయణ | ,, | రాజమండ్రి |
| ,, | ,, నన్యాసమ్మ | ,, | ,, |
| ,, | సమరసానందపచ్చిపులుసు సత్యనారాయణగారు | | తాడేపల్లిగూడెం |
| ,, | కోనసూర్యనారాయణ | ,, | ,, |
| ,, | ఉదండరావు అద్వయరహితానంద అప్పలనర్సయ్య | | వరదరాజపురం |
| ,, | గూఢానంద ఉపేంద్రరావు | గారు | ఖరగ్‌పూర్ |
| ,, | పూర్ణానంద రఘుపాత్రుని సూర్యనారాయణ | ,, | వరదరాజపురం |
| ,, | పూర్ణాంబకోట నరసమ్మ | ,, | భట్లపాలిక |
| ,, | ప్రవిమలాంబ చింతా భద్రమ్మగారు | | హైదరాబాదు |
| ,, | సమరసనిర్మల ప్రజ్ఞాన విలక్షణ మద్దూరి శ్రీరామమూర్తి | | ,, |
| ,, | కర్రి సీతయ్యమ్మగారు | | పసలపూడి |
| ,, | పార్వతమ్మగారు | | నరసన్నపేట |

—o—

## శ్రీమదచల పరిపూర్ణులగు అరట్ల రామారావు సమరస నిర్మల ప్రజ్ఞాన విలక్షణస్వామి వారి శిష్యమండలీ.

| | | |
|---|---|---|
| శ్రీ అ. ప. | బొజ్జ కామన్న | తంగుళ్ళపేట. |
| ,, | నారాయణమ్మ | ,, |
| ,, | రామ్మూర్తి | ,, |
| ,, | సుందరం | ,, |
| ,, | తిరుమూర్తి (భూమానంద) | ,, |
| ,, | జేజమ్మ | ,, |
| ,, | ముక్కాల లింగమూర్త్యాచారి (నిశ్చలానంద) | రామచంద్రపుర అగ్రహారం |
| ,, | జుత్తు చంద్రయ్య | ,, |
| ,, | యాళ్ళ అప్పన్న | ,, |
| ,, | గేదెల వరదరాజులు | |
| ,, | కర్రి పండా | వరదరాజపురం |
| ,, | అప్పలమ్మ | ,, |
| ,, | కొంపెల్ల నాసమ్మ (గురుకరుణాకుమారి) | భట్లపాలిక |
| ,, | ఆకెళ్ళ సీతమ్మ | ,, |
| ,, | నిడదవోలు శ్రీరంగం | ,, |
| ,, | ఆకెళ్ళ నరశింహం | ,, |
| ,, | నిడదవోలు రత్తమ్మ | ,, |
| ,, | చల్లగాలి సీతయ్యమ్మ | ,, |
| ,, | వేబోలు కృష్ణవేణమ్మ సహ సూర్యనారాయణ నిష్కళంక అనిమిషస్వామి | శానపల్లంక |
| ,, | మునికుట్ల ప్రకాశమ్మ | శానపల్లంక |
| ,, | లక్కోజు సుందరమ్మ | ,, |
| ,, | కొసన సత్యవతమ్మ నిరవయనిశ్చలకుమారి | ,, |

| | | |
|---|---|---|
| శ్రీ. అ. ప. | నిడదవోలు బామ్మ (నిర్గుణాంబ) | శానపిల్లంక |
| ,, | రాలి మాచరమ్మ | ,, |
| ,, | మేకా సత్యనారాయణ | ,, |
| ,, | మేకా పెదశ్రీరామమూర్తిగారిభార్య పాపాయమ్మ | ,, |
| ,, | ఒకభక్తురాలు | ,, |
| ,, | నిడదవోలు రామంగారిభార్య సావిత్రమ్మ | ,, |
| ,, | గోల్ సూర్యకాంతమ్మ | ,, |
| ,, | ముంగండ చిట్టమ్మ | ,, |
| ,, | మేడిది పుల్లమ్మ | ,, |
| ,, | మతుకుమిల్లి లక్ష్మినరసమ్మ | ,, |
| ,, | మతుకుమిల్లి సీతమ్మ | శానపిల్లంక మూలపొలం |
| ,, | పుట్టా సీతమ్మ | తేకి |
| ,, | బత్తుల వెంకట్రవణమ్మ | ,, |
| ,, | నెక్కంటి సుబ్బులమ్మ | ఆచంట |
| ,, | నెక్కంటి వెంకట్రత్నమ్మ | ,, |
| ,, | సూరమ్మ | మూలపొలం శానపిల్లంక |
| ,, | బులుసు నాగరత్నమ్మ | గంగలకుర్రు |
| ,, | వెంపరాల సావిత్రమ్మ (నిగూఢదర్శని) | తొండవరం |
| ,, | మప్పలపూడి నాగన్న (నిర్మల విచారణస్వామి) | వానపల్లి. |
| ,, | ,, సూరమాంబ | ,, |
| ,, | అప్పల్లి విశ్వనాథం (నిష్కపటానంద) | ,, |
| ,, | ,, సోదెమాంబ | ,, |
| ,, | ఆచాళ్ళ మాణిక్యాంబ (యదార్థబోధోపదేశకి) | ,, |
| ,, | మప్పలపూడి తాతారావు | ,, |
| ,, | ,, వెంకటరావు | ,, |
| ,, | అన్నందేవర తాతబ్బాయి | ,, |
| ,, | ,, వెంకాయమ్మ | ,, |
| ,, | బండారు సుబ్బాయమ్మనే బుల్లెమ్మ | ,, |

| | | | |
|---|---|---|---|
| శ్రీ. అ. ప. | అప్పల్లి | అన్నపూర్ణమ్మ | వానపల్లి. |
| ,, | గండికోట | సుభద్రాంబ (అమలాంబ) | తొండవరం |
| ,, | ఉప్పలూరి | అన్నపూర్ణమ్మ | ,, |
| ,, | దుప్పలపూడి | రత్తమ్మ | వానపల్లి. |
| ,, | ముండూరి | భ్రమరాంబ | ,, |
| ,, | దేవరపల్లి | బాపినీడు | పామర్రు. |
| ,, | ,, | వెంకటరత్నం | ,, |
| ,, | ,, | వీరరాఘవుడుగారి భార్య లక్ష్మీనరసమ్మ | ,, |
| ,, | ,, | సర్వారాయుడుగారిభార్య కాంతమ్మ | ,, |
| ,, | ,, | వీరన్నగారిభార్య రత్తమ్మ | ,, |
| ,, | తోలేటి | వెంకటరమణ బి.ఎ. తెలుగుపండిట్. | డోకిపర్రు. |
| ,, | ద్వారంపూడి | నారాయణరెడ్డి | తొస్సిపూడి |
| ,, | ,, | కృష్ణారెడ్డి | ,, |
| ,, | ,, | వెంకటరెడ్డి | ,, |
| ,, | ,, | వీ॥ కు॥ వెంకటరెడ్డి | ,, |
| ,, | ,, | సూరమ్మ | ,, |
| ,, | ,, | వెంకాయమ్మ | ,, |
| ,, | మల్లిడి | బుల్లెమ్మాయి | ,, |
| ,, | కర్రి | బుల్లెమ్మ | ,, |
| ,, | మేడపాటి | సత్యవతమ్మ | అనపర్తి. |
| ,, | సత్తి | మాణిక్యమ్మ | ,, |
| ,, | తేతలి | సూరమ్మ | తొస్సిపూడి. |
| ,, | మేడపాటి | సుబ్బమ్మ | ,, |
| ,, | గొలుగూరి | లక్ష్మమ్మ | ,, |
| ,, | చిట్టూరి | సత్యనారాయణగారిభార్యబుల్లెమ్మాయి | ఉండూరు. |
| ,, | చిగురుపాటి | వీరరాజుగారిభార్య సత్యవతమ్మ | ,, |
| ,, | ,, | తాతబ్బాయిగారిభార్య జానకమ్మ | ,, |

| | | |
|---|---|---|
| శ్రీ. అ. ప. | నేమాని హనుమంతరావుగారిభార్య వీరభద్రమ్మ | ఉండూరు. |
| ,, | కానిమిల్లి సుబ్బమ్మ | ,, |
| ,, | చిగురుపాటి అప్పారావుగారిభార్య సూర్యకాంతమ్మ | ,, |
| ,, | కొరిపిల్లి వెంకన్నగారిభార్య జానికమ్మ | ,, |
| ,, | నేమాని వీరాజుగారి భార్య పాపాయమ్మ | ,, |
| ,, | చిరుకూరి అచ్యుతరామయ్యగారిభార్యరవణమ్మ | ,, |
| ,, | కొరిపిల్లి వీరన్నగారిభార్య సుబ్బమ్మ | ,, |
| ,, | చిరుకూరి సత్యనారాయణగారిభార్యవెంకయ్యమ్మ | ,, |
| ,, | బలుసు సత్యనారాయణభార్య అచ్యుతం | ,, |
| ,, | కొరిపిల్లి కృష్ణారావుగారిభార్య వెంకటరమణమ్మ | ,, |
| ,, | ,, సూరన్నగారిభార్య సుందర మాణిక్యం | ,, |
| ,, | ,, సత్యంగారిభార్య బుల్లివీరమ్మ | ,, |
| ,, | ,, అప్పారావుగారిభార్య భూషణం | ,, |
| ,, | ,, వీరాజుగారిభార్య బుల్లెమ్మాయి | ,, |
| ,, | ,, మహాలక్ష్మి | ,, |
| ,, | సాగిరాజు రాజయ్యమ్మ | తనుమళ్ళ |
| ,, | చింతలపాటి వెంకయ్యమ్మ | ,, |
| ,, | సాగి సూరయ్యమ్మ | ,, |
| ,, | సాగిరాజు అప్పలనరసయ్యమ్మ | — |
| ... | దాట్ల సుభద్రమ్మ | — |
| ... | తాడి వెంకన్నగారిభార్య మంగయ్యమ్మ | కొమరిపాలెం |
| ... | తాడి వెంకన్న | — |
| ... | మల్లిడి వీరెడ్డి | రాయవరం |
| ... | ,, అమ్మిరెడ్డి | — |
| ... | సబ్బెళ్ళ సత్యవతమ్మ | — |
| ... | యాదగం శేషమ్మ | — |
| ... | ద్వారంపూడి మంగయ్మమ్మ | మాచవరం |

| | | |
|---|---|---|
| శ్రీ. అ. ప. | సబ్బెళ్ళ మంగయ్యమ్మ | మాచవరం |
| ... | సత్తి సత్తెమ్మ | — |
| ... | మండ బాపిరెడ్డి | — |
| ... | ,, సత్తెమ్మ | — |
| ... | ,, సత్తిరెడ్డి | — |
| ... | తాడి శేషమ్మ | — |
| ... | కర్రి సుబ్బయ్యమ్మ | — |
| ... | ,, గంగన్నగారి భార్య సుబ్బయ్యమ్మ | — |
| ... | మేడపాటి బుల్లిసూరీడు | — |
| ... | గొలుగూరి వెంకటిరెడ్డిగారిభార్య మాణిక్యం | — |
| ... | కర్రి బుల్లెమ్మాయి | పులగుర్త |
| ... | యెండమూరు మహాలక్ష్మమ్మ | — |
| ... | ,, గంగాలమ్మ | — |
| ... | సబ్బెళ్ళ బుల్లి వీరమ్మ | — |
| ... | తాడి సత్తిరెడ్డి | — |
| ... | ,, మాణిక్యమ్మ | — |
| ... | మల్లిడి శేషయ్యమ్మ | — |
| ... | తోటకూర సూరమ్మ | — |
| ... | తాడి సత్తెమ్మ | — |
| ... | ,, అమ్మాయి | — |
| ... | ,, వీరమ్మ | — |
| ... | బొప్పని శేషమ్మ | — |
| ... | మేకా రామాయణి | — |
| ... | కొప్పిలి శేషమ్మ | — |
| ... | చా॥ గన్నెమ్మ | — |
| ... | ,, పుల్లమ్మ | — |
| ... | మొండి సుబ్బయ్యమ్మ | — |

| | | |
|---|---|---|
| శ్రీ. అ. ప. | దేవళ్ళ అమ్మన్నగారిభార్య సత్యవతమ్మ | పందలపాక |
| , | పత్తిపాటి సత్యంగారిభార్య శేషమ్మ | , |
| , | పడాల కృష్ణమూర్తిగారిభార్య వీరమ్మ | , |
| , | నిడదవోలు వెంకమ్మ | , |
| , | బొద్దాన్ బంగారమ్మ | , |
| , | కర్రి సుబ్బయ్యమ్మ | , |
| , | పాతూరి అమ్మన్నగారిభార్య బుల్లెమ్మ | , |
| , | రాయుడు చినసూరమ్మ | , |
| , | సబ్బెళ్ళ బులివీరమ్మ | , |
| , | పడాల వెంకటరెడ్డి | అర్తమూరు |
| , | పడాల సూరమ్మ | , |
| , | తేతలి మంగయ్యమ్మ | , |
| , | సత్తి మంగయ్యమ్మ | , |
| , | చింతా మంగయ్యమ్మ | , |
| , | కర్రి బుల్లెమ్మ | , |
| , | కర్రి అమ్మన్నమ్మ | , |
| , | కర్రి రామకృష్ణారెడ్డి | , |
| , | కర్రి మాణిక్యం | , |
| , | తమనంపూడి మంగయ్యమ్మ | , |
| , | గొలుగూరి గొల్లమ్మ | , |
| , | తమనంపూడి వీరమ్మ | , |
| , | చిల్ల సూరమ్మ | , |
| , | తమనంపూడి రామిరెడ్డి అనే అబ్బాయి | , |
| , | కాసులమ్మ | , |
| , | పడాల వీరమ్మ | , |
| , | తాడి మాణిక్యం | , |
| , | తేతలి సూరమ్మ | , |

| | | |
|---|---|---|
| శ్రీ. అ. ప. | నల్లమిల్లి గంగమ్మ | అర్తమూరు |
| ... | ముత్యాల తాతబ్బాయి | చెల్లూరు |
| ... | బుల్లెమ్మ | , |
| ... | దేవళ్ళ వీరమ్మ | , |
| ... | వల్లూరి సూరమ్మ | , |
| ... | ముత్యాల వీరమ్మ | , |
| ... | ఇమ్మెళ్ళ పెదసత్తిరాజు | పెద్దాడ |
| ... | రామేశ్వరపు పట్టాభి | , |
| ... | యిందన సుబ్బారావు | అనకాపల్లి |
| ... | యేలూరి ముత్యాలమ్మ | వేమగిరి |
| ... | కొత్తలంక మహాలక్ష్మమ్మ | , |
| ... | కొత్తలంక చిట్టెమ్మ | , |
| ... | రావిపాటి శేషమ్మ | , |
| ... | రావిపాటి సుబ్బమ్మ | , |
| ... | రావిపాటి మంగమ్మ | , |
| ... | మద్దిరెడ్డి మాణిక్యం | , |
| ... | రావిపాటి సుభద్రమ్మ | , |
| ... | మరివాడ మహాలక్ష్మమ్మ | కపిలేశ్వరపురం |
| ... | మరివాడ సూరమ్మ | , |
| ... | కామిని రామబుల్లెమ్మ | , |
| ... | పెనుమత్స వెంకటపతిరాజు | దేవరపల్లి |

—: శ్రీకాకుళ జిల్లా కాసీబుగ్గలో :—

శ్రీ సమరస నిర్మలానంద సన్యాసాచార్యులవారి శిష్యమండలి

| | | |
|---|---|---|
| శ్రీ. అ. ప. | పెంట జానికమ్మ సహా దాలయాచార్యులు | కాశీబుగ్గ |
| ... | పెంటగురుమూర్తి | , |
| ... | సప్ప కామన్నపాత్రో | , |
| ... | పెంట అమ్మన్నమ్మ | , |

## శ్రీ దాలయాచార్యుల శిష్యమండలి

| | | |
|---|---|---|
| శ్రీ. అ. ప. | పరశురామ్ మహాపాత్రో | కాశీబుగ్గ |
| ... | తలపాక మృత్యుంజయాచారి | , |
| ... | సప్పశశి రేకమ్మ | , |
| ... | గున్న అప్పలస్వామి యీ సావిత్రమ్మ | బాలిగాం |
| ... | గున్న వెంకటస్వామి యీ కృష్ణవేణమ్మ | , |
| ... | వల్లభ లక్ష్మమ్మ | , |
| ... | యేరుకోల మోహనరావు | పితాడి |

## శ్రీ నిర్మలవిచార్ దుప్పలపూడి నాగన్నగారి శిష్యమండలి - వానపల్లి.

| | | |
|---|---|---|
| శ్రీ. అ. ప. | కడలి సూర్యనారాయణమూర్తి | వానపల్లి |
| ... | వనుం రామన్న | , |
| ... | రాయిడు నారాయణమూర్తి | , |
| ... | ఓండపు శేషాయమ్మ | , |
| ... | బండారు తాయారమ్మ | , |
| ... | బండారు రత్నము | , |
| ... | తోలేటి వీరవెంకట్రావు | రాజమంద్రి |
| ... | తోలేటి సత్యనారాయణ | , |
| ... | తోలేటి పాపాయమ్మ | , |
| ... | తోలేటి సీతమ్మ | , |
| ... | రాజామణి | , |
| ... | లక్ష్మీకాంతం | , |
| ... | కంసాలి బ్రహ్మము | , |
| ... | రత్నావతి | , |
| ... | సత్యవతి | , |
| ... | బూరమ్మ | , |
| ... | గొలకోటి చల్లాయమ్మ | చంద్రవరం |

| | | |
|---|---|---|
| శ్రీ. అ. ప. | షేక్ లాల్ సాహేబు | కోణితివాడ |
| ... | బూబమ్మ | , |
| ... | తానేలంక వీరన్న | దేవరపల్లి |
| ... | తానేలంక పెరియ్య | , |
| ... | తానేలంక సూరేకాంతము | , |
| ... | గవర సత్యన్నారాయణమూర్తి | , |
| ... | నల్లా వెర్రియ్య | మందపల్లి |
| ... | గొలుగూరి జగన్నాథరెడ్డి (మునసబు) | కామరాజులంక |
| ... | సత్తి రామిరెడ్డి | , |
| ... | చిట్టెమ్మ | , |
| ... | షేక్ సూరేకాంతం | ర్యాలి |
| ... | శికాకోళపు సత్యన్నారాయణ | వాడపాలెం |
| ... | బండారు వీరన్న | , |
| ... | అమ్మ అన్నాజీరావు (ప్లీడరు) | అమలాపురం |
| ... | నాంచారమ్మ | వనుగపల్లి |
| ... | రత్నాంబ | , |

# —* విషయసూచిక *—

పేజీ




శ్రీ శివరామదీక్షిత అచలఋషీ పరబ్రహ్మణేనమః

శ్రీమద్గురు సరస్వతీ దుర్గానంద పంచదసీస్వామి సద్గురుపరబ్రహ్మణేనమః

## —* పరిపూర్ణ బోధస్తుతి *—

శ్లో॥ యస్యాంతర్నాది మధ్యం । నహికర చరణం । ననామగోత్రం ।
నసూత్రం, నోజాతిర్నైవవర్ణా । నభవతి పురుషో । నానపుంసం
నచస్త్రీం, నాకారం నైవకారం । నహి జనన మరణం ।
నాస్తి పుణ్యం । న పాపం, నోతత్వం తత్వమేకం । సహజ సమ
రసం । సద్గురుం తన్నమామి ॥

శ్లో॥ ఆత్మానాత్మ వినాశహేతుమనిశం । సర్వాతిరిక్తం శుభం
పూర్ణాత్పూర్ణ మనామయం । సుఖతరం సర్వాపద ధ్వంసకం
సర్వజ్ఞాన వినాశకం గురుపదం । సర్వాత్మకం నిర్మలం
సర్వభ్రాంతి వివర్జితం గుణహరం । సంపూర్ణ బోధం నమః

శ్లో॥ సజ్ఞాతం పరవస్తు నిత్య మచలం । సత్యంస్థితం శాశ్వతం
నిత్యానిత్య వివేకభేద రహితం । నిర్నామ నిర్లేపకం
సర్వప్రత్యయ నాశకంచ సతతం । సర్వత్రి సంస్థంపరం
వందేహం పరిపూర్ణబోధ మనిశం । సందేహ నాశం ప్రభుం॥

## —* మహాసంకల్పము *—

పంచదశీ మహామంత్రార్థాంతర్గత ॥ జగత్సృష్టిమధ్యే । అశరీర గురు పద శాంతిస్నాన మహాంకరిష్యే । శ్రీఖండాఖండవిరహితాయ । మద్గురు పాద సన్నిధౌ । శ్రీ నిజగురు దర్శనస్పర్శన । కరుణాకటాక్ష వీక్షణ సిద్ధ్యర్థం। శ్రీనిజగురు ఆజ్ఞ । పరాప్రాజ్ఞా మంత్రానుష్ఠాన । విధాన మహాంకరిష్యే

అస్మిన్ గురుపదశాంతి స్నాన సమయే । మధ్యమ సృష్ట్యారభ్యాం । బ్రహ్మనందనామ సంవత్సరే । తుర్యాతీత అవ్యక్తన్నామఋతౌ । జ్ఞానాజ్ఞాన శూన్యమాసే । కేవలాత్మ పక్షే । జన్మాంతర మస్మ పుణ్యాతిథౌ । నిష్కళావాసరే ప్రకృతిద్వయ దోషరహిత నక్షత్రే స్వప్నావరణాగోత్రస్య శ్రీమద్గురు సరస్వతీ దుర్గానంద పంచదశీస్వామి నిజగురు రాజయోగినామధేయస్య । అవినాశశ్ఛందాయ । అభవో దేవాయ । అమృత బీజాయ । భ్రమాబ్రహ్మా వాహమస్మీయహం పదార్థరాహిత్య పరిమేయ శక్త్యాయ సమవ్యవహారిక స్వాప్నేత్ర్యోగానాం । బాల్య యవ్వన కౌమార వార్ధిక్య కాలే । విద్యావిద్య । కర్మజన్మవాసన రహితాయాం । నిస్సంగ నిజగురు పదశాంతి స్నానసిద్ధ్యర్థం । షోడశోపచార పూజావిధాన మహంకరిష్యే ।



శ్రీ సద్గురుభ్యోన్నమః

# —* అనుష్ఠానవిధి *—

## —: గురుపరంపరధ్యానం :—

నమో బ్రహ్మాదిభ్యో । బ్రహ్మవిద్యా సాంప్రదాయ కర్తృభ్యో ॥ వంశఋషిభ్యో । మహద్భ్యో నమోగురుభ్యః ॥ సర్వోపప్లవరహిత । ప్రజ్ఞానఘనప్రత్యగర్థో । బ్రహ్మైవాహమస్మి । అహంపదార్థ రహితః॥

## —: శ్రీ మహావిష్ణు సాంప్రదాయం :—

శ్లో॥ శ్రీబ్రహ్మవిద్యా గురు విష్ణు సూర్యం
శ్రీ యాజ్ఞవల్క్యం జనకం శుకంచ
సాందీపమీశం । కృష్ణంచ అర్జునం
వందే గురూన్ గురునాథ కాంతం॥

## —: శ్రీ శివరామ దీక్షిత సాంప్రదాయం :—

శ్లో॥ శ్రీధర. స్వామినం నిత్యం । బోధకారణ మవ్యయం
జ్ఞానాతీత మహం వందే । సుఖజ్ఞానైక విగ్రహం॥

శ్లో॥ పంచాంగ జననుంచారం । వందేహం తన్నిరంతరం
నామద్వయ పంకజం శుద్ధం । శివరామాఖ్య దీక్షితం॥

శ్లో॥ యస్యబోధ దయాత్సర్వం । బ్రహ్మైవేద్య వగమ్యతే॥
శివరామ విధిఖ్యాతం । తద్దైవత ముపాస్మహే॥

శ్లో॥ కామాది రిపుహంతారం । రామలింగాఖ్య చరణామృతపాన
సారంగం, పరమానందాఖ్యగురుం పరం । ధ్యానం వందేమద్గురుం॥

శ్లో॥ శ్రీమద్దేశికాన్వయాబ్ధిచంద్ర మనోరమం। నిత్యానందప్రకృపామృత
నా శ్రీకృతే శ్రీసదానందాఖ్య । గురుంపరం॥

శ్లో॥ శ్రీనాగార్య పాదకమలామృత । పానభృంగం భావాతీత
పరమ గుంహ్యాలభ్యం । బలరామాఖ్యపండితం॥

శ్లో॥ శ్రీబలరామార్య చరణసేవా దురంధరం । అచలపరిపూర్ణ
కేవలాత్మ స్వరూపకం । శ్రీకృష్ణమాచార్య పాదద్వంద్వాంభజే॥

శ్లో॥ శ్రీకృష్ణమాచార్య పాదపంకజ చంచరీకం ।
శ్రీరాజయోగకులనాద్భిపూర్ణ ఘోషం
శ్రీపరమగురు సమరస నిర్మలానంద
సన్యాసాచార్య సద్గురుచరణం భజామ్యహం॥

శ్లో॥ శ్రీసన్యసయ్య ప్రభు దేశికేంద్ర కారణం
శ్రీపూర్ణబోధ పరతత్వ పరమ ప్రకాశకం
శ్రీదుర్గానంద సరస్వతీ పంచదసీస్వామి
సద్గురు చరణం భజామ్యహం॥

శ్లో॥ శ్రీసరస్వతీ దుర్గానంద పంచదసీస్వామి
త్రిప్రసాద వుచ్ఛిష్ట స్వీకరణేణుక్
శ్రీరామ సమరసనిర్మల ప్రజ్ఞానవిలక్షణ
సద్గురు చరణం భజామ్యహం॥

శ్లో॥ అస్మద్గురు సమారంభం । కృష్ణసాందీప మధ్యమాం
శ్రీమహావిష్ణు పర్యంతాం । వందేగురు పరంపరం॥

## —: శ్రీ విమలాంబ కామేశ్వరమ్మగారి ధ్యాన శ్లోకం :—

శ్లో॥ శ్రీసన్యసాచార్య పాదకమలామృత పానభృంగం
శ్రీసమరస నిర్మలానంద పీఠస్థసనాచారిణం
శ్రీపూర్ణబోధ పరతత్వ పరమప్రబోధినం
విమలాంబకామేశ్వరీ సద్గురుచరణం భజామ్యహం ॥

శ్లో॥ శ్రీవిమలాంబకామేశ్వరీ పదపంకజ చంచరీకం
శ్రీనారాయణస్వామి శివరామదీక్షిత పీఠస్థాపనాచారిణం

శ్రీపడాలాన్వయ పరిపూర్ణబోధ కంఠీరవాంబ
మాతృశ్రీ గంగయాంబ సద్గురుచరణం భజామ్యహం॥

జై శ్రీసద్గురు ప్రభు మహారాజుకీ జై॥

## —: శ్రీ నిజ గురు లఘు పూజా విధానము :—

శ్లో॥ గురుర్బ్రహ్మ గుర్రోర్విష్ణుం । గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్పరంబ్రహ్మం । తస్మై శ్రీగురవేన్నమః

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం । కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగన సదృశం । తత్వమశ్యాదిలక్ష్యం
ఏకంనిత్యం విమల మచలం । సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణ రహితం । సద్గురుం తన్నమామి॥

శ్లో॥ ధ్యాన మావాహనం సింహాసనం । పాద్యం తథైవచ
అర్ఘ్యమాచమనియ్యంచ । స్నానం పంచామృతైస్సహ।
శ్లో॥ శుద్ధోదకం వస్త్రయుగ్మం । యజ్ఞ సూత్రం విభూషణం
విలేపనం చాక్షతాంపుష్పం । స్వర్ణ వినిర్మితం॥

శ్లో॥ ధూపదీపంచ నైవేద్యం । పానీయ్యం ఫలమేవచ
తాంబూలం దక్షిణా ర్తిక్యం । మంత్రపుష్పం ప్రదక్షిణం।
శ్లో॥ నమస్కారం దేశికేంద్ర । మయాతుభ్యం నివేదయే
కృపయా గృహ్యతాం స్వామిన్ । న్యూనాధిక్యం న చింతయా।
శ్లో॥ లఘుపూజా విధిన్ । భాగవతికృష్ణ ద్విజన్మనా
రచితంశ్రోత్రవక్తృణా । మిదం మోక్షకరం పరం।

## —: పరిపూర్ణ అచల ధ్యానం :—

శ్లో॥ పూర్వమేవ నిరాలంబం । ఆగ్నేయే నిర్గుణం తథా
దక్షిణే నిత్యశుద్ధంచ । నైఋత్యే నిరుపద్రవః॥

శ్లో॥ పశ్చిమే నిష్కళంచైవ । వాయువ్యేచ నిరంజనం
ఉత్తరేశ నిరాకాశం । ఈశాన్యే నిర్మలోభవేత్॥

శ్లో॥ ఊర్ధ్వమేవ నిరాకారం । అధశ్చ నిర్వికారకః
అంతర్బహిశ్చ సర్వత్ర । అచలోయం సనాతనః॥

—: పరాపూజా :—

శ్లో॥ పూర్ణస్యావాహనం కుత్ర । సర్వాధారస్యచాసనం
స్వచ్ఛస్య పాద్యమర్ఘ్యంచ । శుద్ధస్యాచమనం కుతః॥

శ్లో॥ నిర్మలస్య కుతస్నానం । వస్త్రం విశ్వోదరస్యచ
నిరాలంబస్యోపవీతం । రమస్యాభరణం కుతః॥

శ్లో॥ నిర్లేపస్య కుతోగంధః । పుష్పంనిర్వాసనస్యచ
నిర్గంధస్య కుతోధూపః । స్వప్రకాశస్య దీపకం॥

శ్లో॥ నిత్యతృప్తస్య నైవేద్యం । నిష్కామస్య ఫలంకుతః
తాంబూలం విభోకుత్ర । నిత్యానందస్య దక్షిణా॥

శ్లో॥ స్వయంప్రకాశ మానస్య । కుతోనీరాజనాదికం
ప్రదక్షణ మనంతస్య । అద్వితీయస్యకా స్తుతిః॥

శ్లో॥ అంతర్బహిశ్చపూర్ణస్య । కథముద్వాసనంభవేత్
ఇయమేవ పరాపూజా । సర్వావస్థాసు సర్వదా।

శ్లో॥ ప్రేమబుధ్యాసు సర్వేశో । మనోదేవో నివేశయేత్
ఏషామజ్ఞాన జీవానాం । సమస్తారిష్ఠశాంతయె
యద్యబోధవ్య మఖిలం । తత్త్వద్భక్త్యా బ్రవీమ్యహం।
ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

—: శ్రీ గురుమాలా మంత్రము :—

ఓం నమశ్రీ గురుదేవాయ । పరమ పురుషాయ । సర్వదేవతా వశీకరాయ । సర్వారిష్ఠ వినాశాయ । సర్వమంత్ర చ్ఛేదనాయ త్రైలోక్యం వశమానాయస్వాహా॥

శ్రీ సద్గురుభ్యోన్నమః

# —* ద్వాదశాక్షరీ మహామంత్రం *—

శృతి :— వికార రహితమేవ ఈశ్వరః॥
గీర్వాణము :— అభావం శివం అశివం నలిప్యతే = 12
ఆంధ్రము :— నిరాకార పరిపూర్ణం యేమీ లేదు = 12
గీర్వాణము :— అయంవ్యక్త బాహ్య కోపీన భవతి = 12
ఆంధ్రము :— ఈ వృత్తబట్టబయలు యేమీ లేదు = 12.

## ——* ద్వాదశాక్షరీ మహామంత్ర మూలం *—

అస్యశ్రీ ద్వాదశాక్షరీ మహామంత్రస్య । అచలఋషిః । అవినాశ చ్ఛందః । అప్రమేయ శక్తిః । అభవో దేవతా । అమృతబీజం అయమాత్మా తత్వమస్యాది । జ్ఞాన రహిత కీలకం అఖిల కాలేషు పరిపూర్ణమస్తి। మాయాసహిత మేతత్ప్రపంచాదికంనాస్తీతి । నిశ్చయ సిద్ధ్యర్థం । ద్వాదశాక్షరీ మహామంత్ర జపంకరిష్యే ॥

## — * అథ అంగన్యాసః *—

అయమఖండాయ :— అంగుష్ఠాభ్యాంనమః
వ్యక్తమభావాయ :— తర్జనీభ్యాంనమః
బాహ్యప్రమేయాయ :— మధ్యమాభ్యాంనమః
కోపీన భవతీత్యసంగాయ :— అనామికాభ్యాం నమః
అయమవాత్మాయ :— కనిష్ఠకాభ్యాం నమః
వ్యక్త బాహ్య కోపీన భవతీ అశరీరాయ :— కరతలకర పృష్ఠాభ్యాంనమః॥

## —* అథ హృదయాదిన్యాసః *—

అయమఖండాయ :— హృదయాయనమః
వ్యక్తమభావాయ :— శిరసేస్వాహా

బాహ్యాప్రమేయాయ :— శిఖాయైవౌషట్
కోపీన భవతీత్యసంగాయ :— కవచాయహుం
అయమవాత్మాయ :— నేత్రత్రయాయ వౌషట్
వ్యర్థబాహ్యకోపీసభవతి అశరీరాయ :— హస్త్రాయ ఫట్

బ్రహ్మైవాహమస్మీయహం పదార్థ రహితః
భూర్భువస్సువరోమితి దిగ్బంధః ద్రిష్టదర్శన దృశ్యాది రహితః

—* మంత్రసారం *—

శ్లో॥ ఏతన్మిధ్యాశుర్ధ వియత్ । కించిన్నాస్తితి తేమయా
కృపయా పరమం ప్రోక్తం । భజాగ్రే ద్వాదశాక్షరం॥

—* మంత్రధ్యానము *—

శ్లో॥ అచలం చాద్యం సర్వలోకేషు పూర్ణం
సర్వాతీతం స్వానుభూతావ గమ్యం
సర్వాభాద్యం సర్వకర్తృత్వ సూన్యం
సర్వావేద్యం సర్వసూన్యం సబాహ్యం॥

శ్లో॥ అవాత్యం హ్యఖండం । హ్యలక్ష్యం హ్యభాద్యం
హ్యసంగం హ్యవేద్యం । హ్యచింత్యం హ్యరూపం
హ్యసాద్యం హ్యనాద్యం । హ్యతీతం హ్యనంతం
హశుద్ధం హ్యబుద్ధం । హ్యనామం నమామి॥

—* మంత్రార్థం *—

శ్లో॥ మృత్యుజన్మ భయదుఃఖ వర్జితం
స్వప్నదృశ్యదృక్ ద్రిష్ట నాశనం
అప్రితర్క్యమమలం నిరామయం
అనుపమాన శివం నమామ్యహం॥

శ్లో॥ నిత్యపూర్ణాయ సత్యాయ । నిశ్చలాయ నిరీహ్యతే
నిరాకారాయ నిత్యాయ । మద్రిహాత్తే నమోస్తు నమః॥

జై శ్రీగురు.

## —: షోడశాక్షరీ మహామంత్రమూలము :—

అస్యశ్రీ నిరుపమాన షోడశాక్షరీ మహామంత్రస్య। నిరంజన ఋషిః। ఓంకార నిశ్ఛందః । నిరామయ నిరాకాశోదేవతా నిరావరణ బీజం । నిస్త్రిగుణ్యశక్తిః । నిర్గుణ పరిజ్ఞానరహిత కీలకం । నిఖిలకాలేషు మాయా సహిత షడ్భావరహిత నిశ్చయ సిద్ధ్యర్థం । షోడశాక్షరీ మహామంత్ర జపం కరిష్యే ॥

## —: అథ అంగన్యాసః :—

మూలం నిర్ద్వంద్వాయ :— అంగుష్ఠాభ్యాం నమః
అభావం నిశ్చలాయ :— తర్జనీభ్యాం నమః
ఇదం నిరవయామి :— మధ్యమాభ్యాం నమః
జ్ఞాతుం నిర్మలాయ :— అనామికాభ్యాం నమః
నశరీరం నిరతిశయాయ :— కనిష్ఠకాభ్యాంనమః
నకిమస్తి నిర్మోహాయ :— కరతలకర పృష్ఠాభ్యాంనమః

## —: అథ హృదయాదిన్యాసః :—

మూలం నిర్ద్వంద్వాయ :— హృదయాయనమః
అభావం నిశ్చలాయ :— శిరసే స్వాహా
ఇదంనిరవయామి :— శిఖాయై వౌషట్
జ్ఞాతుం నిర్మలాయ :— కవచాయుహుం
నశరీరం నిరతిశయాయ :— నేత్రత్రయాయ వౌషట్
నకిమస్తి నిర్మోహాయ :— హస్త్రాయఫట్
మూలాభావ మిదంజ్ఞాతుం నశరీరం నకిమస్తి భూర్భువస్సువరోమితి దిగ్బంధః ।

## —: మంత్రసారం :—

శ్లో॥ నిర్మూల మేదాతజ్ఞాన । శ్చరీరం నాస్తి కేవలం
షోడశాక్షరీ తత్ సిద్ధ । మిమవప్యనిశం భజే ॥
శ్లో॥ సర్వనిగమ గుహ్యం । శాశ్వతం సర్వకాలం
సకల దివిజ వంద్యం । సర్వదిక్పూర్ణ మచలం

సకల భయ నివారం । సర్వలోకాంతరస్థం ।
సకల ముని హృది స్థం సర్వదేశ ప్రశస్తం ॥

## —: మంత్ర ధ్యానం :—

శ్లో॥ సజ్ఞాతం పరవస్తురూపరహితం । నిస్తేజశ్చామృతం సదా ।
నిష్కామం నిరుపాసనం నిరుపమం । నిర్దేశ రహితం శివం
నిత్యాభాస వివర్జితం విహిత సద్వ్యాపార సూన్యం సదా
నిస్సంగం నిరుపాధికం । నిరవయం నిత్యంస్థితం నిర్మలం ॥

## —: మంత్రార్థం :—

శ్లో॥ ఆనంద రహిత మచలం స్మరామి
నిర్జాత నిర్జాత నిరింద్రియత్వం
నిర్మోహ నిర్ద్వంద్వ నిరూప సత్వం
మహాగురుం నిత్యం మహంనమామి ॥

శ్లో॥ నిరాలంబాయ నిత్యాయ । నిర్మలాయ నిరంజన
నిత్యశుద్ధాయ బుద్ధాయ ।·వస్తుమద్రహితన్నమః

## పంచదసీ మహామంత్రము. దృష్టాంతము.

స్వప్నే ప్రతీయమాన రూపాణిచ యథాతథా — 15
కలలో తోచిన శరీరాలేలాగో ఆలాగే — 15

## దార్ష్టాంతము లేక ప్రత్యక్షము.

కర్పూర దీప సంయోగం జ్యోతిరూపం యథాతథా
కర్పూరము కలికకూడితె యేలాగో ఆలాగే

సర్వం (శ్రీ) సద్గురు చరణారవిందార్పణమస్తు.
జై (శ్రీ) నిజగురు శివరామ దీక్షిత ప్రభు మహారాజుకీ జై
(శ్రీ) మద్గురు సరస్వతీ మగ్గానంద పంచదసీస్వామి సద్గురు ప్రభు
మహారాజుకి జై.

## —* గురుపరంపరా మంగళహారతి *—

ఇదిగో హారతీ । సదాజన్మరహితులకును ॥ ఇదిగో ॥

(1) శ్రీమన్నారాయణ పరశ్రీ సద్గురునకునూ । నీమామిడువక నిజగురు
శ్రీసూర్యునకునూ ॥ భూమాసమతుల్యుండౌ యాజ్ఞవల్క్యునకు శిష్యుడౌ
రామునిమాహా జనకరాజ యోగులకూ ॥ ఇదిగో హారతీ ॥

(2) శ్రీశుకమహాఋషివరులకు సత్యమునేలేననుచూ । దేశిక సాందీపుల
కిదెద్వయదోషారహితముతో । ఆశారహితుండై యీనాటకసూత్ర
ము కలయనె । దేశిక శ్రీకృష్ణునకును । భామిని రుక్మిణిమణికి ॥ఇ॥

(3) శ్రీధర శివరాములకును నాదరహిత మిది యనుచు ।
సాదరముగ సద్గురుడౌ రామాలింగార్యులకును ।
బాధలు బాపిన సద్గురు దేశికయ్యకు ముదమున
యీధర పరమారాధ్య । శివనందా నాగయ్యల ॥కిదిగో హారతీ॥

(4) కపటానాటక మిదియని పరమపరోక్షము జేసి,
ద్విపదార్థములు వ్రాసిన బలరామాచార్యులకును
చపలాచిత్తమువిడచి కృష్ణామాచార్యులకును
విపులామహా పళ్లెరమున కర్పూర హారతి బట్టుచు ॥ఇదిగో హారతీ॥

(5) అంతరబహిరమునంగల మంతన రహితము దెల్పి
సంతాకూటములోనన్ కలగానే కలిపి
ఇంతంతనయనరానీ భ్రాంతీ రహితముసేయునట్టి
నంతము నేమీలేదను సన్యాసాచార్యులకును ॥ఇదిగో హారతీ॥

(6) భద్రాద్ర్యంకితమంచున భద్రిము తానెరిగి
క్షుద్రాముద్రాలోపలి సాక్ష్యో తానరిగి
నిద్రాలోమాట్లాడెనిజయున్కి గల్గిన
భద్రాత్మక స్థితిపరుడౌ మద్గయ్యార్యులాకు ॥యిదిగో హారతీ॥

(7) సతమత పామరజనులకు పరదేవిని నిల్పి
కొతలంకావలితో సహా సన్యాసార్యులగొల్చి
మతిమతియా నర్సక్కా గంగాయాంబలతోడా
సతతము సత్సభల్ జరిపెటి కామేశ్వరి గురుమాతకు ॥ఇదిగో॥

(8) తొస్సూడుపుర భవనంబున గురుమందిర మేర్పరచీ ।
యీ స్పృహజగముల రెంటిని నిస్పృహగాజూచీ । సద్గురు కామే
శ్వరిచే కంఠీర్వాంబని యనబడు మద్గురు దేవుః మాతొ గంగా
యాంబకు యిపుడూ ॥ యిదిగో హారతీ ॥

(9) భారతి దుర్గానందుని తీరుగ తాగొల్చి
వారకగుర్త్తా మేనుల ఎర గురులకు నిచ్చి
పారావారముబాపే పరమాసద్గురువరుడౌ
సీతామహాలక్ష్మి సహా సమరస రామూలాకు ॥ ఇదిగో ॥

ఇట్లు పైనివ్రాసిన విధానముగా నిత్యమూప్రభాతమున భక్తులైన
వారు శుచియై గురుపీఠ మేర్పరచుకొని నిత్యానుష్ఠానము చేసుకొని మన
నము చేయవలెను. ఇట్లు అనుష్ఠాన మననము తరువాత మంత్రి జపము
చేయవలెను. అది యెట్లనగా మొట్టమొదట "ఓం నమః శ్రీగురుదేవాయ
పరమపురుషాయ । సర్వదేవతా వశీకరాయ । సర్వారిష్ట వినాశాయ । సర్వ
మంత్ర ఛేదనాయ । త్రైలోక్యం వశమానాయస్వాహా ॥" అని వెంటనే
స్వప్నే ప్రతీయమాన రూపాణిచ యథాతథా మూలాభావ మిదంజ్ఞాత్వా
నశరీరం నకిమస్తి" యని పూర్ణ సూచనను భావించుతూ "అయంవృక్ష
బాహ్యోపీన భవతి" అని ద్వాదశిని జపించవలెను. సంస్కృతము నోరు
తిరుగనివారు గురుమాలా మంత్రము మాత్రము ముఖ్యముగా నేర్చుకొని
జపములో గురుమాలను మననము చేసి అనగా మనసులో అనుకొని వెం
టనే "కలలోతోచిన శరీరా లేలాగో ఆలాగే ఈ మూలంలేని గుర్తెరిగే
శరీరం యేమీలేదు" అని బయలును భావనజేస్తూ "ఈ వృత్తబట్టబయలు
యేమీలేదు" అని జపించి పూసను మార్చుకుంటూ 128 సార్లు అఖండ

# పౌర్ణమినాడు చేసే నిజగురు పూజావిధానము.

—* శ్రీ నిజగురు పరంపరా వాహనం పాట *—

(1) వేదాంతాచల నిర్గుణుడా । బాధలుబాపిన భవరహితా । శ్రీధర దేవశరీర నమో । భక్తులనందర పాలించుటకై । పరమదయాకర రావయ్యా । జయరామా శివరామా । జయజయ శ్రీ గురు దీక్షిత రామా ॥ వేదాం ॥

(2) అశరీరం బడె అంతట కలదని । అహముకు మూలము ఛేదన జేసిన శివరామార్య సిద్ధాంత నమో । భక్తులనందర పాలించుటకై పరమదయాకర రావయ్యా । జయరామా శివరామా । జయజయ శ్రీగురు దీక్షితరామా ॥ వే॥

(3) ముందుగ ద్వాదశి సూచననిచ్చి । బింబుజ జగమది లేదనిదెల్పిన రామలింగార్య రమేశనమో । భక్తులనందర పాలించుటకై పరమదయాకర రావయ్యా । జయరామా శివరామా । జయజయ శ్రీగురు దీక్షితరామా ॥ వే॥

(4) భూమను భద్రాచలమనుమా । స్వామిని లేనను కని యున్నా । పరమారాధ్య పరేశనమో । భక్తులనందర పాలించుటకై పరమ దయాకర రావయ్యా । జయరామా శివరామా జయజయ శ్రీ గురు దీక్షిత రామా ॥ వే॥

(5) హిరణ్మయాత్మ సునీలప్రభో । కారుణ్యామృత సాగరహో । దేశి కేంద్ర గురుదేవనమో । భక్తులనందర పాలించుటకై పరమ దయాకర రావయ్యా జయరామా శివరామా జయజయ శ్రీగురు దీక్షితరామా ॥ వే॥

(6) భవబంధన మది బాసితినీ । పాదోదకమే గ్రోలితినీ । పండిత శివ రంగార్య నమో । భక్తులనందర పాలించుటకై పరమ దయాకర రావయ్యా జయరామా శివరామా । జయజయ శ్రీ గురు దీక్షిత రామా ॥ వే॥

శ్లో॥ నాదబిందుకళాత్మకం । దశనాదభేద వినోదకం
మంత్రరాజ విరాజితం । నిజమండలాంతర భాసితం
పంచవర్ణ మఖండ మద్భుత మాదికారణ మచ్యుతం
ప్రాత రేవహి మానసాంతర భావయేద్గురు పాదుకం॥

శ్లో॥ స్థూలసూక్ష్మ సకారణాంతర । ఖేలనం పరిపాలనం
విశ్వతైజస ప్రాజ్ఞచేతస । మంతరం నిఖిలాత్మకం
చిత్కళా పరిపూర్ణమంతర । చిత్సమాధి నిరూపణం
ప్రాత రేవహి మానసాంతర । భావయేద్గురు పాదుకం॥

శ్లో॥ పంచపంచ హృషీకదేహ । మనో చతుష్క పరస్పరం
పంచభూత సకామ షట్క స । మీరశ శబ్ద నిరంతరం
పంచకోశ గుణత్రయాది । సమస్త ధర్మవిలక్షణం
ప్రాత రేవహి మానసాంతర । భావయేద్గురు పాదుకం॥

శ్లో॥ వ్యోమ వద్బహిరంతరస్థిత । మక్షరం నిఖిలాత్మకం
కేవలం పరిపూర్ణ మేక । మజన్మహి ప్రతిరూపకం
బ్రహ్మతత్వ వినిర్మితం । నిరతాను మోక్షమ బోధకం
ప్రాత రేవహి మానసాంతర । భావయేద్గురు పాదుకం॥

శ్లో॥ బుద్ధిరూపమ బుద్ధకం । త్రిత మేక కూట నివాసినం
నిశ్చలం నిరతాప్రకాశ । మనేక సమ్రశమూలకం
పశ్చిమాంతర ఖేలనం । నిజసిప సంయమ గోచరం
ప్రాత రేవహి మానసాంతర । భావయేద్గురు పాదుకం॥

శ్లో॥ హంసచార మఖండనాద । మనేక వర్ణమ రూపకం
శబ్దజాలమయం చరాచర । జంతుదేహ నివాసినం
చక్రరాజ మనాహతోద్భవ । మేకవర్ణ మతఃపరం
ప్రాత రేవహి మానసాంతర భావయేద్గురు పాదుకం॥

శ్లో॥ తప్త కాంచన దీప్యమాన । మహాణురూపమ రూపకం
చంద్రకాంతర తారకై రస । ముజ్వలం పరమంపదం

నీలనీరద మధ్యమస్థిత । విద్యుదావళి భాసితం
ప్రీత రేవహి మానసాంతర । భావయేద్గురుపాదుకం ॥

హృద్గతం విమలం మనోజ్ఞ। విభాసితం పరమాణుకం
హీరమధ్య సునీల సన్నిభ । మాదిబిందు నిజాంశకం
సూక్ష్మకర్ణిక వాసినం । జలవహ్ని రూపక మీశ్వరం
ప్రీత రేవహి మానసాంతర భావయేద్గురుపాదుకం ॥

పంచవర్ణ శుకం సమస్త । రుచిర్విచిత్ర విచారిణం
చంద్ర సూర్య చిదగ్నిమండల । మండితం ఘన చిన్మయం
చిత్కళా పరిపూర్ణమంతర । చిత్సమాధి నిరీశ్వరం
ప్రీత రేవహి మానసాంతర భావయేద్గురు పాదుకం ॥

పంచభూత సులక్ష దక్షణ । భావమాత్ర నిరూపణం
విద్యుదాది ధగ ధగ ధగితం । వినోద వివర్ధనం
భిన్నమాత్రయవర్తినం । సదసద్విలాస మమాయికం ।
ప్రీత రేవహి మానసాంతర । భావయేద్గురుపాదుకం ॥

జన్మకర్మ విలీనకారణ । హేతుభూతమభూతకం
జన్మకర్మ నివారకం రుచి । పూరకం భవతారకం
నామ రూప వివర్జితం । నిజనాయకం సుఖదాయకం
ప్రీత రేవహి మానసాంతర భావయేద్గురు పాదుకం ॥

జై బోలో (శ్రీ) శివరామదీక్షిత అచల ఋషీ మహారాజుకీ జై ॥
జై బోలో (శ్రీ) సద్గురు సరస్వతీ దుర్గానంద పంచదసీ సద్గురు
ప్రభు మహారాజుకి జై.
జై బోలో (శ్రీ) నిజగురు మండలీకీ జై.

ఇట్లు,
నిత్యానుష్ఠాన విధానం సమాప్తము.



మాలను జపించినయెడల గృహస్థయిన రాజయోగికి గృహములో ఆయురారోగ్య ఐశ్వర్యములుకలిగి సంసారిక యొుక్క భ్రాంతులలో మానసికము లీనముగాక, విలక్షణుడై యుండును. అశరీరసాంప్రదాయ నిజగురుమూర్తి చరణముల నాశ్రయించిన ప్రతీ భక్తులు యిట్లు నిత్యానుష్ఠానము చేస్తూ వుంటే సత్సాంగత్యముజేస్తూ । సత్సభలకు తీరికచేసుకొనివెళ్ళుతూ । సద్గురుని యందు భక్తి శ్రద్ధలు కలిగియుండవలెను. భక్తులారా! నా అనుభవము చెప్పుచున్నాను. 'బద్ధకముచేగాని పనితొందరచేగాని మూడురోజులు నిత్యానుష్ఠానం మానేస్తే యీ మాయయొుక్కకు సందుదొరికి పదిహేను రోజుల వరకూ తన మాయ భ్రాంతులలో ముంచి వేయును. అందుకే జాగ్రత్తా! జాగ్రత్తా!! జాగ్రత్తా!!!' అని ఆర్యులు పల్కిరి. అఖండ మాలామంత్రజపము అయిన తరువాత గురుపాదములదరి "ఏతజ్జప ఫలితం సర్వం శ్రీసద్గురు చరణారవిందార్పణమస్తు" అని చేతిలో నీళ్ళు పోసుకొని గురుచరణముల దరి విడిచి గురుపాద తీర్థమును

శ్లో॥ అజ్ఞానమూల అరణం జన్మకర్మ నివారణం ।
జ్ఞాన వైరాగ్య శివ్యర్థం గురుపాదోదకం పిబేత్॥ అని

శ్లో॥ గురుపాదోద్ధితం తీర్థం । పీత్వాత్రిపుటి నాశనం
సర్వ ద్వంద్వ వినాశంచ । విద్యతే నపునర్భవం ॥

అని పాదోదకమునుగ్రోలి సావకాశముంటే ద్వాదశ వందనములు చేయవలెను.

—*—

## అది యెట్లనగా —: ద్వాదశ నమస్కారములు :—

శ్లో॥ శ్రీసమంచిత మవ్యయం । పరమ ప్రకాశ మగోచరం
భేద వర్జిత మప్రమేయ । మనంత మాద్యమ కల్మషం
నిర్మలం నిగమాంత మద్వయ । మప్రతర్క్యమ బోధకం
ప్రాత రేవహి మానసాంతర భావ యేద్గురు పాదుకం॥

(7) క్షితి నహంకారాన్ । క్షయకరమూర్తీ । పతితపావనా గురుమూర్తీ। యతి నాగన్నాచార్య నమో । భక్తులనందర పాలించుటకై పరమదయాకర రావయ్యా జయరామా । శివరామా । జయజయ శ్రీగురు దీక్షితరామా ॥వే॥

(8) వీతరాగవిజ్ఞానమయా । పీతవర్ణ సునీలభయా । పండితబాల రామార్య నమో । భక్తులనందర పాలించుటకై పరమదయాకర రావయ్యా । జయరామా శివరామా । జయజయ శ్రీగురు దీక్షితరామా॥

(9) తృష్ణాసంహర దృశ్యప్రభో । తూష్ణీభూతస్థితి గురుడా కృష్ణమాచార్య గురుదేవనమో । భక్తులనందర పాలించుటకై పరమదయాకర రావయ్యా । జయరామా । శివరామా జయజయ శ్రీగురు దీక్షిత రామా॥

(10) పుణ్యపురుష పురుషోత్తముడా । ధన్యులజేసె దయామయుడా । సన్యాసార్యగురుదేవ నమో । భక్తులనందర పాలించుటకై । పరమదయాకర రావయ్యా । జయరామా । శివరామా । జయజయ శ్రీగురు దీక్షితరామా ।

(11) నిర్గుణనిరవయ నిరంజనుడా । మార్గదర్శకామన్గురు ప్రభుడా । దుర్గానంద పరేశనమో । భక్తులనందర పాలించుటకై పరమదయాకర రావయ్యా । జయరామా శివరామా జయ జయ శ్రీగురు దీక్షితరామా ॥

(12) తొన్పూపుష్పరగురు పీఠమునా । విశ్వాతీత విషయద్రూపా రామరాయ హృత్కమలప్రభో । భక్తులనందర పాలించుటకై । పరమదయాకరరావయ్యా । జయరామా శివరామా జయజయ శ్రీ గురు దీక్షితరామా ॥

(13) రామచంద్రపుర పీఠమునా । సన్యాసార్యగురు నెద నమ్మె పుణ్యవతీకామేశ్వరిమాతనమో । భక్తులనందర పాలించుటకై పరమదయా

కరి రావమ్మా । జయరామా శివరామా జయజయ శ్రీ గురు దీక్షితరామా ॥

(14) షోడసి నిరసనజాడ నెరిగి యా । ఏడు మూడు రెండైన పరమదా । పడాల్ గంగయమాంబనమో । భక్తుల నందర పాలించుట్కై పరమదయాకరి రావమ్మా । జయరామా శివరామా జయజయ శ్రీ గురు దీక్షితరామా ॥

## —: శ్రీ నిజగురు ద్వాదసీ నమస్కార పాదుకాస్తోత్రం :—

( 1) శ్రీశ శ్రీధర శిష్యవర । శివరామదీక్షిత గురువరా
దేశికా శ్రీ దుగ్గనందా । పంచదసి పర గురువరా
నాశరహిత శరీర సీతా । రామ గురు కరుణాకరా
ప్రభాతమున భవదీయ పదములు మదిలోదలచెద గురువరా॥

( 2) విద్యతీతాఖండబోధక । సాధ్యసాధక వర్జితా
పాద్యార్ఘ్యమాచమ్యములగొను । పరిపూర్ణ బోధారూఢకా
పద్యగద్యా కావ్యరచి । త శరీర సద్గురు దేశికా
ప్రభాతమున భవదీయపదములు । మదిలోదలచెద గురువరా॥

( 3) అచలఋషి అవినాశచ్ఛందము । ద్వయదోషరహితానందమూ
వచనరహిత శరీర సద్గురు । అభవా దేవత దైవమూ
అప్రమేయాశక్తమూ । యీ శక్తిద్వయములు రహితమూ
ప్రభాతమున భవదీయ పదములు । మదిలోదలచెద గురువరా ॥

( 4) జాతమృత శౌచములులేనీ । అమృతబీజస్వరూపకా
వీతరాగయ మాత్మ దేశిక । సర్వద్వంద్వ వినాశకా
భూతభయలాతీత । తత్త్వామసనె జ్ఞానారహితకా
ప్రభాతమున భవదీయపదములు । మదిలోదలచెద గురువరా ॥

( 5) అఖిలకాలములందు నున్నది । అచలపరిపూర్ణంబనీ
నిఖిలమాయల కాలవాలం । బైన జగమే లేదనీ

అఘములన్నియు బాయ నుదుటను । భూది నూదిన వైద్యుడా
ప్రభాతమున భవదీయపదములు । మదిలోదలచెద గురువరా ॥

(6) నిరుపమానము నిరంజనఋషి । నిర్గుణంబున కవలిదీ
నిరవయంబది నిర్హాంకారము । నిశ్చలంబగు చందమూ
మరుగుయిదె నిజగురుని రూపము । నిరామయ నిరాకాశమూ
ప్రభాతమున భవదీయపదములు । మదిలోదలచెద గురువరా ॥

(7) ద్రిష్ఠ దర్శనదృశ్యములు । విరామ మొందిన స్థానమూ
దృష్టిత్రియముల కందనట్టి । నిరావరణమె బీజమూ
కష్ఠనిష్ఠుర సుఖముతెరుగని । నిస్త్రైగుణ్యాశక్తుడా
ప్రభాతమున భవదీయపదములు । మదిలోదలచెద గురువరా ।

(8) నిర్గుణ ప్రజ్ఞాన రహితమె । నిజద్వాశశీ గురున్యాయమూ
స్వర్గవైకుంఠముల కవలి । తత్వార్థ సారయదార్థమూ
దుర్గమంబౌ మారమిది । గురుసన్నిధిని విజ్ఞేయమూ
ప్రభాతమున భవదీయపదములు । మదిలోదలచెద గురువరా ॥

(9) అష్ఠవిధప్రకృతులచేతను । తోచబడు ప్రపంచమూ
ద్రిష్ఠయా అయమాత్మ బ్రిహ్మలో । భావనాకల దేహమూ
స్పష్ఠముగ కలలోనుతోచిన । తనువులెటులో అటులనీ
ప్రభాతమున భవదీయపదములు మదిలో దలచెద గురువరా ॥

(10) నాలవా తనువైన యెరిగే జ్ఞాతదే పరమాత్మనీ
మూలమూలేనట్టి గుర్తదె । బిందురూపవ్య కనీ
నీలతోయద విధ్యుల్లేకి । దనంతమందున లేదనీ
ప్రభాతమున భవదీయపదములు । మదిలో దలచెద గురువరా ॥

(11) కప్పురము నిప్పందుకలసిన । చందమే ద్రాష్టాంతమూ
చప్పునను చల్లారినట్లే । సగుణ నిర్గుణ రహితమూ

ఒప్పునికరము ద్వాదశదె । గురు । చెప్పి చూపగరానిదీ
ప్రభాతమున భవదీయ పదములు । మదిలో దలచెద గురువరా॥

(12) భక్తితో యీ వందనంబులు । అర్థమెరిగి పఠించినన్
ముక్తినొసగా పైని మోక్షా । పేక్ష రహితుని జేయునూ
భుక్తినొసగె తోస్పూడిపురంమున । గంగయాంబకు పుత్రుడా
భక్తుడౌ యె రామరావిటు । పీఠమెదుటను పాడెనూ ॥ప్రభాత॥

## —: శ్రీ శివరామదీక్షిత నిజగురు పరాపూజా విధానము పాట :—

పూ...జా చేసేదారావో । శివరామా దీక్షితా గురుదేవా॥

( 1) పూర్ణామావాహనం నిర్ణాయతీతా దేవ నిర్గుణాస్వరూపా ॥పూ॥

( 2) సర్వాంబూకాధారం బేదో అదేమీకు । ఆసానంబర్పింతూ
శంభూనూత దేవ ॥పూ...జా॥

( 3) ఇచ్ఛారాహిత్యంబె స్వస్ఛంబాస్థితీమీకు । సత్యంబైనా దేవ
అర్ఘ్యపాద్యలివిగో ॥పూ...జా॥

( 4) శుద్ధామీశ్వర చైతన్యంబాదె గురుదేవ । బుద్ధిపూర్వకంబూన
ఆచామనంబూ నిచ్చి ॥పూ...జా॥

( 5) కర్మాకర్మరహితా నిర్మాలా నిర్గుణ । ధర్మంబదేమీకూ
స్నానంబో పరదేవ ॥పూ...జా॥

( 6) పంచా పంచా పంచా ప్రపంచంబంతామీకు । సంచీతాగామా
నాశ వస్త్రంబదేనోదేవ ॥పూ...జా॥

( 7) నీరాలంబంబాపైని యజ్ఞోపవీతంబూ ! సూరీజనా నూత
సుజ్ఞానాతీతా దేవ ॥పూ...జా॥

( 8) సచ్చిదానందారూపి । లక్ష్మీ మీభూషాణం । హెచ్చొ నీతత్వా
ర్థా కందార్థా త పతకాల్ పేర్ ॥పూ...జా॥

(9) నిర్భీజూడవౌటాచె నిర్లేపస్థితీగల్గె । గంధంబదే మీకో
సుందారకారా దేవ ॥పూ...జా॥

(10) సర్వాత్మా వర్జితంబె నిర్వాసనా పుష్పం । దర్వీకారానీ
పైని నిర్వికారా దేవ ॥పూ...జా॥

(11) గంధత్రయాబంధాన మిడచుండుటదే మీకు । నిర్గంధాధూపంబూ
బంధామోక్షరహితా ॥పూ...జా॥

(12) అప్రమాణనంతూడ స్వప్రకాశాదీపం । ఏప్రపూను జెందాకుండ
నీ ప్రపూను చేర్యాబోగ ॥పూ...జా॥

(13) ప్రాప్తాప్రాప్తములందు । తృప్తిన్ జెందుండూటదె । నిత్యం
తృప్తిన్ బొందూటె నైవేద్యంబో దేవ ॥పూ...జా॥

(14) అస్ఖలిత బ్రహ్మంబాట । నిష్కామా ఫలంబూ । శుష్క వేదాం
తా రహిత నిష్కర్ష భావా దేవ ॥పూ...జా॥

(15) బింబాభావంబదేను తాంబూలమో దేవ । డంబారంబూలూ
లేని గంభీరా గురుదేవ ॥పూ...జా॥

(16) సత్యాసత్యంబూలాను । త్యజించీన యెరుకానిపుడు । త్యజించీ
యుండూటదె । నిత్యానందా దక్షిణ ॥పూ...జా॥

(17) అయంవ్యక్త బాహ్యాకోపీనా భవతీయనుచు। స్వయంప్రకాశంబూను
నీరాంజనంబూనిచ్చి ॥పూ...జా॥

(18) శుద్ధావియత్కించిన్నాస్తీ యనుండూటదె । ప్రదక్షణంబూచేతు
అద్వితీయానంతా ॥ పూ...జా॥

(19) వాసీగ తొస్వాశి పురపీఠవాసా దేవ । దాసూరాల్ గంగాయాంబ
దోసీల్గొగ్గివేడె ॥పూ...జా॥

(20) ప్రజ్ఞానవిలక్షాణు । జిజ్ఞాసా రహితూనిజేయ । ప్రజ్ఞానీ
దేనయ్యా సుజ్ఞానాతీతా దేవ ॥పూ...జా॥

# పూజా విధానము ప్రారంభము.

శ్లో॥ ఊర్ధ్వామ్నాయగురోః పదం । త్రిభువనోంకారాఖ్య సింహాసనం
సిద్ధాచార సమస్తవేద పఠితః । షట్చక్ర సంచారిణం ।
అద్వైతస్ఫురదగ్ని మేకమమలం । పూర్ణప్రభాశోభితం ।
శాంతం శ్రీగురుపంకజం । భజమనశ్చైతన్య చంద్రోదయం ॥

శ్లో॥ గుకారశ్చ గుణాతీతో । రూపాతీత రుకారః
గుణరూప విహీనత్వాం । తస్మైశ్రీగురవేన్నమః ॥

శ్లో॥ వందేహం గురుపాదపద్మములకున్ । వందే సుబోధోక్తికిన్
వందేహం గురుచరిత సంగ్రహముకున్ । వాగ్మాన సుశ్రేణికిన్
వందేహం గురునామధేయమునకున్ । వందే గురుస్థలముకున్
వందేహం గురుభక్త బృందమునకున్ । వందే సమజ్ఞాతకున్॥

శ్లో॥ శ్రీమత్కారుణికం మహాగుణనిధిం । పూర్ణప్రభాభాసురం
నిర్ద్వంద్వం నిరపేక్ష కామమమలం । నిస్సంగమాద్యంవిభుం
నిత్యానందమయం నిరీహమతులం । నిర్ముక్త కర్మాదికం
శ్రీకృష్ణాఖ్య గురుంభజేహ మనిశం । శ్రీ చిత్త సంతోషణం॥

శ్లో॥ నిత్యంసాంద్రకృపారసం । విధితభావాభావమత్యున్నతం
ద్వంద్వాతీత మమత్వరం । పరమ కళ్యాణాత్మ తత్వంవిభుం
బ్రహ్మానంద మయం సుబోధనిలయం । స్వానంద భావంస
శ్రీ మద్భాగవతాన్వయాబ్ధి విలసత్ శ్రీకృష్ణచంద్రంభజే ॥

శ్లో॥ హృత్పుండరీకమధ్యస్థం ।సకలామ్నాయ సంస్తుతం
ధ్యాయామ్యహం సదాభక్త్యా । సకలాభీష్టదాయక ॥

సీ॥ గుణము రూపంబు లేనట్టి గురుడవనుచు ।
పక్షపాతంబు లేనట్టి ప్రభుడవనియు ।
మనమునందున పదెపదే దలచిమిమ్ము
మ్రొక్కి వినుతించి ప్రార్థించి ముదముతోడ ॥

పద్య :- ధ్యాన్నాము జేసెదా । మద్గురు చరణాల్ మదిలోన స్తుతియిం చెదా ॥ కన్నె త్తిజూచినా కలబాపినట్టియా । పన్నాగ శయనూడౌ కన్నా తండ్రి పదముల్ ॥ ధ్యాన్నామునూ జేసెదా । మద్గురు చర ణాల్ మదిలోన స్తుతియించెదా ॥

శ్రీమద్గురు సరస్వతీ దుర్గానంద పంచదనీ స్వామి స్వగురు । పరమ గురు । పరమేష్ఠి గురు । జగద్గురు । నిజగురు సద్గురు । పరిపూర్ణ గురు పరబ్రహ్మణేన్నమః । శ్రీమద్గురునకు ధ్యాయామి । ధ్యానం సమర్పయామి ॥

శ్లో॥ ఆగచ్ఛానంత దేవేశ । భోగమోక్ష ప్రదాయక
నా కేశముఖలోకేశ । వందితాంఘ్రిద్వయాంబుజ ॥

సీ॥ నీను రూపంబు తెలియగ నేరితరము
ఆత్మనాత్మలు గానట్టి అద్వితీయ
తత్వరూపుడ వీవాట తావకీయ
రూపమందేకభావన రూఢిపరచి ॥

పద్య :- ఆవాహనంబును జేసెదా । మద్గురురాయా । అహంభావము బాపగా ॥ దేహం సోహము లేని । ఊహాతీతము దెల్పి మోహజాలపు జగము । ఊహకలయని దెల్ప ॥ ఆవాహనంబును జేసెదా ॥ మద్గురురాయా అహంభావము బాపగా ॥
శ్రీమద్గురు ...... పరబ్రహ్మణేన్నమః శ్రీమద్గురునకు ఆవాహనం సమర్పయామి ॥

శ్లో॥ రత్న సింహాసనం దేవ । సం గృహాణమయార్పితం
చంద్రమండల సంకాశ । సంస్థితాసన పంకజ॥

సీ॥ స్థానమే లేదు సర్వత్ర వ్యాప్తరూప
పట్టి గొల్వంగ పరిణామమేమిలేక
అత్తి అత్తక అంతట నిండియున్న
ఆది పూరుష నాదు హృదయంబె మీకు

దరువు :- ఆసానముగ నిచ్చెదా । దోసములాను । మన్నింపుడని వేడెదా ।
ఆశాపాశములాకు ఆలవాలమా యీ । స్థూలా తనువె మీాకు
మణి సింహాసనమూాగ । ఆసానముగ నిచ్చెదా । దోసములానూ
మన్నింపుడని వేడెదా ॥

(శ్రీ)మద్గురు ...... పరబ్రహ్మణేన్నమః (శ్రీ) మద్గురువునకు అనేక
మణిమయ రత్నఖచిత సింహాసనం సమర్పయామి ।

శ్లో॥ పాద్యం గృహాణభో స్వామిన్ । మయానీతం శుభప్రదం ।
కృష్ణవేణి జలంభక్త్యా తీర్థపాద జగద్గురో ॥

క॥ విద్య విద్యలు కానట్టి విభుడవీవె
పద్య గద్యలు రచియించు ప్రభుడవనుచు
మధ్య దోచెడి యీా మాయ మిధ్యయన్న
తధ్యమాగురూ ! ముజ్జగాతీత ప్రభుడ ॥

దరువు :- పాదోదకము నిచ్చెదా । సాధన బోధల్ పాదాలముందుంచెదా
మీాదారితో సాటీ దేదారి కాదనుచూ । నాదు సూక్ష్మతనువె
పాదాజలముగ జేసి ॥ పాదోదకము నిచ్చెదా । సాధనబోధల్
పాదాలముందుంచెదా ॥ (శ్రీ) మద్గురు ...... పరబ్రహ్మణేన్నమః
(శ్రీ)మద్గురునకు పాదయోః పాద్యం సమర్పయామి ॥

శ్లో॥ అర్ఘ్యందాస్యామ్యహం భక్త్యా । తవపాణి తలేవిభో
గోదావరీ జలం । హేమకలశస్థం సువాసితం ॥

క॥ అస్తిభాత్యాది ప్రియసూన్య అద్వితీయు
నాస్తిమత మన్నవారల కస్తియనుచు
అస్తినాస్తులు కానట్టి యమలతత్వ
మస్తమందున సూచించె కేలుదలచి ॥

దరువు :- అర్ఘ్యామర్పణజేసెదా । స్వర్గాది పదవులాశాలెల్లను
రోసెదా । నిర్గుణాతీతా నాదుర్గుణంబులు బాయ ।

స్వర్గనరక హేతూకారాణ తనువిప్రడూ । అర్ఘ్యామ
ర్పణ జేసెదా । స్వర్గాది పదవ్రూలాశాలెల్లను రోసెదా ।
శ్రీమద్గురు ...... పరబ్రహ్మణేన్నమః । శ్రీమద్గురునకు
హస్తయోః అర్ఘ్యం సమర్పయామి ॥

శ్లో॥ ఆచమ్యతాం మయాదత్తం । హేగురో యమునాజలం
త్వాదర్థం కృపయాభావ । భవబాధ నికృత్తన॥

గీ॥ అచల గురువర్య । అహరహితనంతరూప
సచల భావాల తెలియంగ సాధ్యపడక
యున్న నీకెట్లు నేనిత్తు నాచమాన
మయిన నాదగు భ్రాంతిచే నమరవంద్య ॥

వర్ను :— ఆచామానము నిచ్చెదా । నాపూర్వాపూనీచా భ్రాంతులుబాయ
గా । వాచామగోచరా వాగ్బ్రహ్మనేననూ । మహా కారణతనువ్రూ
నూహాలన్నిటి విడచిఆచామానము నిచ్చెదా । నా పూర్వాపూ
నీచాభ్రాంతులు బాయగా ॥
శ్రీ మద్గురు ...... పరబ్రహ్మణేన్నమః శ్రీమద్గురునకు ముఖే
ఆచమనియ్యం సమర్పయామి ॥

శ్లో॥ శర్కరాదధి మధ్వాజ్య । క్షీరమిశ్రి మిదంవిభో
పంచామృతం మయాదత్తం । స్నానం కురు జగత్పతే ॥

గీ॥ పంచకోశాల భ్రాంతిని పారద్రోలి
భావకించిద్గుణంబుల ప్రోవుమాన్పి ।
మించు ప్రేమతో వీక్షించి ముదముతోడ
పంచాకాశాలపైనున్న సూచనివ్వ ॥

వర్ను :— పంచామృత స్నానమూ । చేయించేదా పంచభ్రమలనూదీయ
నూ । అంచీతముగ జీవనాళ్గోతనువులో భ్రమతో । పంచదార
పాలు పెరుగు నేయి మధుతో । పంచామృత స్నానమూ । చే
యించేదా పంచ భ్రమలను దీయనూ ॥

శ్రీమద్గురు ...... పరబ్రహ్మణేన్నమః । శ్రీమద్గురునకు పంచా
మృత స్నానం సమర్పయామి ॥

శ్లో॥ తప్తకాంచన కుంభస్థం । కించిదూష్ణం సువాసితం ।
మయానీతం జహ్నుకన్యా । జలస్నానం కురుప్రభో॥

సీ॥ నేను మేనులు లేనట్టి నిర్మలాత్మ
తానుతానైన తత్పద పరమపురుషు ।
వైననాదగు కల్మష మేనుదొలగ
మీకు మేనున్నదని యెంచి ముదముతోడ ॥

దరువు :- స్నానామూ గావించెదా । మానసమూన మంత్రాధ్యానము
జేసెదా । నీ నామధ్యనుగల । బ్రహ్మాండరూపూన పూనియున్న
వైశ్వానర విరాడ్దేహమును । స్నానామూ గావించెదా । మాన
సమూన మంత్రధ్యానము జేసెదా ॥
శ్రీమద్గురు ...... పరబ్రహ్మణేన్నమః శ్రీమద్గురునకు శుద్ధోదక
స్నానం సమర్పయామి ॥

శ్లో॥ వస్త్రయుగ్మం మయాదత్తం । త్వదర్థం స్వర్ణతంతుభిః
నిర్మితం నిర్మలంస్వామి । నిత్యకళ్యాణ పావన ॥

సీ॥ విశ్వమంతయు నీలోన యిమిడియుండె
విశ్వమంతట నీవుంటి వనాది పురుష
అట్టి మీకెట్లు వస్త్రంబు కట్టపెదును
నశ్వరంబైన । హిరణ్యా గర్భతనువు ॥

దరువు :- వస్త్రాయుగ్మమునిచ్చెదా । బహువిధనేత్ర విషయా వాసన
బాయగా । క్షేత్రక్షేత్రజ్ఞులలో సూత్రాత్మరూపూడా । రాత్రి
పగలునూ లేనీసూత్రాము మదిదెల్పా । వస్త్రాయుగ్మమునిచ్చెదా
బహువిధనేత్రా విషయావాసన బాయగా ॥
శ్రీమద్గురు ...... పరబ్రహ్మణేన్నమః। శ్రీ మద్గురునకు వస్త్ర
యుగ్మం సమర్పయామి ॥

శ్లో॥ కార్పాసతంతునాశుభ్రం । రచితం తేర్పితంమయా
సంగృహాణమిదం యజ్ఞసూత్రం పాత్రం దయానిధే ॥

సీ॥ ఒకటి తక్కువ యిరువదిదారులున్న
ఘటము సందున యాకాశం జీవుడగును
ఘటము పగిలిన మఠములో యీశ్వరుడగు
ఘటమఠాకాశాల కవ్వలి విశాలరూప ॥

దరువు :- యజ్ఞసూత్రము నిచ్చెదా । బహువిధ చలన బీజా ప్రకృతిని సెబాదా । అజ్ఞానవిషయానులెల్లా సమిధెలు । గా మీబోధాగ్ని యందున ప్రజ్ఞానాద్యము వేసి । యజ్ఞసూత్రము నిచ్చెద । బహువిధ చలనా బీజాప్రకృతిని బాసెదా ॥

శ్రీ మద్గురు ...... పరబ్రహ్మణేన్నమః। శ్రీమద్గురవకు యజ్ఞో పవీతాన్ సమర్పయామి ॥

శ్లో॥ కిరీటం కుండలం రత్న । కంకణాదినితేమయా ॥
సంగృహ్యతాం భూషణాని । అర్పితాని నిరంజన ॥

సీ॥ విశ్వతైజస ప్రాజ్ఞాధి దేవతలను
అశ్వినాదిగ నక్షత్రగోళమంత
భాసురంబుగ మహదహంకార జ్యోతి
భావనంబున వజ్రింపు పెద్దపోడని

దరువు :- భూషాణముల నిచ్చెదా । దూషణ భూషణములా హారము వేసెదా । భాషాపతికిని తెలియు । సాధ్యామైన దేవా । దాసాన దాసుడనా దోషాముల్ మన్నింప । భూషాణములనిచ్చెదా। దూషణ భూషణములా హారము వేసెదా ॥

శ్రీ మద్గురు ...... పరబ్రహ్మణేన్నమః శ్రీమద్గురవకు సర్వాభరణ భూషణాన్ సమర్పయామి ॥

శ్లో॥ మలయాచల సంభూతం । కర్పూర కలితం విభో
విలేపనం త్వదర్థంభో । గృహ్యతామర్పితంమయా ॥

సీ॥ ముందు వెనుకల యెందెంచు వెదకిజూడ
అందె యుంటివి యించుక సందులేక
మందగుణములుగల మాదుడెందమందు
బంధమోక్షాల భ్రాంతిని రద్దుజేయ ॥

దర్వు :- గంధామర్పణ జేసెదా । బంధనమౌ యీ హృదయా గ్రంధిని మాన్పగా । అందామౌ యీశ్వరా నాగ్గోతనువులోపుట్టే । చల్లని పరిమెళా గంధాగ్రంధపు ప్రజ్ఞా । గంధామర్పణచేసెదా । బంధనమౌ యీ హృదయా గ్రంధిని మాన్పగా ॥

శ్రీమద్గురు . . . పరబ్రహ్మణేన్నమః శ్రీమద్గురునకు గంధం సమర్పయామి ॥

శ్లో॥ తండులాన్ధవళాకారాన్ । హరిద్రా చూర్ణ మిస్రితాం
గృహ్యతాంమక్షతాం దేవ । మయాదత్తాన్మనోహరాన్ ॥

సీ॥ పక్షివాహనా రూఢ మీ కుక్షియందు ।
అక్షయంబగు పరమాణు బీజతతికి ।
సాక్షిహీరణ్మయా వర్ణపసుపు కలిపి ।
లక్ష్యలక్ష్యంబుగాని విలక్షణుండ ॥

దర్వు :- అక్షాతలను నిచ్చెదా । క్రమశిక్షాతో రక్షింపుమని వేడెదా । కక్షాల మతమూల పక్షాముబాపి । మీ అక్షాయబోధచే క్షితిసీ సత్యాముజేయ । అక్షాతలను నిచ్చెదా । క్రమ శిక్షాతో రక్షింపుమని వేడెదా ॥

శ్రీ మద్గురు. . . . .పరబ్రహ్మణేన్నమః శ్రీ మద్గురునకు అక్షతాం సమర్పయామి ॥

శ్లో॥ పుష్పాణ్యనేకాని సుపల్లవాని । సుగంధయుక్తాని మనోహరాణి
త్వంగృహ్యతాం దేవమయార్పితాని । జలాశయస్థానిజపాదికాని॥

౨॥ నిష్ప్రయోజన నాజన్మమింతవరకు
అర్థినై వేడి తత్సుఖైశ్వర్య బోధ
సార్థకము జేసుకొనగ న పూతచరిత
కోరిమీపాద పంకజద్వయమునందు॥

వస్త్వ॥ పుష్పామర్పణ జేసెదా।నిష్కళంక వస్తువేదియొ తెలియగా।పుష్పా
మహింసాయు । సత్యామింద్రియనిగ్రహ । పుష్పాము శాంతి శమ
దమ మాది షట్కములా । పుష్పామర్పణ జేసెదా । నిష్కళంక
వస్తువేదియొ తెలియగా॥

శ్రీమద్గురు...పరబ్రహ్మణేన్నమః । శ్రీమద్గురునకు పుష్పంసమర్పయామి

## —: అథ అంగపూజ :—

తీర్థపాదాయనమః :— పాదౌపూజయామి
నిగమమంజీరాయనమః :— గుల్ఫౌపూజయామి
స్మరతూణీర జంఘాయనమః :— జంఘౌపూజయామి
ముక్తికాంతసేవితాయనమః :— జానునీంపూజయామి
రత్నస్తంభోరుయుగళాయనమః :— ఊరూపూజయామి
పులినతలజఘనాయనమః :— జఘనౌపూజయామి
మణికాంచకలాప శోభితాయనమః :— కటింపూజయామి
విశ్వోదరాయనమః :— ఉదరంపూజయామి
దయార్ద్రహృదయాయనమః :— హృదయంపూజయామి
విశాలవక్షాయనమః :— వక్షస్థలంపూజయామి
కంబుగ్రీవాయనమః :— కంఠంపూజయామి
వరదానధురీణాయనమః :— హస్తౌపూజయామి
ఉన్నతస్కంధాయనమః : భుజౌపూజయామి

స్మితవక్త్రాయనమః :- వక్త్రంపూజయామి
చంపకనాశాయనమః :- నాశికాంపూజయామి
పల్లవాధరాయనమః :- అధరంపూజయామి
పుండ్రేక్షుకార్ముకభ్రువేనమః :- భ్రూయుగ్మంపూజయామి
కరుణాకటాక్షవీక్షణాయనమః :- నేత్రౌపూజయామి
కృష్ణకర్ణాయనమః :- కర్ణౌపూజయామి
రాకాశుధాంశు వదనాయనమః :- ముఖంపూజయామి
సులలాటాయనమః :- లలాటంపూజయామి
నీలకుంచిత మూర్ధ్నజాయనమః : కేశాన్‌పూజయామి
సువృత్తశిరస్కాయనమః :- శిరఃపూజయామి
సర్వాత్మనేన్నమః :- సర్వాంగానిపూజయామి

గీ॥ జానువులులేవు పాదముల్ జంఘములును ।
యూరువులులేవు భ్రూగుల్మయుదరములును ।
కటియు హృదయంబునేత్రపంకజము ।
మాయవక్షమును కంఠహస్తవక్త్రములులేవు॥

దర్వు॥ అంగపూజను జేసెదా । నాయంగదౌర్బల్యాము లెడబాయగా । అంగాలింగములాను సాధనమగు మాయ।సంగాతి తొలగగానసగుణ నిర్గుణాతీత । అంగపూజను చేసెదా । నాయంగదౌర్బల్యాము లెడ బాయగా ॥

శ్రీమస్గురు ... పరబ్రహ్మణే న్నమః । శ్రీమద్గురునకు అంగపూజాన్ పూజయామి

## —: అథ పత్ర పూజ :—

అచింత్యాయనమః :- బిల్వపత్రం సమర్పయామి
బృందారక వందితాయనమః :- తులసీదళం సమర్పయామి
భువనరక్షణతత్పరాయనమః :- వకుళపుష్పం సమర్పయామి

భూరివిభవాయనమః :- పున్నాగపుష్పం సమర్పయామి
జగజ్జనన కారణాయనమః :- కేతకీపత్రంసమర్పయామి
చరాచరగురవేన్నమః :- చామంతికాపుష్పంసమర్పయామి
సుప్రభావాయనమః :- చంపకపుష్పంసమర్పయామి
సుప్రసన్నాయనమః :- పాటలీపుష్పం సమర్పయామి
అపవర్గప్రదాయనమః :- శతపత్రపుష్పంసమర్పయామి
అనంతాయనమః :- జాజిపుష్పంసమర్పయామి
మోహావర్జితాయనమః :- కరవీరపుష్పంసమర్పయామి
ముకుందాయనమః :- రసాలపుష్పంసమర్పయామి
ప్రకృతిపురుషవిలక్షణాయనమః : మాలతీపుష్పంసమర్పయామి
నిత్యాయైనమః :- కల్హారపుష్పం సమర్పయామి
ఆజ్ఞేయచక్రనిలయాయనమః :- అతశీపుష్పంసమర్పయామి
నాదుబిందుకళాతీతాయనమః :- పారుజాతపుష్పసమర్పయామి
భూతాత్మనేన్నమః :- అశోకపుష్పం సమర్పయామి
మండలత్రయాతీతాయనమః :-నీలోత్పలపుష్పం సమర్పయామి
అనంతాయనమః :- అతశీపుష్పం సమర్పయామి

గీ॥ చిత్రచిత్రంబులుగాక చిత్తుగాక ।
శత్రుమిత్రత్వములులేక సత్తుగాక ।
శ్రోత్రవిషయంబులునుగాక చిత్సుఖముగాక ।
తత్రయనరాని పరమపవిత్రగాత్ర ॥

దరు॥ పత్రపూజలు జేసెద । కుత్రిమతత్వకూటములేకూలగా । వేత్రువేధ్యమువేతృత్వముగాక । సర్వతావ్యాపక । నా తాపత్రయమెడబాప । పత్రపూజలు జేసెదా । కుత్రిమతత్వకూటములేకూలగా ॥

శ్రీమద్గురు . . . పరబ్రహ్మణేన్నమః । శ్రీమద్గురునకు పత్రపూజాన్ సమర్పయామి ॥

## —* అథ అష్టోత్తర శత నామాని *—

1. సద్గురవేన్నమః
2. పూర్ణాయనమః
3. సర్వాధారాయ నమః
4. స్వచ్ఛాయనమః
5. శుద్ధాయనమః
6. నిర్మలాయ నమః
7. విశ్వోదరాయ నమః
8. నిరాలంబాయ నమః
9. రమ్యాయ నమః
10. నిర్లేపాయనమః
11. నిర్వాసనాయనమః
12. నిర్గంధాయ నమః
13. స్వప్రకాశాయనమః
14. నిత్యతృప్తాయ నమః
15. అనంతాయానమః
16. అద్వితీతాయనమః
17. వేదవాచామవేద్యాయనమః
18. పరంజ్యోతిషేనమః
19. ప్రణవాతీతాయ నమః
20. అచలాయ నమః
21. అపరిమితాయనమః
22. అప్రమేయాయనమః
23. అవ్యయాయనమః
24. అత్యుతాయనమః
25. అహంకారవివర్జితాయనమ
26. విశ్వాత్మనేన్నమః
27. ప్రపంచాతీతాయనమః
28. మాననీయాయ నమః
29. క్షరాక్షర విలక్షణాయనమః
30. దృగ్దృశ్యాతీతాయ నమః
31. ద్వైతాద్వైతవినిర్ముక్తాయనమః
32. అఖండాయనమః
33. ఖండాఖండవిరహితాయనమః
34. ఆదిమధ్యాంతశూన్యాయనమః
35. నిరంజనాయ నమః
36. నిర్వికల్పాయనమః
37. నిరాకారాయనమః
38. నిరాఖ్యాతాయనమః
39. పరమానందస్వరూపాయనమః
40. సగుణనిర్గుణాతీతాయనమః
41. సర్వసాక్షిణేన్నమః
42. సాక్ష్యతీతాయనమః
43. త్రిగుణాతీతాయ నమః
44. సర్వభూతాంతరస్థాయనమః
45. సుఖదుఃఖవిరహితాయనమః
46. జన్మజరామరణవర్జితాయనమః
47. క్షేత్రజ్ఞాయనమః
48. సర్వోపనిషత్సారాయనమః
49. నిష్కళంకాయనమః
50. నిరాభాసాయ నమః
51. స్వప్రకాశాయనమః
52. సృష్టిస్థిత్యంతకారణాయనమః

53. కర్తృత్వ రహితాయ నమః
54. సచ్చిదానందాతీతాయ నమః
55. అపరోక్షాయ నమః
56. సకలమంత్ర స్వరూపాయ నమః
57. ఆకాశ తనవే నమః
58. నిరాధారాయ నమః
59. నిస్తేజసే నమః
60. అవికారాయ నమః
61. అమలాయ నమః
62. పరతత్త్వాయ నమః
63. పరంధామ్నే నమః
64. అజాయ నమః
65. అగమ్యాయ నమః
66. షడ్గుణైశ్వర్యసంపన్నాయ నమః
67. సనాతనాయ నమః
68. త్రిమూర్త్యాత్మనే నమః
69. అనాద్యంతాయ నమః
70. సర్వోపాధివినుర్ముక్తాయ నమః
71. భక్తాభీష్ట ఫలప్రదాయ నమః
72. భవరోగ భేషజాయ నమః
73. సహస్రారచక్రమధ్యస్థాయ నమః
74. సనకాదిమునివందితాయ నమః
75. కామక్రోధాదిశత్రునికృంతనాయ నమః
76. కరుణారసార్ద్రహృదయాయ నమః
77. దివ్యపురుషాయ నమః
78. ప్రపన్న పారిజాతాయ నమః
79. పురాణపురుషాయ నమః
80. నిరుపద్రవాయ నమః
81. నిత్యకళ్యాణాయ నమః
82. సర్వోపనిషత్పంజరకీరాయ నమః
83. శబ్దాతీతాయ నమః
84. జగన్నాథాయ నమః
85. జగద్గురవే నమః
86. విష్ణవే నమః
87. సర్వతో భద్రాయ నమః
88. నిగమార్థ ప్రతిపాదకాయ నమః
89. నిస్సంగాయ నమః
90. సహజానందాయ నమః
91. చిన్మయాయ నమః
92. శ్రీమతే నమః
93. సహజామనస్కాయ నమః
94. సాయుజ్యప్రదాయ నమః
95. పంచబ్రహ్మమయాయ నమః
96. అజడాయ నమః
97. జడాజడవిలక్షణాయ నమః
98. భావాభావమధ్యస్థాయ నమః
99. అమనస్కాయ నమః
100. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకాయ నమః

101. బ్రహ్మవిష్ణుమహేశ్వరస్తుతాయనమః
102. బ్రహ్మాండ జనకాయనమః
103. పరమపావనాయ నమః
104. దీనజనానుగ్రహాయనమః
105. సర్వాదయే నమః
106. పరాత్పరాయనమః
107. లక్ష్యాతీతాయ నమః
108. మనోవాగగోచరాయ నమః

గీ॥ విశ్వమందున గలయట్టి వివిధరూప । నామ క్రియలెల్ల
ధరియింప నలవికాదు । నీనుపూజ శాయంగ గాన
అట్టి రూపు నామంబు క్రియలతో రూఢిగాను ॥

దర్వు :— పూజాలు గావించెదా * బహుజన్మాపు రాజాస మెడబాయగా * అజ విష్ణు రుద్రాది * యలరూ నామములాతో * నలరి
నలరకయున్న * అచల స్వరూపనిన్ * పూజాలు గావిం
చెదా * బహుజన్మాపు రాజస మెడబాయగా *
శ్రీ మద్గురు ... ... పరబ్రహ్మణే నమః । శ్రీ మద్గురునకు
నానావిధ పరిమెళ పత్రిపుష్పాన్ సమర్పయామి ॥

శ్లో॥ ధూపదీపంచ నైవేద్యం । పానీయం ఫలమేవచ
నిష్కళంకాయ దేవాయ । నిరాభాస నిరంజన॥

గీ॥ స్థూలభూతాదుల్లైదును ధూపముగను
కాలకారణ పంచతన్మాత్రదీపం
తలప పంచశక్తుల తృప్తియే భోజనంబు
జలము సోహంబె పంచ బీజాల దాహం॥

దర్వు :— ఫలహారములు బెడుదునూ । కలవలెగల్గె బ్రహ్మాండ
బాండాత్మనూ । అలవిగాని మీదూసంవిత్స్వయం జ్యోతిలో
కలవలె కలిగీన భావానజగమంతా । ఫలహారములు పెడుదునూ
కలవలెగల్గె బ్రహ్మాండ బాండాత్మనూ॥
శ్రీ మద్గురు ... ... పరబ్రహ్మణేన్నమః । శ్రీ మద్గురునకు
ధూప, దీప నైవేద్యపానీయ, ఫలోపహారనైవేద్యంసమర్పయామి॥

శ్లో॥ తాంబూలం దక్షిణా_ర్తిక్యం । మంత్రపుష్పం ప్రదక్షిణం
బృందావనాంతరాత్మానం । సుందరీ రాధాప్రియం॥

గీ॥ అంబరంబులకైదింటి కవ్వలున్న
అచల పరిపూర్ణ నిజగురూ నిరంజనుడ
పరగ తాంబూల దక్షిణహారతులను
మంత్రపుష్పంబులిచ్చుచు మదిలో దలచి॥

దరువు :— ఆత్మప్రదక్షిణమును జేసెదా । ఆత్మాతీతము దలచెదా
దేహాత్మభేదాము తెగగోసినిరతాము । భావాతీతంబైనా
పరిపూర్ణరూపునకూ । ఆత్మప్రదక్షిణము జేసెదా ఆత్మాతీతము
దలచెదా॥

(శ్రీ) మద్గురు . . . . . . పరబ్రహ్మణేన్నమః । (శ్రీ)మద్గురునకు తాం
బూల, దక్షిణ, నీరాజన, మంత్రపుష్పప్రదక్షిణాన్ సమర్పయామి॥

శ్లో॥ నమస్కారం దేశికేంద్ర । మయాతుభ్యం నివేదయేత్
కృపయాగృహ్యతాం స్వామి । న్యూనాధిక్యం నచింతయా॥

గీ॥ సప్తకోటి మంత్రములవి జ్ఞప్తి యనుచు
యజ్ఞయాగాది ధర్మముల్ రాగమనియు
వివిధ యాత్రలు మహిమలు అధమమంచు
యెంచి విడచియు మీపదకమలమందు॥

దరువు :— నమస్కారముగావించెదా । యింతటితో యీభవసా
గరముదాటెదా । మంత్రా తంత్రములాలో । మతిచేత
దొసగులు యేవైన నుండు । నాచింతా మాన్పగ మీకు
నమస్కారముగావించెదా । యింతటితో యీభవసాగరము
దాటెదా॥

శ్లో॥ అజ్ఞానమూల హరణం । జన్మకర్మ నివారణం
జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం । గురుపాదోదకం పిబేత్॥

సీ॥ సుజ్ఞానహంసను పక్షిగా జేసి నాకు
జ్ఞానవైరాగ్య రెక్కలు కలుగజేయ
జన్మకారణ సంకల్పజ్ఞాత తొలగ
సంచితంబైన కర్మజ్ఞానాగ్ని గాల॥

దరువు :— పాదోదకము గ్రోలెదా । సాధనలేనీ బోధామృతము త్రాగెదా
పంచాదసీదుర్గానందా సరస్వతీ పాదపూజలు జేసీ పలు
మారు ప్రణుతించి । పాదోదకము గ్రోలెదా । సాధనలేని
బోధామృతము త్రాగెదా॥

సీ॥ పరమ విశ్రాంతి చేకూర్చె తల్లి యెవరో
స్థిరతరంబైన గృహస్థుగా జేసె నెవరో
పరమశివరామపాదుకల్ స్థాపియెవరో
కరువుదీరగ నాకరువు దీర్చెమాత॥

దరువు :— పడాల గంగయమాంబనూ । పడిపడి మొక్కి పాదాల స్తుతి
యింతునూ । అడియాస వదలి యీ ఆరట్ల రామారావ్ । సీతా
లక్ష్మితో కలసి స్థిమితముగ పూజించె । పడాల గంగయమాం
బనూ । పడిపడి మొక్కి పాదాల స్తుతియింతునూ॥

సీ॥ భారద్వాజసఋషి గోత్ర సంభవుండు
ఆరట్లగృహనాముడా శ్రీనివాసుతండ్రి
పరమసాధ్వీమణి కృష్ణవేణితల్లి
గురునిపూజించ జన్మించి తిరుపురకును॥

దరువు :— రామరావనువాడనూ సమరసనిర్మల ప్రజ్ఞావిలక్షణుడా !
అమలా శ్రీదుర్గానందాచార్యులు పిలువాగ । విమలా సీతా మహా
లక్ష్మీ సాధ్వితో గూడి । రామరావనువాడనూ । సమరస నిర్మల
ప్రజ్ఞాన్ విలక్షణుడా.

జై శ్రీ శివరామదీక్షిత ప్రభుమహారాజుకీ
జై. జై. జై.

## —: గురువాక్యోపనిషత్తు :—

శ్లో॥ ఖంవాయుర్జ్యోతిరాపః । పృథివీవిశ్వస్యధారణే
యత్పరం బ్రహ్మసర్వత్ర । విశ్వస్యాయతనం మహత్

శ్లో॥ సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం । తత్త్వమేవ త్వమేవ తత్
జాగ్రత్స్వప్న సుషుప్త్యాది । ప్రపంచం యత్ప్రకాశతే
తద్బ్రహ్మ హమితిజ్ఞాత్వా । సర్వబంధైః ప్రముత్యతే॥

శ్లో॥ యోవేదాదౌస్వరః ప్రోక్తో । వేదాంతేచ ప్రతిష్ఠితః
తస్యప్రకృతిలీనస్య । యఃపరస్సమహేశ్వరః॥

శ్లో॥ ద్రష్టృదర్శనదృశ్యానాం । విరామో యత్రవాలభేత్
దృష్టిస్తత్రైవకర్తవ్యా । న నాసాగ్రావలోకనే॥

శ్లో॥ అంతఃపూర్ణం బహిపూర్ణం । పూర్ణకుంభమివాంబసే
అంతః సూన్యం బహి సూన్యం । సూన్యకుంభఇవాంబరే॥

శ్లో॥ ఈశానస్సర్వవిద్యానా । మీశ్వరస్సర్వభూతానాం
బ్రహ్మధిపతి బ్రహ్మణోధిపతి । బ్రహ్మ శివోమేఅస్తుసదాశివోం॥

శ్లో॥ వాక్పూర్ణసహనాప్యాయం । భద్రంకర్ణేభి రేవచ
పంచశాంతిః పఠేద్యాదౌ । పఠేద్వాక్యాన్యనంతరం॥

ఓం శాంతిః శాంతిః శాంతిః॥

---

## —: అనంతోపనిషత్తు :—

అతశ్శివ ఏవసనాతనం ॥
బ్రహ్మ భగవాన్ అచలయేవ సత్యం॥
నిరంజనం నిర్వికల్పం ।
నీరంధ్రంచ పరాత్పరం ॥
బాహ్యాముపైతివిద్వాన్ ।
అన్యజ్ఞానం నాస్తి॥
జన్మ ప్రవృద్ధినాస్తి ।
నాస్తిజ్ఞప్తి స్సర్వసదా సత్యవాక్యం ॥
భక్తిజ్ఞానే కర్మశక్తీచరహితం ।
సర్వవ్యాప్తం సచ్చిదానంద రహితం ॥
బ్రహ్మాండంవ్యాపితం బాహ్యం
బాహ్యం సర్వత్ర వ్యాపితం
అంతర్బహిశ్చ తద్బాహ్యా
మన్యం నాస్తీతి నిశ్చయం
ఇతినిశ్చత్యయో విద్వాన్
అచలయేవ నసంశయః
సద్రూపం నాస్తి సర్వత్ర
చిద్రూపం నాస్తి సర్వదా
ఆనందరూపగుంనాస్తి
అచలంచాస్తి సర్వదా
సర్వానంద విహీనశ్చ
అచలోయం సనాతనః
ఆనంద రహిత మచలం
కర్తృకార్య వివర్జితం
సత్యాసత్య విహీనంచ
విద్యావిద్య వివర్జితం

## -: అనంతోపనిషదర్థం, ఆంధ్రం ద్విపద :-

శ్రీమించు అచలపరిపూర్ణమే సత్యం ।
సత్యభగవంతుడదె । అచలమే బ్రహ్మం ॥
నిరంజనంబదీ । నిర్వికల్పంబు ।
రంధ్రములులేనట్టి । పరమపదమదియె ॥
బట్టబయలనిరిదే । శివరామ విద్వాన్ ।
ఇతర జ్ఞానములెవ్వి । దానందు లేవు ॥
జననమరణము లెపుడు జెందనీపరము ।
జ్ఞప్తిలేకున్నదదె । అంతటాసత్యం ॥
భక్తిజ్ఞానాశక్తి । కర్మలవి లేకా ।
సత్తుచిత్తానంద । రహిత వ్యాపకమై ॥
బ్రహ్మాండలోవెలీ బయలునిండుండె ।
బయలుసర్వంబులో తానునిండుండె ।
లోవెలీనిండినది బయలేనుగాని ।
ఇతరనేమియు లేదు ఇదినిశ్చయంబు ।
ఇట్లునిశ్చయమైన విద్వాంసు నెపుడూ ।
అచలుడని యనుటకును సందియము లేదు ।
సద్రూపమది లేదు సర్వత్ర చూడు ।
చిద్రూపమది లేదు స్థిమితముగజూడు ।
ఆనందరూపమది అందేమి లేదు ।
అచలపరిపూర్ణంబె అంతటనువుందీ ।
సర్వానందంబునూ లేనిదదిగోనూ ।
సనాతనంబైన అచలపరిపూర్ణం ।
అచలముకు ఆనంద మస లేమి లేదు ।
కర్తృకార్యములవీ కలితవాక్యములూ ।
సత్యాసత్యంబులూ సతతమూ లేవు ।
విద్యావిద్యలు రెండు వివరించలేవూ ।

ద్వైతాద్వైత విహీనంచ
ధర్మాధర్మ వివర్జితం
బంధాబంధాదిరహితం
అమృతం చాస్తి సర్వదా
సూక్ష్మాత్సూక్ష్మ తరంనాస్తి
మహతోస్మహితవర్జితం
అవేద్యమసంగమభాద్య
మభోద్య మలక్ష్య
మకర్మ మప్రిమేయ
మద్వయ మనిష్క్రియ
పరమాకాశ మచలం
సర్వధా భాతిపూర్ణం
నిష్కళం నిష్క్రియంపూర్ణం
నిరవంధ్యం నిరామయం
నిర్ధేశరహితం నిత్యం
బాహ్యాభ్యంతర నిశ్చితం
మాయాత్పరంభ వేద్వ్యస్తు
తత్పరం పరమశ్శివః
సర్వపరిపూర్ణగుంసత్యం
శివాదన్యం నకించన

## అయంవ్యర్థ బాహ్యా కౌపీన భవతి

నిరాభాసం నిరాధారం
స్వప్రకాశ వివర్జితం ।
భ్రాంతి జ్ఞానం పరిత్యాజ్య
సర్వం నాస్తీతినిశ్చయం ।
ద్రష్టాదృక్ జగత్సర్వం
సంభవం నాస్తి సర్వదా ।

ద్వైతాద్వైతంబులూ లేనె లేవెపుడూ ।
　　ధర్మాధర్మంబులవి తరచినను లేవూ ।
బంధాబంధములేని బయలైన పరమూ ।
　　అమృత స్వరూపమై అంతటున్నాదీ ।
సూక్ష్మాతిసూక్ష్మమను సూక్ష్మమూ లేందీ ।
　　హిరణ్మయావరణ మహత్తు కాందీ ।
తెలియకను కలియకను తెలివి తాగాక ।
　　భాద్యబోధ్యము లేక లక్ష్యంబుగాక ।
అప్రమేయంబద్దై ।
　　అద్వయం బగుచూ ।
సర్వదా నిండున్న ।
　　పరమాకాశంబూ ।
కళలు క్రియలును లేని పరిపూర్ణమయ్యా ।
　　తిలకింప నిరవంద్య నిరామయమదియే ।
నిర్ణయించగరాని బాహ్యాభ్రిహ్మంబూ ।
　　నిత్యమంతటనుండు సత్యమదిగోనూ ।
మాయకూ పరమైంది వేదవిత్తనిరి ।
　　విత్తుకూ పరమైన పరశివంబయ్యా ।
సర్వపరిపూర్ణమై సత్యదేవుడదై ।
　　సత్యదేవునికన్న ఇతరంబు లేదు ।
ఈ వృత్తబట్టబయ లేమియూ లేదు
ఆభాసమది లేదు ఆధారసూన్యం ।
　　స్వప్రకాశంబనెడి జ్యోతిరహితంబూ ।
భ్రాంతి తెలివిని యెపుడు విడిచిపెట్టాలి ।
　　కలజగము లేనిదని నిశ్చయించాలి ।
చూడబడు చూచేది చూచేటివాడు ।
　　మూడెపుడు పుట్ట లేదిపూర్ణమంటూ ।

మర్కట శృంగవద్భాతి
సత్యం సత్యం నసంశయః ।
కార్యమాయా ద్వయంనాస్తి
భయభ్రమ స్సదానహి ।
బ్రహ్మేస్పృహా భ్రమోనాస్తి
వంధ్యాసూను రివాపిచ ।
మరీచిక జలేకుంభే
పూర్ణమేవా జగద్భవేత్ ।
క్షీరపానేన సర్పశ్య
విషంనశ్యే జగద్భవేత్ ।
తమః ప్రకాశ మానేన
భాసతేత్యస్తిచే జగత్ ।
హిమం సూర్యకరే చాస్తి
జగత్సత్యం భవిష్యతి ।
మహిషీ గోరూప వద్భాతి
జగత్సత్యం భవిష్యతి ।
అగ్ని స్పర్శా జలం పిండం
భవేత్సత్యం భవిష్యతి ।
పవనోస్త్రైణ భిద్యేచ
జగత్సత్యం భవిష్యతి ।
పర్వతేపి భవేత్పత్రం
జగత్సత్యం భవిష్యతి ।
ఖర శృంగేణ మహిషో
మృతశ్చే జగదస్తితః ।
దృష్ట ప్రపంచ మిథ్యోక్తమ్
మూఢ యేవ నసంశయః ।

కోతికి కొమ్ముండుటది సత్యమైతే ।
నిజముగా సత్యమీ జగమధిష్ఠానం ।
కార్యమాయలు రెండు లేనివేసుమ్మి ।
భయము భ్రమలెప్పుడూ లేనెలేవయ్యా ।
బ్రహ్మ నేనను జ్ఞప్తి భ్రమయె లేదయ్యా ।
గొడ్రాలి బిడ్డంచు తెలుసుకోవయ్యా ।
ఎండమావులయందు కుండ నిండినటూ
పూర్ణబ్రహ్మమునందు జగమట్లు పుట్టె ।
పాలు త్రాగితె పాము విషముడిగియుంటె ।
నిజముగా ఈ జగము సత్యమనవచ్చూ ।
చీకటే వెలుగుగా తా మారియుంటె ।
జగము సత్యంబనుచు మదినమ్మ వచ్చూ ॥
మంచు సూర్యునివల్ల తా కరుగకుంటె
జగము సత్యంబనుచు మదినమ్మవచ్చు ।
గేదె గోరూపమున కనపడినదంటె ।
జగము సత్యంబనుచు మది నమ్మవచ్చు ।
అగ్ని వేడికి జలము ఉండగాయైతె ।
జగము సత్యంబనుచు మదినమ్మ వచ్చు
కత్తివేటుకు గాలి తెగునట్లదైతె ।
జగము సత్యంబనుచు మది నమ్మవచ్చు ।
రాతికొండను ఆకు మొక్క లేపుడితె ।
జగము సత్యంబనుచు మదినమ్మవచ్చు ।
గాడిద చెవులవే కొమ్ములై యుండి ।
దున్నపోతును పొడువ జగము సత్యంబూ ।
ఇట్టివే జగ మెరుకలని తెలియలేక ।
మూఢమానసులగుచు మదిని నమ్మేరు ।

శుక్తౌ రజత వద్భాతి
యథారజ్జౌ హి సర్పవత్ ।
తథా భాసతి సర్వత్ర
సర్వం శశి విషాణవత్ ।
దృశ్యం దృక్చ తథాద్రిష్ఠా
త్యక్త్వా తద్భాసనా సహ ।
తదేవ నాస్తి చాప్యాత్మా
దేహప్రాణాది సాక్షికః ।
నాస్తి సర్వమత స్సత్యం
బాహ్య బ్రహ్మేతి నిశ్చిను ।
జ్ఞాన మానందగుం బ్రహ్మ
ఇత్యుక్తం మూఢమానవైః ।
భ్రాంతి మూల మిదం జ్ఞానం
జ్ఞానం భ్రాంతిస్తు నిశ్చితం ।
జ్ఞానాత్సంజాయ తేనంద
మానందం భ్రాంతి లక్షణం ।
సత్యజ్ఞానమనంతంచ
మాయాగుణ మితిశృణు ।
జ్ఞాన మానంద గుం నాస్తి
ఇతి వేదాంత నిశ్చయం ।
సముద్రే భంగ ఫేనాది
బుద్బుదానిచ సర్వతః
యథానశ్యం యథా జాతం
తథా సర్వం చరాచరం ।
బాహ్యామధ్యేచ జాతంతు
బాహ్య మధ్యేచ నశ్యతి ।

ముత్యపుచిప్పలో వెండొచ్చినట్లు ।
త్రాడు పామై మనల తరిమి కరచినటూ ।
అట్లె యీ జగమంత తోచబడుచుండె ।
ఇట్లె సర్వంబునూ కుందేటికొమ్మూ ।
దృశ్య దృక్కును ద్రిష్ట ఈ మూటినెపుడు ।
విడిచి పెట్టుండాలి గురుకరుణపొంది ।
ఆమూటికూటమె బీజ శుద్ధాత్మ లేందీ ।
దీని సొంజ్ఞలె దేహ ప్రాణాదికములూ ।
సర్వమత సమ్మతము జ్ఞానమే లేందీ ।
బాహ్యబ్రిహ్మమె యెపుడు నిత్యమోయయ్య ।
జ్ఞాన మానందములు బ్రిహ్మంబటంచు
మూఢ మానసులంత మదినినమ్మెరూ ।
భ్రాంతు లన్నిటికినీ మూల మీ జ్ఞానం ।
జ్ఞానమే భ్రాంతియని మదినిశ్చయించూ ।
భ్రాంతి జ్ఞానమువల్ల పుట్టె ఆనందం ।
ఆనందమదిజూడ భ్రాంతి లక్షణమె ।
సత్యజ్ఞాన మనంత బ్రిహ్మమను వాక్యం ।
మాయాగుణంబులని మదిలోన వినుము ।
జ్ఞానమానందములు లేనివని యనుచు ।
వేదాంత గ్రింధంబు లవి నిశ్చయించే ।
సముద్రింపుటొడ్డునా కెరటాలయట్లు ।
నురగబుడగలవెట్లు పుట్టిగిట్టూనో ।
అట్లె యీ జగమంత పుట్టిగిట్టునయా ।
పరిపూర్ణ బ్రిహ్మముకు పూర్తిగా వేరై ।
బట్టబయలందునా పుట్టుచూనుండూ ।
బట్టబయలందునా గిట్టునోయన్నా ।

సముద్రే మత్స్య కూర్మాద్యాః ॥
యథా చరతి జంతవః ।
తథా చరతి బాహ్యస్య
మధ్యే సర్వం చరాచరం ।
బాహ్యం సర్వగతం నిత్యం ।
అచలం చాస్యతే సదా ।
అంతః పూర్ణంబహిః పూర్ణం ।
పూర్ణకుంభ ఇవార్ణవే ।
అంతర్బహిశ్చ తద్వ్యాప్తం ।
శివం సర్వగతం శృణు ।
సర్వం బాహ్యగతం నిత్యం ।
జ్ఞానం నాస్తీతి నిశ్చితం ।
తదేవ జాత మిత్యుక్తం ।
తదేవం నశ్యతి శృణు ।
తశ్యాపి కారణం నాస్తి ।
సత్యం సత్యం పునః పునః ।
బాహ్యమభ్యంతరం నాస్తి ।
సర్వం బాహ్యే వినిశ్చను ।
నస్నానం నచ ధర్మశ్చ ।
నచకర్మ నవర్తనం ।
బ్రహ్మ విష్ణ్వాది దేవైశ్చ ।
వందితః పరమశ్శివః
దేహ బాహ్యశ్య మధ్యశ్య ।
అంతరం వ్యాపిత శ్శివః
నిర్గుణం నిశ్చలం బాహ్యం ।
సర్వ కాలేషు సంస్థితం ।

చక్కనో వుపమాన మిది వినుము తండ్రీ ।
నిక్కమౌ జలధిలో జలచరములట్లు ।
పైపమీదను క్రింద నలుపక్కలందూ ।
అంతటా జలముండునట్టి రీతిగనూ ।
బట్టబయలంతటా తా నిండియుండూ ।
అదియె అచలంబనీ మది నమ్మవోయీ ।
యింకొకా వుపమాన మిటు వినుము నాన్న ।
కుండజలధిలో పెడితె లోపైట నీరె ।
ఆ రీతి బట్టబయ లంతటా వుండే ।
అదియె పర శివ తత్వమని తెరయవోయి ।
నిత్యమై అంతటా బట్టబయలుందీ ।
జ్ఞాన మెప్పుడు లేదు యని నిశ్చయించూ ।
తనుదానె పుట్టుమరి తనుదానెపోవూ ।
దాని పుట్టుక కెపుడు కారణము లేదు ।
మరిమరీ చెప్పెదను మదినమ్మవయ్యా ।
ఈ మాట సత్యంబు సత్యమేనయ్యా ।
అంతర్బాహ్యంబులా అహ మెపుడు లేదు ।
ఈ బట్టబయలెప్పుడూ నిశ్చయము సుమ్మీ ।
స్నానసంధ్యలు జపాతప యజ్ఞమూలు
చేసినా బయలెపుడు మరి యెరుగబోదూ ।
బ్రహ్మ విష్ణ్వాది దేవతలు యంతాను ।
వందనాల్ జేసిరీ పరమశివుడిదనీ ।
దేహమూ లోపలీ మధ్యనంతటనూ ।
అంతటా నిండున్న పరమశివు డితడే ।
కదలకను మెదలకను గుణరహిత మగుచు ।
సర్వకాలములందు సుస్థిరముగుందీ ।

జాగ్రిస్వప్న సుషుప్త్యాది
అవస్థా పంచకం నహి ।
షడూర్మి రహితో దేవః
షడంగైర్వర్జితశ్శివః ।
సర్వకాలే సదా వ్యాప్తం ।
సర్వదేశేషు వ్యాపితం ।
నిష్కామం నిర్మలం శుద్ధం ॥
అచలం శబ్ద వర్జితం ।
తేజోంధకార రాహిత్యం ।
బాహ్యాబ్రిహ్మ నసంశయః ।
సచ్చిదానంద రూపత్వం ।
మాయా ఇత్యభిధీయతే ।
జాతం నాస్తి మృతం నాస్తి ।
నాస్తి జ్ఞానం కదా చ న ।
ప్రపంచం నాస్తి సర్వత్ర ।
నాస్తి తత్కారణం సదా ।
పునః పునః ప్రవక్ష్యామి ।
సాక్షిర్నాస్తీతి నిశ్చయం ।
బాహ్యా బ్రిహ్మేతి నిశ్చిత్య ।
ఇతి వేదాంత డిండిమః ।
బహుదా తర్కవాదేన
కిం ఫలం కిం గమిష్యతి ।
అజ్ఞాన నరకం సిద్ధం ।
అన్యమార్గాను వర్తనం ।
శ్రివణ మనన నిధి ధ్యాస ।
సమాధి భ్రాంతి లక్షణం ।

జాగ్రిత్స్వప్నా సుషుప్తి తుర్యావస్థలునూ ।
తుర్యాతీతావస్థలెదెపుడు లేందీ ।
ఆరంగములులేని అసలుతత్వంబు
ఆరూర్ములునులేని ఆదిదేవుడదే ।
సర్వకాలములందు సర్వదేశములా
అంతటానిండున్న అచలపరిపూర్ణం ।
కోరికలులేనిదై నిర్మలంబగుచు
శుద్ధమా అచలమున శబ్దమేలేదు ।
వెలుగుచీకటిలేని వేదాంతతీతం
బట్టబయలేబ్రిహ్మ సంశయములేదు ।
సచ్చిదానందరూపం బదేమాయ
యని నిశ్చయించుమా వోబుద్ధివంతా ।
పుట్టనేలేనపుడు చావనేలేదు
జ్ఞానమెన్నడులేదు కడునిశ్చయంబూ ।
కలవలెనుఈజగము కల్లయేనమ్ము
కలకుకారణమైన ఆత్మయేకల్ల ।
మరిమరీచెప్పెదను మరినమ్ముకొనుము
సాక్షిలేనిదియనుచు మదినిశ్చయించూ ।
బట్టబయలేబ్రిహ్మమిది నిశ్చయించూ
వేదాంతసభలలో డిండిమలుకొట్టూ ।
తర్కవాదనలోన ఫలమేమికలదు
వాదులానోటిలో బూడిదేనయ్యా ।
అజ్ఞానమధికమై నరకంబుసిద్ధం ।
ఇతరమార్గములన్ని యింతేనునిజము ।
శ్రవణమననిధి ధ్యాసలన్నియునూ
సమాధిలక్షణముల విభ్రాంతులన్నా ।

బ్రహ్మవిశ్వద్వయం మిథ్యా
ఇతినిశ్చయమేనహి

శిష్యోర్నాస్తి గురోర్నాస్తి
నాస్తిజ్ఞప్తికదాచన

ఏతద్వాక్య నిబోధోయం
గురువాక్యే నలభ్యతే

ఏతచ్ఛ్రవణమాత్రేణ
విద్యావిద్యేచనశ్యతి

బ్రహ్మచారీ గృహస్థోవా
వానప్రస్థో యతిస్తువా।

తేషాంనవిద్యతే జన్మ
ఇతివేదాంత జర్ఝరః।

యేమానవాః పఠిష్యంతి
బాహ్యారూపా భవంతివా।

నిరాకాశం పరం బాహ్యం
అచలం పరిశిష్యతే।

అస్మిన్నర్థేన సందేహం
సత్యం సత్యం పునః పునః।

ఓం శాంతి శాంతి శాంతిః

బ్రిహ్మావిశ్వమురెండు యవిలేనివన్నా
నిశ్చయించిన నిశ్చయంబే మాయన్నా ।
గురుశిష్యులిద్దరనె గుర్తులేలేవు
గుణములేమియు లేవు గుర్తేమిలేదు ।
ఇట్టిదృఢవాక్యములు దృఢమాటకొరకూ
గురుసన్నిధిని జేరి మరితెలియవలెనూ ।
ఈవాక్యములుమదిని ఇంపుగావిన్న
విద్యావిద్యలు రెండు లేకపోతాయి ।
బ్రిహ్మాచార్యైననూ గృహస్తుడైనా
వానప్రిస్తైన తా యతియైనగాని ।
ఈధర్మమదివిన్న జన్మరహితమనీ
వేదాంతసింహామిటు గర్జించుచుండె ।
యేమానవులుయైన యిదిపఠనజేయ
బయలురూపమువలెను భద్రిమాతాడు ।
నిరాకాశంబదే పరబయలునాన్నా
అచలపరిపూర్ణమని మది తెలియుతండ్రి ।
ఇట్లు తెలసినయెడల సంశయములేదూ ।
ముమ్మాటికీసత్యమిది సత్యమయ్యా ।

ఇట్లనంతోపనిషట్సూత్రి వాక్యములూ
సమాప్తమయ్యెనూ సద్గురునికరుణన్ ।
పంచదశి శ్రీమద్గనద గురుకరుణన్
ప్రిజ్ఞానవిలక్షణా రామారావూ ।
శ్రీసూన్వాశిపురవాసి మాతగంగయమా
పేరిరేపణచేత భక్తులకువారిసె ।

నిరతమూ పఠియించ నిత్యకైవల్యం
పదవినీపొందెదరు పలుకురహితముగా ।

ఓం శాంతిః ఓం శాంతిః ఓం శాంతిః

—0—

## —✻ గురు పరంపరా మంగళ హారతి ✻—

1. యేమహనీయుడు । ఆమహాబయలెరిగి । కామించి యెరుకాను కడకూద్రుంచీ । ప్రేమాతో శ్రీదేవిపాణిావల్లభుడైన । భూమాస మాన శ్రీమహావిష్ణునకూ ॥ మంగాళం మంగాళం । సద్గురు దేవా మంగాళం మంగళం ॥

2. ఆవిష్ణు శేవకుడై । యానర్ణరహితూడై । అవనీలోరవిసౌంజ్ఞయాజ్ఞ్య వల్కి భవనాశస్థితిలేనిపరి పూర్ణబోధాను । సవరూగవినిపించెజనకు నకూ॥ మంగాళం మంగళం ॥ శ్రీసద్గురు దేవామంగాళం మంగళం॥

3. శ్రీశుకఋషివరుడు । ఆశతో జనకమహారాజు సన్నిధిజేరి । అచలా బోధా । భాసురంబుగన్వడసి । నొసగె సాందీపునకు । శ్రీ సాందీ పూడు శ్రీ శకేశవునకూ । మంగళం మంగాళం । సద్గురు దేవా మంగళం మంగాళం॥

4. గోవిందుడును ఆ । నందారహితుడగుచు । సుందారిపరమపతివ్రతకుం అందాముగా రుక్మినందా లోలుండగుచు । ముందూగ బయలు ధ్వాజ్ఞానులకూ । మంగళం మంగాళం ॥ సద్గురు దేవా॥ మంగళం మంగాళం ॥

5. శ్రీధరుని శివరామదీక్షితులు పూజించి । ఆద్యంత రహితా అశరీ రుడై రీ । ఈ ధర రామలింగార్యుల కరుణాచె । బోధాజెందినపరమా రాధ్యులకూ ॥ మంగళం మంగళం సద్గురు దేవా మంగళం ॥మం॥

6. స్థిరముగ పరమారాధ్యులనూ సేవించి । యెరిగెయెరుకను విడచె దేశికయ్యా । పరదేశికయ్యాకు పరగశిష్యుండైన । నాగయ్య యను నామాంకితుడనకూ॥ మంగాళం మంగళం ॥ సద్గురు దేవా మంగాళం మంగళం ॥

7. ఇల నాగయ్యాసుతుని । వలనాబోధనుపొంది బలరామా పండితులు బాగుగానూ । అలబలరామార్యులచె । కలనెడాబాసిన । కృష్ణామా చార్యుల కిష్టాముగా ॥ మంగాళం మంగాళం । సద్గురు దేవా । మంగాళం । మంగాళం ॥

8. కృష్ణామాచార్యులకూ । ఇష్టాసేవకులై । ప్రతిష్ఠానొందిన సన్యాసా ర్యులిలనూ । తృప్తిజెందినయట్లు స్పష్టాముగను బోధ । శిష్యూల కొసగె నుత్కృష్టాముగా ॥ మంగాళం మంగళం సద్గురుదేవా మం గాళం మంగాళం ॥

9. ప్రియమూతొ మగ్గానంద పంచదసి । యనుచు దయతో దీక్షనామ మొసగీ । భయపడకుమని ఝుడుపు । నయమూన ద్వాదసి సూ చాన నిచ్చిన సద్గురునాకూ । మంగాళం మంగాళం సద్గురుదేవా మంగాళం మంగాళం ॥

10. మగ్గానందునిసేవ దీర్ఘముగాగావించి । అర్ఘ్యాపాద్యములాచె యెరు కన్విడచీ । మార్గదర్శియైన సమరస నిర్మలా ప్రజ్ఞాన్విలక్షణ రామ ప్రభునాకూ మంగాళం మంగళం। సద్గురు దేవా మంగాళం మంగళం॥

11. నూటీగా సన్యాసార్యా సేవనుజేసి । మాటామర్మము తెలసి నీటన్ గలిపీ । వాటముగ త్రికూట స్థానాతీతమువిడచె విమలాంబ కామే శ్వరమ్మా గుర్విణికీ మంగళం మంగాళం । సద్గురుదేవా మంగాళం మంగాళం ॥

12. కామేశ్వరి గురుజేరి । భూమాతత్వ తెలసి । స్వామూలందరిపూజల్ సరిగాజేసీ । భూమాశివరామూని ధామామందుననిల్పి । భామామణి శ్రీ గంగాయాంబా । గుర్విణికీ॥ మంగాళం మంగాళం సద్గురుదేవి మంగాళం మంగాళం॥

శ్రీ నిజగురు పూజావిధానం సర్వం

శ్రీ సద్గురు చరణారవిందార్పణమస్తు.

జై శ్రీ పరమగురు

శ్రీ శివరామ దీక్షిత ప్రభుమహారాజుకి జై








శక్తిద్వయ నిరాశకంబైన శుద్ధ నిర్గుణ తత్వకందార్థ

అమృత గంగా తరంగిణో

# ప్రథమోధ్యాయ ప్రారంభము

కం॥ హృదయగ్రంధి విడుటకున్నె సదయత యీ బోధ దెల్ప జనదాగు రుడై। వదలక చిత్తములో గురుపదయుగళము తలప వలదె। భక్తుడైనపుడూ। భ్రాంతిరహితా సక్తుడైనపుడూ। కుదురాదు యివి రెండూ। గురుశిష్యులకు లేక। కదలిక లేనట్టి ఘనబోధో క్తస్థితి। భక్తుడైనపుడూ। భ్రాంతిరహితా సక్తుడైనపుడూ॥

శిష్యునిప్రశ్న:— హేసద్గురుమూర్తి! శ్రీ బృహదార్యాశిష్య సిద్ధాంత నిర్ధారణోద్ధారక శ్రీమదచలఋషీ శ్రీ శివరామదీక్షిత ప్రభు పీఠ పరంపర వాసా! హేనిరంజన నిరామయ నిర్వికార ఆవరణరహిత బ్రహ్మ విష్ణు మహేశ్వర సాక్షాత్పరబ్రహ్మ స్వరూపా! నిరంతరమూ మీ దివ్య చరణ కమలములను నా హృదయకమలమున నిల్పుకొని షోడశోపచార పూజలు గావించి ధ్యానించుచుందును. హేపరమదయాళో! దీనజనపాలనా! నే మనవిచేయు విన్నములాలించి। నాసంశయములను విడగొట్టి। జననమర ణములను సంసారసాగరమును దాటింపజేయుడు తండ్రీ!

ఆర్యా హృదయగ్రంధి అనగా నేమి?

శ్రీగురుజవాబు:— బిడ్డా ! నీవెందుకు నన్నాశ్రయించినదీ నే నెఱుగుదును. నీభక్తికి మెచ్చితిని.

నాయనా ! హృదయగ్రంథి యనగా జ్ఞానాజ్ఞాన మిశ్రమ అవిద్యా సప్తావరణలే । అనగా మొదటిది అవిద్య । రెండవది శరీర పరిగ్రహము । మూడవది కర్మము । నాలుగవది దుఃఖము । ఐదవది అభిమానము । ఆరవది అవివేకము । ఏడవది రాగద్వేషాదులు.

ఇందులో అవిద్య అనగా అజ్ఞానము చీకటిదశ । యీ అవిద్యయే కారణశరీరమైన సుషుప్త్యవస్థయనే గాఢనిద్ర। ఇగ్గాఢనిద్రనుండి స్వప్న జాగ్రదవస్థలు కలుగుచున్నవి । కనుక అనేక శరీరములతో జగద్రూపము తోచబడుటకు । అవిద్యాయుక్త చైతన్యమైన । కారణశరీరసుషుప్త్యవస్థయే కారణము । దీనికి చిన్నప్రత్యక్ష ప్రమాణము తోచబడుచున్నది। సినీమాహాలులో దీపములన్నీ ఆరిపోయినతర్వాత చీకటిలో తెరపై అనేకత్వమైన సినీమా ప్రపంచము తోచబడుచున్నది । అటువలెనే మనలో అవిద్యయను మొదటియావరణలోనుండి । శరీరపరిగ్రహమను రెండవఆవరణ తోచబడెను । శరీరము కలిగినదీఅంటే । ఏదో ఒకవ్యాపారముచేయుచునే యుండును । ఈవ్యాపారమునే కర్మ అని అందురు. ఈ కర్మ శరీరకర్మ । మాటలరూపమైన కర్మ । మనస్సుచేత ఆలోచనా రూపమైన కర్మ। అని మూడు విధములు । ఆకారణమున స్వప్నావస్థలో మానసిక కర్మ జరుపుచున్నాము । జాగ్రదవస్థలో కాయిక వాచిక మానసికములతో కర్మ జరుపుచుంటిమి । అందుచేత కర్మము మూడవ యావరణమైయున్నది । ఈ కర్మ అవిద్యా రూపమైనప్పుడు దుఃఖదాయకమై యుండును గదా । కనుక దుఃఖము నాలుగవ ఆవరణమై యున్నది । ఈ దుఃఖము యెందుకుకలిగినదీ అని ప్రశ్న వేసుకొనినయెడల । నేనను అహంకారమనే। కర్తృత్వరూపమైన । అభిమానమువల్ల కలుగుచున్నది । అనగా "నేను" "నాది" అను కర్తృత్వాభిమానమువల్ల మనస్సుకు విశ్రాంతిలేక । ఇరుకునపడి బాధపడును । ఇదియే దుఃఖము । ఈ దుఃఖమునకు కారణము

అభిమానము ఐదవఆవరణమైయున్నది । ఇట్టి అభిమానమునకు కారణము అవివేకము । అవివేకమనగా ధర్మాధర్మ న్యాయాన్యాయ విమర్శనా వివేకములేని కారణమున । అభిమానమను ఐదవ ఆవరణకు బలమయ్యెను । కనుక అవివేకము ఆరవ ఆవరణయైయున్నది। ఇట్టి అవివేకము మరింత బలమగుటకు । ఈర్ష్య, అసూయ, పట్టుదలతో కూడుకున్న కోరికయే । రాగద్వేషములనబడును । ఈ రాగద్వేషములే ఏడవ ఆవరణ । వీటన్నికీ మూలము అజ్ఞానము । ఈ అజ్ఞానమునకు మూలము । జ్ఞానమనబడు ఈ నేను నేనను తెలివి । ఇదియే హృదయగ్రంధి । ఈ విధానమైనహృదయగ్రంధి । నవీననాగరకతా ప్రపంచములో । అజ్ఞానులు మొదలు ప్రజ్ఞావంతులైన పండితులవరకూ ఆవరింపబడి శాంతియుతజీవజగత్తును అశాంతియుతముగా చేయుచున్నది.

ఓ బిడ్డా! పైని చెప్పిన అవిద్యా సప్తావరణలనూ । నీమనస్సుచేత. చక్కగా విచారించి । వివేకము కలిగి ధర్మాధర్మ విచారణపరుడవై । సాధనసంపత్తి కలిగినవాడవై । ఈ హృదయగ్రంధి యనే వ్రణమును మాన్పుకొని । "మమాత్మా సర్వభూతాత్మా" । అను శృత్యానుగుణ్యముగా । సర్వభూత దయతోగూడి । బ్రహ్మజిజ్ఞాసా తత్పరుడవై యుండుమని । నీకు పదేపదే జ్ఞాపకముచేయుటకు । పరిపూర్ణ బోధామృతము చిలుకుటకు । గురువులు శిష్యుని యింటికి వెళ్ళవలెను । సచ్ఛిష్యుడు అనగా జననమరణభ్రాంతిని వదలకొట్టుకొను పూర్ణ వుద్దేశము కలిగి । లక్షణయుతుడై యున్నవారు సచ్ఛిష్యులు । ఇట్టివారు నిరంతరమూ । అశరీర సద్గురు ప్రభువర్యుల దివ్యచరణకమలములను । హృదయకమలములోనిల్పి । తల్లితండ్రి । దొరదాత । కులదైవము । తనకువున్న సర్వబంధువులూకూడా సద్గురుడేనని । నమ్మికోవలెను । మానసిక చలనమునుపోగొట్టుకొని । నిశ్చలతత్వస్థితిని పొందుటకూ । పొందింపచేయుటకూ । గురుశిష్యులిద్దరకూ ముఖ్యముగా అవసరమైయున్నది । కనుక ఇద్దరిలోనూ శంకలువిడచి సంకర అనుమానములకు తావీయక । శంకారాహిత్యులై యుం

డవలెనని ప్రభువర్యులైన శ్రీ భాగవతకృష్ణదేశికులనుడి.

శిష్యునిప్రశ్న:— హేనిర్గుణ నిరంజన ప్రభువర్యా! శ్రీ భాగవత కృష్ణదేశిక ప్రభువులు మొట్టమొదటి కంద్యార్థములో,

కం॥ "జనులార జననమరణములను తొలగంద్రోయజాలు లక్షణయుతమై వినువారికి" । అని శెలవిచ్చిరి. ఇందులో లక్షణయుతముగావినుట అనగా । చక్కగా కూర్చుండుటయా ? లేక సన్యాసి వేషభాషలు కలిగి యుండుటయా ? లక్షణములనగా యేవి ? వాటి విషయము సెలవీయ ప్రార్థించుచున్నాను.

గురుప్రభువుల జవాబు:— ఓశిష్యాలంకార భూషణమా ! చక్కని ప్రశ్న వేసితివి। ఈ "లక్షణయుతమై" అను పదప్రయోగమునకునాఅభ్యాస దశలోనుంచి కూడా విచారణ పెద్దలవల్ల వింటూనే యున్నాను । కాని అవన్నీ నామనస్సుకు సరిపోలేదు । కాని శ్రీ భగవద్గీతోపదేశికులైన । పరమహంస పరివ్రాజికాచార్య శ్రీకృష్ణపరమాత్మ త్రియోదశోధ్యాయ మున । భక్తునకు ఇరువది లక్షణములు వుండవలెనని శెలవిచ్చిరి । అవి యేవనగా:—

శ్లో॥ అమానిత్వ మదంభిత్వా । మహింసా, క్షాంతిరార్జవం
ఆచార్యోపాసనం శౌచం । స్థైర్యమాత్మవినిగ్రః॥

1 అమానిత్వ అనగా । తన్ను తాను పొగడుకొనుటయందు ఇష్టము లేకుండుట । దీనినే ఆత్మస్తుతిని అభిలషింపకుండుట యందురు. 2 అదం భిత్వ మనగా తనయొక్క మంచి నడనడికను ఇతరులతో చెప్పుకొనుట యందు ఇష్టపడకుండుట. 3 అహింస అనగా ప్రాణులను పీడింపకుండుట. 4 క్షాంతి యనగా ఒరులుచేసిన తప్పులను క్షమించి సహించుట. 5 ఆర్జ వము అనగా కుటిలత లేకుండుట. 6 ఆచార్యోపాసనం అనగా మోక్షసా ధనోపేతులైన గురువర్యులను చాతుర్విధ శుశ్రూషలచే శేవించుట । 7 శౌచం అనగా శరీరమాలిన్యమును మృజ్జలాదులచేతనున్నూ । అంతః

కరణమాలిన్యములైన । రాగాదులను । ప్రతిపక్ష భావనచేత తొలగించు కొనుట. 8 స్థైర్యమనగా । మోక్షమార్గమందు స్థిరభావము । ఆత్మ విని గ్రహం మనగా । దేహేంద్రియాది స్వాభావిక విషయగుణముల నుండి తొలగించి సన్మార్గముగా పెట్టుట.

శ్లో॥ ఇంద్రియార్థేషు వైరాగ్య । మనహంకార ఏవచ
జన్మమృత్యు జరావ్యాధి । దుఃఖదోషానుదర్శనం॥

9 ఇంద్రియార్థేషు వైరాగ్య మనగా । అంతలో కలిగి అంతలో కలుగకుండా పోయే । శబ్దాదులైన పంచతన్మాత్రా భోగములయందు హేయభావముకలిగి యుండవలెను. 10 అనహంకారఏవచ అనగా అహంకారభావములేకుండుట । అనగా నేను తెలుసుకున్నాను । నాకంటె తెలివైనవారు వీరుకారు । అనుకొనుట కూడా । అహంకారములోని దేకనుక విద్యను విమర్శించుటయందు । వివేకమును విపులపరచి । నూతన పద్ధతులుగా బోధలుచేయుటయందు మనకంటె పెద్దలు జ్ఞానులు కలరని తలచి । మానసికపొంగును అణిగించుకొని । అంతఃకరణయందు శాంతిని పొంది యుండుట అనహంకారమనబడును. ఇక 11 జన్మమృత్యు జరావ్యాధి । దుఃఖదోషానుదర్శనమనగా । తన ఆత్మీయులయొక్క పుట్టుకయందునూ । తనకుగాని తన ఆత్మీయులకుగాని వచ్చిన రోగభయాదులయందు। యుక్తి అనుభవముచేత విచారించి । వాటియందు । మనస్సు పతనముగాకుండా। ధీరతగా నిలబెట్టుట.

శ్లో॥ అసక్తిరనభిష్వంగః । పుత్రదారాగృహాదిషు
నిత్యంచ సమచిత్తత్వ । మిష్టానిష్టోపపత్తిషు॥

12. అసక్తి అనగా విషయములందు ప్రీతి లేకుండుట । 13. అనభిష్వంగః । ఇష్టానిష్టోప । అనగా ఇష్టములు సంభవించుటయందునూ । అనిష్టములు సంభవించుటయందునూ । ఆనందానంద తాపములనుండి విడవడిన వారై వాటియందు ప్రీతి లేకుండుట ।

శ్లో॥ మయిచానన్యయోగేన । భక్తిరవ్యభిచారిణి
వివిక్తదేశసేవిత్వ । మరతిర్జనసంసది ॥

14, 15, 16, 17. మయిచా ... భక్తిరవ్యభిచారిణి = అనగా పరమాప్తోప దేశికునియందు । సాక్షాత్పరమేశ్వరుడను । నిశ్చితమగు బుద్ధిచేత। ప్రీతి పూర్వకమైన భక్తియుండవలెను । 18 వివిక్తదేశ సేవిత్వమరతిర్జన సంసది :— అనగా స్వభావముచేతగాని । సంస్కారముచేతగాని శుచికలిగిన ప్రదేశముల నాశ్రయించి । పామరులైనట్టియు । సంస్కారశూన్యులైనట్టియు । అవినీతులైనట్టియు । జనులయొక్క సంఘముల యందు సంచరింపకుండుట.

శ్లో॥ అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం । తత్వజ్ఞానార్థదర్శనం
ఏతజ్ఞాన మితిప్రోక్త । మజ్ఞానం యదతోన్యథా॥

19 అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం:— అనగా ఆత్మవిషయిక జ్ఞానమును గూర్చి నిరంతరాభ్యాసమున్నూ । 20 తత్వజ్ఞానార్థదర్శనం:— తత్వజ్ఞానమునకు ప్రయోజనమగు మోక్షవిషయిక అలోచన కలిగి యుండవలెను.

ఇట్టి ఇరువది లక్షణములు కలిగినవారే జిజ్ఞాసులు । ఇటువంటి । సమరస నిర్మలాంతఃకరణభక్తియుతేపేతులైన జ్ఞనులే । వేదాంతసభోపన్యాసములనువిని । విమర్శించగల సమర్థులు । కనుకనే శ్రీ భాగవత కృష్ణప్రభువులు "లక్షణయుతమై దినువారికి" అను పదప్రయోగముపెట్టి । ఇట్టి లక్షణములుగల సద్భక్తుడు । ఆర్యులముఖతా యెప్పుడైతే విని విమర్శించునో । అప్పుడే తనయొక్క స్థితినీ తెలియబడునని శెలవిచ్చిరి.

చూచితివా నాయనా ! ప్రభువులు యెంత గంభీరాభిప్రాయము ఇమిడ్చి । లక్షణయుత మను పదమును ప్రయోగించిరో । ఇట్లే ఆగామికథ యెట్లన బాగుగవివరింతు । చెవులపండువగాగన్ । ఆగమనిగమోపనిషత్సాగర మథితార్థమంతా ఈ గ్రంథరాజములో యిమిడ్చితినని శెలవిచ్చిరి । ఈమాటనుబట్టి మనము కందార్థములలో అర్థము । అంత తేలికగా

విచారించకూడదు । అని తెల్లమగుచున్నది । అందుకే । ఇది ఆంధ్రకవిత్వంబని మదిరోయందగదు దీని మర్మమరయుడీ । పదియారువన్నె పసిడిని ముదమున తోల్ పెట్టెనుంచ ముట్టకుందురా । అని శెలవిచ్చిరి.

కనుక బిడ్డా ! సభావిజ్ఞాపనములో సభకట్టుకు । చక్కనిదృష్టాంతము చెప్పిరి । అదియేదనగా; "యెరుకను కలలోపలనే నరుడెంచితి । మీరలట్లు అరుడెంచితిరి । ఈ యెరుక జన నేనూ మీరలూ యెరుకతో జనువారమనిన్నీ" నేను ఈ సద్గ్రంధముచేసి । మీ అందరిముందూ । చదువుటకు నిలబడి వినమనడమూ । మీరందరూ వినిపించండీ, అనడమూ ఇదంతయూ ఒక కలగా భావనచేయవలెను అని సభవారిని హెచ్చరించి । బోధచేత మేల్కొని తనను మేల్కొల్పమని సభవారిని కోరిరి । అనగా ఎవరిమట్టుకువారే ఒక కల కంటున్నామని పూర్తిగా నిశ్చయించుకొనిన యెడల। కలలో కలిగిన శంకా సమాధాన, అనంగీకార। అంగీకారములు । కుదరక సరిపడనిచో । కల ఆవరణనుదాటి పొమ్మని వారివుద్దేశము । సభావిజ్ఞాపన ఆఖరుకందార్థములో । కొంచెము వెడలుపుగా వుండేనదీ ప్రవాహమువద్ద లోతుయెక్కువగా వుండునని తెలిసి వెడలుపును పెంచితినని శెలవిచ్చిరి । అనగా సర్వులూ సులభముగా తెలుసుకొని తరింపవలెనని వారి వుద్దేశము, కాని । నాగురిలోనికివచ్చినవారే అని కాదు అని తేలుచున్నది.

ఇంతటితో కందార్థామృత గంగాతరంగిణిలో

ప్రథమోధ్యాయం సమాప్తం.

పాట — అటతాళం.

ఖరగపూరులో, 1936 సం॥రం॥లో కవిత్వంప్రారంభం మొట్టమొదటిపాట.

(1) దీక్షతో గురుదీక్ష తెలియండీ ! జనులార మీరూ । కక్షలన్నియు మదినివీడండీ॥ దీక్షతో గురుదీక్ష తెలసిన క్షరాక్షరములు లేని పరమును । లక్షించాతక్షణమున నె । సాక్ష్యతీతంబాదురిదినిజం॥ ॥దీక్షతో॥

(2) వాదబేధములేక యుండండీ । జనులార కల మత వాదములలో జిక్కబోకండీ। వాదబేధములేక నిలచీ । సాధనా సంపత్తి తెలసీ । సాధువులతోగూడి కలసీ బోధరూఢిని జెందిమీరూ । దీక్షతో॥

(3) యెండమావుల జలములోనండీ । స్నానంబటన్నను । రెండు నష్మని వనుచు నమ్మండీ॥ యెండమావుల జలములావలెకుండలీభూతమును జూచి । దండిగా బ్రహ్మాండమంతట నిండియున్నదటంచునమ్మక ॥దీ॥

(4) నలుబదీ మూడక్షరాలండీ । జనులార గురునీ । నిలుపుననుపూజించి తెలియండీ॥ నలుబదీ మూడక్షరాలవి నరములందున పరుగుపెట్టిన। నామరూపులులేని పరమును । లేకమీరు శేవింపుచుందురు ॥దీ॥

(5) విజయనగరా పీఠమూలోనా । జనులార సద్గురు । సన్యసార్యుల కరుణబడసీనా॥ విజయమొందిన దుర్గనందులు । పంచదసిమై రామ రావుకు । గజబిజీ జగమెరుక దీసిన । పరమగురువరు దరిని జేరీ ॥దీ॥

జై.

---




## శక్తిద్వయ నిరాశకంబైన శుద్ధ నిర్గుణ తత్వకందార్థ

## అమృత గంగా తరంగిణి

# ద్వితీయోధ్యాయ ప్రారంభము

కం॥ సాధనసంపత్తియుగల సాధకుడొకనరుడు । ఘోరసంసారమునన్ ।
బాధపడ లేక । తనపుణ్యోదయమున గురునిగాంచి । యురుతరభ
క్తిన్ । శరణని మ్రొక్కిమరిమారియుక్తిన్ । బోధాజేయుముపుణ్యా
పురుషా మాబోంట్లాకు । సాధించదగు ముఖ్యసాధనానిపల్కి ।
నురుతరభక్తిన్ । శరణని మ్రొక్కి మరిమారియుక్తిన్ ॥

శిష్యునిప్రశ్న :— ఆర్యా ! నిరహంకార నిశ్చలమనస్కా ! పైకందార్థములో సాధనసంపత్తిగల సాధకుడనగా యెటువంటివారు ? ఎటువంటి సద్గురుమూర్తిని విచారించిచేరవలెను ? గురుడు మొదట యేమనిశలవిచ్చెను ? కరుణాకటాక్షముంచి తెలియపరచ ప్రార్థించుచున్నాను.

గురుప్రభు జవాబు :— పరమోదార ప్రచండ బంగారుకొండా ! చెప్పెదనాలకింపుము. వేదాంతపంచదసిలో । అధికారి । సంబంధము । ప్రయోజనము । విషయము । అని అనుబంధచతుష్టయము చెప్పిరి । అధికారియనగా। సాధనచతుష్టయసంపత్తిపరులే । బ్రహ్మవిద్యను తెలిసికొనుటకు అధికారులు । ఇట్టిఅధికారి నడవడిక యెట్లుండును। అనిఅంటే।శ్రీసచ్చిదానంద వెంకటేశ్వర అవధూత స్వాములవారు సద్గురుబోధామృతములో।

కం॥ "సాధుల సాంగత్యంబును । వేదాంత శ్రవణపఠన వేతృత్వంబున్
బోధాధికారమును । మరి । మేధానిధితోనుగూడి । మెలుగూచు
నుండూ । సచ్ఛిష్యుడై వెలుగూచునుండు ।" అని శెలవిచ్చియున్నారు

కనుక । మోక్షమునందపేక్షగల మానవులు । వివేకవైరాగ్యము లనే । రెండురెక్కలను ధరించి । నిత్యమనగానేది అనిత్యమనగా నేది । అనువిషయమును పెద్దల సాంగత్యముచేతనూ । సద్గ్రంథపఠనము చేతనూ । భావమును ఊర్ధ్వముఖముగా పోనివ్వవలెను ॥

దివ్యజ్ఞాన । వైరాగ్యవివేక । శుద్ధసాత్వికసంపత్తులు । గలపుణ్యపురుషులనుగన్న భారతమాతపుత్రులమైయుండి " నేనుజడుడను । లౌకికుడను మాయసంసారజీవిని । అని చుట్టూగోడకట్టుకొని కూర్చుండక । ఈమూడు న్నర మూరలశరీరమే । నా సర్వస్వమని । బేలతనమునుపొంది నీచత్వమునుపొందకూడదు । " మంచిభావనలు " అను రెక్కలను విరచివేసికొన కూడదు । నాకీజన్మలో ముక్తిమార్గము లభించునా ? నేను మోక్షమును పొందగలుగుదునా ? అని సంశయమును పొందగూడదు. విధి విరామము లేని ప్రయత్నముచేత । మానవుడు సాధించలేని కార్యముండదు । ఎనుబది నాలుగులక్షలజీవరాసులలోను । మానవజన్మ ఉత్కృష్టమైనది । ఇటువంటి ఉత్కృష్టమైన జన్మను । ఆహార । నిద్ర । మైథునముల కని తలుచకూడదు । ఇట్టిఅజ్ఞాన భావములను విడచి । నేను ఎవడు ? ఈ శరీరము యెట్లు కలిగినది ? ప్రపంచసృష్టియెట్లు ? ఈ సృష్టికర్త యెవరు ? వారిని నేనెట్లుపొందగలుగుదును । మహాభక్తవిజయములో విచారించితే తుకారామ్ । కబీరు రామదాసు । త్యాగయ్య ఇత్యాదిభక్తులకు భగవంతుడు యెట్లు ప్రత్యక్షమయ్యెను ? నాకు యెందుకు కాకూడదు ! అను పట్టుదలతోకూడిన ప్రశ్న పరంపరలను కల్పించుకొని । భాగవతులతోగూడి । భాగవతార్థమును గ్రహించవలెను. భాగవతము అనగా " భ "-భక్తి । ' గ ' జ్ఞానము । ' వ ' వైరాగ్యము । " త " తత్వము । ' ము ' । మోక్షము । ఇటువంటి భక్తి జ్ఞాన వైరాగ్య తత్వ మోక్షముల యొక్క । విషయ విజ్ఞానానుభవము పొందవలెను.

భక్తిలో మూడువిధములు । బాహ్యాభక్తి । అనన్యభక్తి । ఏకాంత భక్తి । ఇందులో బాహ్యాభక్తి అనగా : ఏదోఒక దేవునినమ్మికొని । ఆ దేవుని ప్రతిమను । పూజామందిరమున నిలపెట్టుకొని । ఆ దేవుని మనోవాక్కాయ కర్మలా । భక్తితో పూజించి అర్చించి ఆరాధించి । తీర్థప్రసాదములు స్వీకరించి తననిత్యకృషిని సల్పుకొనుచుండవలెను । అందులోనూ అధర్మ । అన్యాయ । అహంకారపూరిత కర్మలకు పాల్పడక । సత్యము । అహింస । శౌచము । ఆస్తేయము । మొదలైన సత్సాంగత్యముతో కూడుకున్న । సత్ప్రవర్తనకలిగినవారై । న్యాయబద్ధమైన ఆజ్ఞన ఆజ్ఞించుచూ । వ్యవహారికములో । కాళీకలిగినప్పుడల్లా ప్రభునినామోచ్చారణ చేయుచూ। నిమీలిత నేత్రావతంశుడై । భక్తులను కనుగొన్నప్పుడు । ప్రియముతో మొక్కుచూ । శాంతియుత మనస్సుకలవారై । సంసారిక కర్మలలోగల సుఖదుఃఖాదులకు । తానుకర్తనని తలంచక । సర్వంసద్గురుకరుణా ప్రసాదమని తలచుచూ । కర్తృత్వ రహితముగావుండును । ఇదియే బాహ్యాభక్తుని నడవడిక.

అనన్యభక్తిఅనగా :— పైని చెప్పిన నిరాడంబర బాహ్యాభక్తుడు । తనమనస్సును । ఊర్ధ్వముఖముగాత్రిప్పి । సర్వకాల సర్వావస్థలయందూ యెరుకలో యెరుక కలిగి భ్రూమధ్యస్థానమున । మనస్సునుంచి । నిరంతరమూ భగవధ్యానాతత్పరుడై । సత్పురుషుల సాంగత్యము చేయుచూ । నిత్యానిత్య వస్తువివేక । విచారణసల్పుచుండును.

(1) నిత్యానిత్య వస్తువివేకమనగా :— "బ్రహ్మ సత్యం జగన్మిధ్య" । అని ఆర్యశృతికలదు । ఇచ్చట బ్రహ్మమననేమో । జగత్తననేమో । విచారించవలసియున్నది । బ్రహ్మమనగా । "సత్యజ్ఞాన మనంతం బ్రహ్మ" । అని శృతిపలుకుచున్నది । అనగా జ్ఞానం సత్యం । జ్ఞానం అనంతం । జ్ఞానం బ్రహ్మమనిఅర్థము । ఈజ్ఞానము । పిండబ్రహ్మాండ । బ్రహ్మాండఅతీత । స్థానములలో మూడు విధముల నామములతో పరిగణింపబడుచున్నది. బ్రహ్మాండఅతీత స్థానములో పరమపదమనిన్నీ బ్రహ్మాండస్థానములో పరాపర

డనిన్నీ పిండాండములో అపరుడనిన్నీ ఆర్యులచేత చెప్పబడినది. అపరుడనగా ఈపిండాండ రూపమైన దేహేంద్రియాది ప్రపంచములో ప్రత్యగాత్మయని పిలువబడు అవస్థాత్రయసాక్షియే జ్ఞానము అవస్థాత్రయములనగా జాగ్రత స్వప్నము సుషుప్తి ఈఅవస్థలలో జాగ్రదవస్థలో ఈ నేను నేననే జ్ఞానము చక్షురంతర్గత పీతాభాస అణుస్వరూపమై సర్వమునూ గుర్తెరుగుచున్నది. ఇదియే అంతర్ముఖమై కంఠస్థానమున మనస్సంకల్ప మాత్రముచేత స్వప్నమును కల్పించుకొని స్థూలశరీరము ఆడకనే ఆడుచున్నది. ఈ జ్ఞానమే జాగ్రిస్వప్న ఇంద్రియ విషయాదులను తనయందు లీనముచేసుకొని అవిద్యాయుక్తచైతన్యస్థానమైన హృదయస్థానమునలీనమై సుషుప్త్యవస్థను పొందుచున్నది. ఇట్టి అవస్థాత్రయ సాక్షిస్వరూపమైన జ్ఞానమే కాలత్రయములందు నిత్యస్వరూపమై వున్నట్లు తోచుచున్నది. కాలత్రయములనగా జరిగిపోయినకాలయు భూతకాలము, జరుగబోయే కాలము భవిష్యత్కాలము, జరుగుచున్నది వర్తమాన కాలము, ఈ మూడు కాలములయందూ యీ నేను సత్యముగా వున్నట్లు తోచబడుచున్నది. అది యెట్లనగా వెనుక పుట్టితిని యేవేవో ఖర్మలు చేసితిని దాని ఫలితమిప్పుడనుభవించుచున్నాను. అని యీ నేననే జ్ఞానమే అంటున్నది. కనుక యీ నేనను తెలివి ఈ దేహమువంటి దేహములో జరిగిన గత జన్మలో వున్నది. ఇప్పుడేమైనా దానధర్మ సగుణధ్యానములుచేసినచో ముందు జన్మకు మంచిదని అంటున్నాము. కనుక ముందు జన్మ మెత్తనున్నట్లు చెప్పుచున్నాము. ఇప్పుడు సుఖదుఃఖాదు లనుభవించుచూ కనుపడుచున్నది. ఇట్లు ఈ ప్రజ్ఞానస్వరూపమైన జ్ఞానము మూడు కాలములయందూ వున్నట్లు తోచబడుచున్నది. కనుక ఈ జ్ఞానము సత్యము ఈ యెరిగేచైతన్యస్వరూపమైన జ్ఞానమునకే యెరుక యను పదప్రయోగముచేసి కందార్థములలో,

కం॥ ఆటాడి ఆడకుండును। ఆటాడిన మేనిబొమ్మ ఆటాడకనే ఆటాడు
యెరుక యనియెడి ఆటాడించేటివాడు అతడేరాకర్త. అంతటికి ఈ
అచలాత్మకర్త॥

అనికృష్ణపరిభువులు శెలవిచ్చిరి. కనుక అవస్థాత్రయమే జగత్తు. నేననే నాలుగవ దేహమైన జ్ఞానమువల్లనే తోచబడి తిరిగి దానందే అణిగిపోవు చున్నది. అదియెట్లనగా ప్రత్యక్షపుదాహరణ చెప్పెదను ఆలకించుము.

శిష్యా! సినీమాలో తెరపై కనుపించు సినీమా ప్రపంచము హాలు ఆవరణకు వెనుక మిషనువుండును. ఆ మిషనులో మహాప్రకాశముతో కూడుకున్న పెట్టె దానిముందు ఒక చిన్న రంధ్రము అనగా ఫిలుము పట్టీ ముక్క వెడల్పుగల రంధ్రము వుండును. ఈ రంధ్రముద్వారా పెట్టెలోని వెలుగు బైటకు ప్రసరించును. ఇట్లు బైటకు ప్రసరించు ప్రకాశమునకు అడ్డుగా ఫిలుము పట్టీ లేపు ఒకటి చిన్న చిన్న ప్రపంచరూపముగల మరక లతో చలనరూపముగా చలించుచుండును. పెట్టెలోగల ప్రకాశము ఈఫిలుముపట్టీపై బడి ఇందులోగల జగద్రూప ఆవరణలు కలిగినదై ముందు గల భూతద్దమనే లెన్సు పైబడి, చిన్నగా ఆటఆడును. ఈ లెన్సులో గల ఛాయా రూపమైన సూక్ష్మజగత్తు అవకాశమనే హాలులోకి గోడకువుండు కున్న రంధ్రముద్వారా కిరణరూపముగావచ్చి తెరమీద స్థూలరూప ముగా ఆడుచున్నది. చూచితివా నాయనా! తెరపై ఆడుచున్నది స్థూల ప్రపంచము లెన్సుపై ఆడుచున్నది సూక్ష్మప్రపంచము. ఈ రెండుప్రపంచ రూపములూ తోచబడుటకు కారణము ఫిలుంపటీలోగల ప్రపంచమరకలు కనుక ఫిలుముపట్టీ కారణశరీరము. దీనివల్లనే శుద్ధప్రకాశ కిరణమునకు చీకటికలిగి, చీకటిలోనుండి ద్వంద్వస్వరూపమైన సూక్ష్మ స్థూల ప్రపంచ ములు తోచబడుచున్నవి. ఈస్థూలసూక్ష్మ కారణములకు పైని పెట్టెలో గల మహాకారణమే ప్రకాశము. అదియే ఈ తెరపై చూడబడు సమస్త చరాచర జంగమస్థావర రూపాత్మకమైన జగత్తుకి కారణము అందుచేత మహాకారణదేహమే ప్రజ్ఞానమను యెరుక దీనివలనే స్థూలసూక్ష్మకారణ ములు తోచబడుచున్నవి. అందుచేత అవస్థాత్రయ దేహేంద్రియాది ప్రపంచము సత్తు అనిరి. దీనికి మహాకారణము అసత్తు అనిరి. కనుక తోచెడి ప్రపంచము అసత్తుయొక్క స్వరూపము కనుక జగత్తు లేదనిరి ఈ లే

దను పదమునకే ఆర్యులు "మిథ్య" యనిరి. మిథ్యయనగా లేనిది అని అర్థము. అందుకే భద్రాద్రిరామశతకములో క్షరాక్షరలక్షణములు విమర్శించుటలో పరశురామ నరసింహప్రభువర్యులు సీ॥ జ్ఞానేంద్రియములైదు ఖర్మేంద్రియములైదు" అని క్షరలక్షణ విమర్శ తెలిపిచ్చిరి.

ఇక అక్షరపరబ్రహ్మ స్వరూపమైన ఆత్మయొక్క స్వరూప స్వస్థాన నిర్ణయములో, "సీ॥ శ్వేతరక్తాసిత పీతనీలంబుల నడుమ సునీల

వర్ణంబు యుండు" అని తెలిపిచ్చిరి.

అది గనుక ఈతోచబడు పిండబ్రహ్మాండ రూపమైన ద్వివిధ ప్రపంచమూ నివారముల్లుకొనంత సూక్ష్మస్వరూపమైన విద్యుత్ప్రకాశమానమైన ప్రజ్ఞానమువల్లనే తోచబడుచున్నది.

దీనికే శంకరాచార్యులవారి పరమగురువులైన గౌడపాదాచార్యులు మాండూక్యోపనిషత్తులో అలాత ప్రకరణములో,

శ్లో॥ ఋజువక్రాద్యథాభాసం। అలాతస్పందితం యథా
గ్రహణగ్రాహ్యకాభాసం। విజ్ఞానస్పందితం తథా॥

అనగా కాలుచున్న కొరివిని రాత్రివేళ కాలములో త్రిప్పినయెడల వంకర వంకరగానూ చక్రాకారముగాను అగ్నిగీతలు తోచబడును. తొలుత కట్టచివరనుగల అగ్నికణమే చలించుటవల్ల గీతలుగా తోచబడి తిరిగి దానియందే అణిగిపోయినట్లు కేవలజ్ఞానమూర్తియైన శుద్ధాత్మ మాయావిద్యలయందు ప్రతిఫలించి పిండబ్రహ్మాండ రూపమైన జగదాకారముగా తోచబడుచున్నది. అందుచేత తోచెడిజగత్తు మిథ్య అనియున్నూ, విజ్ఞానస్వరూపమైన జ్ఞానమే సత్యమని విచారణవల్ల తేలుచున్నది. ఈవిధముగా నిత్యానిత్య వస్తువివేకము విచారించిన ముముక్షువు. ఇహాముత్రార్థ ఫలభోగవిరాగుడై సులువుగా వుండవచ్చును.

ఇహామూత్రార్థఫలభోగ విరాగమనగా:— ఇహలోకమందుగల స్రక్చందన వనితాది భోగములయందునూ। అమూత్రమనగా స్వర్గాది పరలోకభోగములయందునూ । కోరిక లేనివాడై యుండును । ఎందుచేత ననగా । పైనిచెప్పిన నిత్యానిత్యవస్తువివేకము లెస్సగా విమర్శించిన ముముక్షువు । స్వర్గాదిలోకత్రయములు । తత్పదవులు పొందుటకొరకు చేసే యజ్ఞయాగాది క్రతువులు । మిధ్యాభూతమైన వంకరటెంకర చక్రాకారమువలె తోచబడు అగ్నిగీతలలోవే కాని శుద్ధమైన అగ్నికణచుక్కలో లేనట్లు । కేవల మోక్షద్వారములోనుండీ పోయేవారికి । ఇవన్నియూ అనిత్యమని తలచి వాటియందు కోరికలు లేక । మోక్షాపేక్షాయుతుడై యుండును. యుండవలెను ।

ఇకనుసాధనచతుష్టయసంపత్తిలో మూడవది । శమాదిషట్కసంపత్తి :—అనగా శమము । దమము । శాంతి । తితీక్ష । శ్రద్ధ । సమాధానము । మోక్షాపేక్షాయుతుడగు ముముక్షువు । ఈ ఆరుసంపత్తులూకలిగి యుండవలెను ।

శమము :— అనగా అంతరేంద్రియ నిగ్రహము । అంతరేంద్రియములనగా । మనస్సు । బుద్ధి । చిత్తము । అహంకారము । ఇందులో మనస్సు । సంకల్పించును । బుద్ధినిశ్చయించును । చిత్తముచింతించును । అహంకారము । అభిమానించి పనిజరుపుచుండును । మనజీవితకాలమంతయూ । ఈఅంతరేంద్రియములచేతనే అనేకములైన । మంచి । చెడ్డ । వ్యాపారములు జరుగుచున్నవి । వీటివల్లనే । మనకు । తిరిగి । జన్మకర్మలు । కలుగుచున్నవి.

శిష్యునిప్రశ్న :— ప్రభువర్యా ! జీవిఅవసానదశలో । పంచభూతములూ । వేటిలోఅవికలియుచున్నవికదా । ఇక జన్మకుహేతువేదియేది ? । పునర్జన్మకలదా।నాకుఈసందేహము చాలాకాలమునుండీయున్నది। కొందరు పాడేపాటలలో । "అన్నిటికిని యిది కడసారిజన్మన్నా" ।

అనిపాడుచుందురు। యీ సంశయమును విమర్శించి తెలవిచ్చెద రని ప్రార్థించుచున్నాను. ।

గురునిజవాబు :— ఓయీ అపరిమిత గుణవంతుడవగు అటుగ్గంజా। ఈ విషయమునకు భాగవత కృష్ణదేశిక ప్రభువులు ఒక కందార్థము తెలవిచ్చిరి :

కం॥ జగమువలన సంకల్పము। జగమా సంకల్పమునను। జనియించును।
వేరగుపడమజన్మమందిర। మగుపడదెడబాసి। నిల్వావారెండెన్న
టికీ ॥ అని తెలవిచ్చిరి ॥

ఇచ్చట సంకల్పమువల్ల। జగత్తుపుట్టుచున్నది యని తెలవిచ్చిరి। ఈసంకల్పమనే విషయము। మనస్సుది। యీ మనస్సు ఎప్పుడు సంకల్పించినది? ఆనగా అవసానకాలమందు। ఆదిఎట్లు? అనగా చెప్పెదను సావధానుడవై వినుము : భాగవత వచనము.

కం॥ కర్మమునపుట్టుజంతువు। కర్మమునను వృద్ధిపొందు। కర్మమున
జెడున్। కర్మమె నరులకు దేవత॥ కర్మమెసుఖదుఃఖములకుకారణ
మధిపా ॥ అని తెలవిచ్చినది।

మనముచేయుచున్న పనులన్నియూ కర్మలే। యీకర్మలలో మంచి చెడ్డ। అని రెండువిధములు। యీ కర్మలు అంతఃకరణద్వారా జరుగు చున్నవి। ఆంతఃకరణయనగా. అంత రేంద్రియములు। ఇవే మనోబుద్ధిచిత్తాహంకారములు। వీటివల్లజరిగే। సంకల్ప, నిశ్చయ, చింతన, అభిమానము లనే పనులద్వారా ప్రాపంచిక జ్ఞానమువచ్చినది మొదలు జీవియొక్క అవసానకాలపర్యంతమూ ఏవోకొన్ని మిశ్రమముగా కర్మలుచేయును। అవసానకాలమున యీ అంతఃకరణవృత్తులు జీవితములో ఏక్రమముగా జరిగినవో। అట్లేలయముకూడా జరుగును। అంతఃకరణవృత్తులు। జీవితకాలములో। ఎట్లు జరిగినవనగా। భద్రాద్రిరామశతకములో।

సీ॥ జ్ఞానసమానముల్। వీనులుశబ్దంబు
వాగ్గగనాంశముల్। వరుసనాయె"

అనునట్లు। అంతరేంద్రియ ప్రేరేపణచేత। సంకల్పనిశ్చయ। చింతన। అభిమాన। నిర్ణయములద్వారా। పంచప్రాణముల సహాయమున। జ్ఞానేంద్రియ విషయేంద్రియ। కర్మేంద్రియములద్వారా। వచన। దాన। గమన। విసర్గానందాదివృత్తులు జరుగుచుండును। లయకాలమున। ఇట్లే పృధ్వి మొదలు ఆకాశమువరకూ। ఒకదానిలో ఒకటి లయమై విశాల అవకాశమైన। కాలరూపమున। లయమగును. ఇట్లు ఆకాశహంశమైన జ్ఞానము। భూతాకాశమున లయమగుటచేత। "మాపెదలు కాలధర్మము నొందిరి" । అనివాడు చుందురు। ఇట్లులయమగు కాలమున। మనకు ఇప్పుడున్న। పృధ్వీభూతబలముకన్న। జలభూతము। తొమ్మిదిపాళ్ళు అధికమగును। కుండెడునీళ్ళలో పొడుముపట్టెంతమట్టిని। వేసినయెడల। కను పడనట్లు। పృధ్విభూతము। జలములోలయమగును। అప్పుడు పృధ్విహంశముల్తైన। అహంకార। అపాన। ఘ్రాణ గంధ। గుదములు। తొమ్మిది పాళ్ళు। అధికమైనజలభూతములో। లయమగును। కనుక। పెద్దకాలము బ్రతికి। రోగపీడితుడై। చనిపోవనున్న జీవిని। గమనించినచో। దేహ। జాతి। వర్ణ మొదలైన సమస్త। అభిమానములూ। నసించును। ముక్కు పాదములు। చల్లబడి। బిగితగ్గియుండును। బైటకి వాతతత్వములో వున్ననూ అంతరంగ। కంఠగోళకమున। అనగా కంఠస్థానమున। ఈమానవయంత్రపుబొమ్మ స్థాపింపబడినది మొదలు। శిథిలమగుపర్యంతము। జరిగిన చిట్టా ఆవర్జాలెక్కలు। తయారుచేయుటకు। మనోబుద్ధిచిత్తములు। ప్రయత్నించును। వీటిప్రయత్నమునకు అడ్డుపెట్టే। అహంకారరూపమైన అభిమానం పృధ్వీహంశమగుటచేత। పృధ్వితోసహా లయమగుటచేత। చింతనారూపమైన చిత్తమునకు అడ్డుపెట్టేవారులేక। సుకృత। దుష్కృతారూపమైన కర్మను। జరిగినది జరిగినట్టుగా చింతనచేయును। యీచిత్తమే చిత్రగుప్తుడు। ఈయన చెప్పినవిషయములన్నిటినీ। ఔనని బుద్ధి నిశ్చయించుచుండును। ఇట్టిచింతనాదశనే వైద్యులు। సంధిదశఅని వాడుదురు। ఈచింతన పూర్తియగుసరికి అగ్నితత్వము। ఇప్పటితొమ్మిదిపాళ్ళు జలముకంటె తొమ్మిదిపాళ్ళు। అధికమగును। ఈఅగ్నితత్వములో జలము లయమగును

అది యెట్లనగా । ఎఱ్ఱగాకాల్చిన గడ్డపారపై । తొమ్మిదినీటిబిందువులు వేసినయెడల । ఏమీలేకపోవునట్లుగా । అట్లే అగ్నియందు జలములయమగును । వానితోసహా । జలహాంశములైన చిత్తము । ప్రాణము । జింహ్వ । రసము । శిశ్న । ఇవిలయమగును.

ఇక అగ్నిహాంశమైనబుద్ధి । ఉత్తరజన్మకు । ఈజన్మలో చేసిన ఆగామికర్మను । ప్రారబ్ధముక్రింద మార్చి । జడ్జిమెంటును తయారుచేయును । అట్లుచేసిన తరువాత । ఈప్రారబ్ధకర్మను । ఏరూపమైన జన్మలో అనుభవించవలెనను నిర్ణయమునకు " అంత్యేమతిస్సహాగతి " అను సూత్రానుగుణ్యముగా । మనస్సును నీ అంత్యకోరిక యేమని ? । ప్రశ్నించును । వెంటనే మనస్సు తన గుర్తుచూచుకొనుటకు । నేత్రస్థానమునకువచ్చును । దీనినే మనవారుచావు । తెలివిఅని యందురు । ఈ తెలివిలోనే మనస్సు । తన ప్రేమాస్పదమైన । రూపమును గుర్తించి । తిరిగి కంఠస్థానమునకు దిగజారును. మనస్సుయొక్క స్థానము కంఠము. కనుక కంఠస్థానమున తాను వుండి బుద్ధిచేత నిశ్చయింపబడిన ప్రారబ్ధకర్మనే జడ్జిమెంటును తన ప్రేమరూపమైన స్త్రీ – పురుష రూపములలో ఏదో వొక రూపమును భావింపుచూ జడ్జిమెంటు చదువును. అనగా సంకల్పించును.

ఇట్లు సంకల్పరూపమనే చప్పుడు ఇప్పుడువున్న అగ్నితత్వము కంటె తొమ్మిదిపాళ్ళు అధికమైన వాయువనే వుచ్ఛ్వాస నిశ్వాసలనే శ్వాసల ద్వారా బైటగల అనంతవాయువులో లీనమై బైట సంచరించును.

ఇట్లు అవసాన దశనుపొందిన జీవునియొక్క సంకల్పమనే శబ్దము బైటగల అనంతవాయు పదములోనుండి కర్మానుగుణ్యముగా ఎక్కడైతే ఏడుమాసములువచ్చిన గర్భవతి యుండునో ఆమెయొక్క శ్వాసలద్వారా గర్భములోగల శుద్ధ జీవ ప్రకాశముతో కూడుకున్న రేడియోపెట్టెవంటి సూక్ష్మశరీరమై యెరిగే యెరుకలేక అమలసత్వ ప్రధానమైయున్న శుద్ధ యెరుకమైయున్న చిన్నశరీరములోగల సహస్రారమను మాడపట్టు (అనగా నడినెత్తినిగల రంధ్రముద్వారా ) ధ్వనించును. అనగా చప్పుడు చేయును.

ఇదియే గత అవసాన దశాజీవి సంకల్పించిన జడ్జిమెంటు అనే కర్మ పత్రములోని శబ్దము. ఈ శబ్దముయెప్పుడైతే ప్రవేసించునో అప్పుడు సహస్రారమునగల శుద్ధాత్మకదలిక కలిగినదై సహస్రారము చిన్న పలుచని చర్మపొరచే మూయబడును. అప్పుడు శుద్ధ ప్రకాశముయొక్క వెలుగు అధోముఖమై శబ్దముతోగూడి శిశువుయొక్క భృూమధ్యమున ప్రతిఫలించి హృదయ కమలమున అంతఃకరణమను అద్దమందు ప్రతి ఫలించును. ఈ అంతఃకరణలోగల అహంకారము "నేను" "నాది" అను కర్తృత్వము వేసుకొని వచ్చిన జడ్జిమెంటు పత్రమును చిత్తముద్వారా నవమాసములు తల్లికి పూర్తిఅయ్యే పర్యంతమూ పూర్వకృత కర్మసంచిత ప్రారబ్ధములను అహంకర్తృత్వము వేసుకొని అనగా "నేను చేస్తిని" "నాది" అను అహం కర్తృత్వమును వేసుకొని చింతనచేయుచుండును.

అందుకే శ్రీకృష్ణపరమాత్మ గీతలో :

శ్లో॥ ద్వాపదే బంధమోక్షాయ । మమేతి నిర్మమేతిచ
మమేతి బంధతే జంతుః । నిర్మమేతి విముత్యతే ॥

అని ఉత్తర గీతలలోచెప్పిరి. మమేతి అనగా నాయొక్క నిర్మమేతి అనగా నాదికాదు. 'నాయొక్క నాది' అనినయెడల జన్మ దుఃఖమునకు కారణము. నిర్మమేతి యనగా నాదిగాదు. సర్వమూ పరమాత్మ కల్పిత మనినయెడల మోక్షమును పొందును. అనగా జన్మ పరంపరాబంధము విడిపోవును. అని ప్రభువులు శెలవిచ్చిరి.

కనుక బిడ్డా ! గర్భస్త జీవుడు పది మాసములువచ్చిన పదిహేను రోజుల పర్యంతమూ పురాకృత కర్మచింతనజేయుచూ పదియవమాసమున తల్లి ప్రసూతి వాయువుల పోట్లచే మిక్కిలి బాధపడి అధోముఖుడై అలసి సొలసి సొమ్మసిల్లి జననద్వారమునుండి వెలువడి బయటపడును. మంత్రసాని మాయనీటిచేతను, శబ్దము వల్లనూ తెలివొంది, కువ్వా ... కువ్వా ...కువా... అని మూడుసార్లు పెద్దగా ఏడ్చును. అనగా "నా పూర్వ జ్ఞానము యేదీ" అని మూడు సార్లు అని పూర్తిగా అవిద్యయందు లీన

మగును. అది మొదలు 12 సంవత్సరముల పర్యంతమూ, అజ్ఞాన దశను పొంది సర్వవ్యవహారికజన్యజ్ఞానము 12 వ సంవత్సరమున పూర్తిగా తెలిసి, 'నాయిల్లు' 'నాభూమి' నావారు నానాలతో వ్యవహరించును. కనుక జననమైనది మొదలు పన్నెండు సంవత్సరములకు అహంకారము బలపడ్డది. అట్లే ఇప్పుడు నిజగురు వాక్యమును తెలుసుకొని పన్నెండుసంవత్సరముల పర్యంతమూ మరుపులేక యెరుకలో యెరుకకలిగి గురువాక్యమననముచేయుచూ గురుబోధ శ్రవణముయందు భక్తిశ్రద్ధలు కలిగియుండవలెను.

మనము ఏదైనా ఒక ఊరు ప్రయాణమునకు వెళ్ళి తిరిగి వారం రోజులలో తిరిగి వచ్చుటకు వారంరోజులు ముందరనుంచీ ప్రయాణసన్నాహము చేయుదుము. ఒక వూరికి వెళ్ళివచ్చుటకే వారంరోజుల ముందు నుంచీ ప్రయాణ సన్నాహముచేయుచున్నామే! వెళ్ళి తిరిగిరానిప్రయాణమునకు చాలా ప్రయత్నము చేయవలసియుండి చాలా శ్రమలు పొందవలసివుండును. అట్లే మనము ప్రాణ ప్రయాణకాలమునకు ఇప్పటినుంచీ ప్రయాణ సన్నాహము చేయవలెను.

కనుక ఈ జనన మరణములు సంకల్పమువల్ల జరుగుచున్నవి కనుక దీనిని ఆపుచేయుటయే ముఖ్యమైన సన్నాహము. ఇల్లు మనో, బుద్ధి, చిత్త అహంకారముల వల్లనే ఆగామి కర్మచేయుట, వీటివల్లనే అంత్యమున జడ్జిమెంటు తీర్పుజరుగుట, జరుగుచు పునర్జన్మకు హేతువగుచున్నది కనుక ఈ అంతరేంద్రియములను వీటివ్యవహారిక వృత్తులలోనుండి మరలింప చేయుటయే శమము అది శమాది షట్క సంపత్తిలో మొదటిది. అది కావున మనస్సుచేత తన యిష్టదైవము నామమును నిరంతరమూ స్మరణచేయుచుండవలెను. బుద్ధిచేత ఆ దేవుని చరణకమలములు, హృదయపద్మమందు నిలుపుకొనుట, చిత్తముచేత, ఆ దేవుని లీలా విశేషములు చింతించుట, అహంకారముచేత దాపరికమును విడచి, ఏకాంతములో భగవంతునితో తన తప్పులను చెప్పి ఇకముందు చేయనని గురుపదముల దగ్గర అహంకార రహితుడై యుండుట, తరువాత—

2 దమము ను కలిగియుండవలెను. అనగా బాహ్యేంద్రియ నిగ్రహము, బాహ్యేంద్రియము లనగా, జ్ఞానేంద్రియము లైదు. కర్మేంద్రియము లైదు. వీటి విషయాదులైన వినుట, చూచుట, స్పర్శను గ్రహించుట. రసమును గ్రహించుట, గంధమును ఆఘ్రాణించుట, వచించుట, ఇచ్చి పుచ్చుకొనుట, గమనాగమనములను చేయుట. స్త్రీ సంభోగానందమును కోరుచుండుట, మలమూత్రాది విసర్జన చేయుట. కర్మేంద్రియముల పనులు, వీటిని జయించుటయే దమము. అనగా వీటి నిత్య వ్యవహారిక విషయేంద్రియ వృత్తులనుండి భగవత్కైంకర్య రూపమున, మరలించుటయే దమము. దీనికి భాగవతములో ప్రహ్లాదుడు చెప్పిన సూత్రము కన్న మించినది లేదు.

సీ॥ కమలాక్షు నర్చించు । కరములు కరములు
శ్రీనాథు వర్ణించు । జిహ్వ జిహ్వ
సుర రక్షకుని చూచు । చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణునాకర్ణించు । వీనులు వీనులు
మధువైరి దవిలిన । మనము మనము
భగవంతు వలగొను । పదములు పదములు
పురుషోత్తముని మీది । బుద్ధి బుద్ధి

తే॥ గీ॥ దేవదేవుని చింతించు । దినము దినము
చక్రహస్తుని ప్రకటించు । చదువు చదువు
కుంభినీధవు జెప్పెడి । గురుడు గురుడు
తండ్రి హరిజేరుమనియెడి । తండ్రి తండ్రి

అది కనుక దమము కలిగియుండవలెను.

3 శాంతి :- అనగా అరిషడ్వర్గములను జయించుటయే శాంతి. అరిషడ్వర్గము లనగా కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములే

వీటిఅన్నిటిలోనూ, కోరికారూపమైనకామమనే ముఖ్యమైనది. కనుక కామమును విడచియుండవలెను. అది యెట్లనగా తనకు వున్నదానితో తృప్తిని పొంది, అందరాని ఫలములకు ఆసించక, వెనుకటి వాటియందు వాడుక పడక, ముందర యేవేవో చేయుదమని ముచ్చటపటక, తనకు దొరికిన దానితో తృప్తినిపొందియున్నయెడల మనస్సుయెల్లప్పుడూ శాంతియుతముగానేయుండును. దీనికే భాగవతకృష్ణప్రభువులు, కందపద్యములలో,

కం॥ ఏ యాపేక్ష జనించిన । ఆయాపేక్షలె । మాయయని
తెలియదగున్ । ఆయాసమగునుదానను । ఛీయనియవి
విడువవదగును క్షేమము కొరకై ॥

అని శెల విచ్చిరి. కనుక ఇట్టి శాంతిని కలిగియుండి, ఇంద్రియవిషయాదులవల్ల వచ్చే సుఖదుఃఖాది ద్వంద్వతాపములయందు ఓర్పు కలిగి, దృష్టిని అనగా మానసిక దృష్టిని ఊర్ధ్వముగా త్రిప్పి సదా పరమాత్మ ధ్యానములో వుంచుటయే తితీక్ష.

ఇక శ్రద్ధ :— యనగా పెద్దల వాక్యములు వినుటయందు, పెద్దలను దర్శించుటయందు శ్రద్ధకలిగినవారై యుండుట,

సమాధాన మనగా :— శాస్త్ర దృశ్యమునకూ, గురువాక్యమునకూ తన ఆత్మ నిశ్చయమునకూ, సరిచూచుకొని, ఈ మూటికీ వ్యతిరేకముకాకుండా నడుచుకుంటూ సమాధాన పడి మోక్షము సందే అపేక్ష తప్ప, ఇతర అపేక్షలు లేక యుండవలెను. ఇదియే ముముక్షత్వము. ఇటువంటి సాధనచతుష్టయ సంపత్తిగల పుణ్యామూర్తులే బ్రహ్మవిద్యను విని విమర్శించగలిగిన, అధికారులు, ఇట్టి అధికారి, అశరీర సాంప్రదాయ రహస్యమును గుర్తెరిగిన సద్గురువులను ఆశ్రయించవలెను. అందుకే ఆర్యులు :—

కం॥ అశరీరుడైన సద్గురు । కుశలమతుల్ గాంచి
భక్తి కూరిమితోడన్ । విశదమగు జన్మరహితము
అసదృశముగ తెలియవలయు అవనిన్ మనుజుల్ ॥

అని బ్రహ్మవిద్యాసూచనలో సుబ్బకవిగారు తెలవిచ్చిరి. అయితే శరీరముతో కూడుకున్న వారిని శరీరము లేనివారని యెట్లు అనవలె ననగా ఇట్లు తెలవిచ్చిరి:

సీ॥ తానును దేహంబు తలపమాయని యెవ్వ
రనిశంబు తలతురో అట్టివారు
జన్మరహితుండని చెప్పంగబడునయ్య
జాణలు వారల జాడగనుడి
తానును దేహంబు తలప సత్యంబన్న
వారి చెంతల జేరవలదు జుండి
వారిచెంతల చేరవదలదీ దేహంబు
దేహంబు కలిగిన తెలివియుండు

గీ॥ తెలివియుండిన కలలుండు తెల్లముగను
కలలు లేకున్న దే సిద్ధి కాయమునకు
కాన యీ స్వప్న భ్రాంతిని కడకుద్రోయ
కారణుడు దక్క యితరులు కలరె తలప॥

ఇచ్చట తానుఅనగా తత్వమశ్యాది మహావాక్యార్థ బ్రహ్మైక్యాను సంధాన నాదుబిందు కళాతీత అద్వయ, అచింత్య, అవాచ్య, అవ్యక్తాక్షర పరబ్రహ్మమని చెప్పబడు మహాకాశము. దీనినే "అహం" అని శ్రీ శివ రామ దీక్షితులవారు వాడిరి. భావార్థ దీపికలో

శ్రు॥ వచనం॥ సర్వదామాం । అహం నవేద । ప్రత్యక్చైతన్యాఖ్యః ।
మాయా రహితత్వాత్ । తస్మాత్కదా చిన్మయ యావేద
ఆదర్శన స్వభావాత్ । అవ్యక్తమితి ప్రసిద్ధంనామ । అవ్య
క్తంనామ । ఆదర్శనం । ఆదర్శనాదాపతితాత్ । పునర్దర్శ
నం గతా । ఇతి స్మృతేః।

అని అహమునే లేనిదని ప్రత్యక్చైతన్యమని ! మాయావరణ లేని కారణమున చిన్మయ స్వరూపమని తెలుసుకోవలెను. మాయ అనగా లేనిదని తెలుసుకోవలెను. అంతలో దర్శనము లేకపోయే స్వభావము కలిగినదగుటచేత అవ్యక్తమని ప్రసిద్ధమైనది. యేమీలేనట్టుగా వుండి అంతలో కలుగుచుండు గుర్తుకనుకనే మూలములేని గుర్తని 'మూలాభావ మిదం జ్ఞాతుం' అని "నిర్మూలమే తత్ జ్ఞాన" మని శ్రీ శివరామదీక్షిత అచల ఋషీ స్వాములు శెలవిచ్చిరి. ఇట్టి బ్రహ్మాండ అతీత స్థానముననున్న మూలంలేని గుర్తుయొక్క కళయే ఈ పిండాండములో సహస్రార కమలమున వేయిదళ మండపముమధ్య ప్రకాసించుచున్నది. ఇదియే తాను.

దేహమనగా :— పైనిచెప్పిన నిర్గుణబ్రహ్మమైన మూలంలేనిగుర్తనే తాను సగుణరూపమును దాల్చునపుడు మాయాప్రధానశక్తియను ఇచ్ఛాశక్తి పైనిచెప్పిన గుర్తులోనుండి బయటకు విజృంభించి గుర్తుచుట్టూ బంగారు వర్ణావర్ణతో గూడి ఎక్కువైన వేగముతో తిరుగుచుండును. ఇదియే నాదుబిందు కళాత్మకము. ఈశ్వరస్థానము. అనగా ఈశ్వరుని నాలుగవశరీరమైన సర్వసాక్షి. ఇదియే దహరాకాశమందురు. త్వంపద లక్ష్యార్థము. ఇదియే మెరిగే శరీరము. పిండాండములో దీనియొక్క స్థానము భ్రూమధ్యము. మొత్తముమీద, 'తానును దేహంబు తపమాయని' అనగా 'ఈ మూలంలేని గుర్తెరిగే శరీరం యేమీలేదు' అని యెవ్వరైతే దృష్టదార్ష్టాంత రీత్యా, అనిశమూ జపముచేయుదురో అట్టివారు అశరీరులని జన్మరహితులని చెప్పబడుదురు. ఈ మంత్రసిద్ధినిపొందినవారికి అహంకారము వుండదు, సమరస నిర్మలప్రజ్ఞానులు. వీరికి డాంబికాచార నడకలు వుండవు. తనతోకూడా సర్వసూన్యమనే స్వభావము కలిగినవారు కనుక వీరిని అశరీరులనిన్ని. భ్రమరహితులనిన్ని, సుమనసులనిన్ని, అనహంకారులనిన్ని శ్రీ భాగవతకృష్ణ ప్రభువర్యులు చాలాచోట్ల వర్ణించిరి.

అందుచేత పైనచెప్పిన సాధనచతుష్టయ సంపత్తిగల పుణ్యమూర్తి ఇటువంటి అశరీర సాంప్రదాయ సద్గురుమూర్తిని ఆశ్రయించెనని శ్రీ

భాగవత కృష్ణప్రభువులు కందార్థములలో గురుశిష్య అన్యోన్య సందర్శనం మొట్ట మొదటి కందార్థంలో ఇట్లు శెలవిచ్చిరి.

శరణాగతుడగు శిష్యునిపై కరుణ అనే అమృతదృష్టిని ప్రసరింపజేసి అనగా తాపత్రియాగ్ని ఈషణత్రియాగ్ని వాసన త్రియాగ్ని, మలత్రియాగ్నులలో తప్తహృదయుడై ఘోరసంసారమున బాధపడలేక పుణ్యవశమున పుణ్యపురుషుడైన పురుషోత్తముని గాంచి, ఆయనయొక్క కరుణామృత చూడ్కులు ప్రసరించినంతనే శిష్యునకు బ్రహ్మానంద ఆనందము బైటకు పొంగిపొరలినది. దీనినే 'మోదము ముప్పిరిగొన' అని కందార్థములో వున్నది. అట్లు కరుణామృతదృష్టిచేత సద్గురుమూర్తి శిష్యుని గాంచి పరిపూర్ణమనేది ఒకటివున్నది. అదియే శాశ్వతమైనపరబ్రహ్మము. అందు లేనెరుకనేది తనంతట తానుగా మూలములేకనే తోచెను. ఈ రెంటినీ గురుముఖతా తెలుసుకొని లేకతోచిన యెరుకను విడిచిపెట్టవలెను అని శెలవిచ్చిన ప్రభువును సచ్ఛిష్యుడు స్తుతియించెను.

ప్రభువర్యా! ఒకకంసాలివాని గుమ్మములో ఒక పనస మొద్దును పడవేసి। మద్దిలకింద తయారుచేయమనినయెడల। అందముగాదానిలోని కఠినాంశమైన కఱ్ఱను చిన్న చిన్న। పేళ్ళకింద చెక్కిడొలిచితీసి పలచగా చేసి। రెండుప్రక్కలా చర్మముచేమూసి। మొద్దును మద్దిలకిందజేసి దానిపై చక్కనిపలుకులను పలికించి। సప్తతాళములు వాయించి ప్రజానీకమును ఆనందింపజేయును। అప్పుడు ఆమద్దిల సభాపూజ్యమై। సభయందు యెత్తైనస్థానమున అధిష్టింపబడును। గురువర్యా అట్లే। మీసాన్నిధ్యమునకు చేరిన ఒకశుద్ధ మొద్దువాడను। నాలో మొద్దు తనమును డొల్చి నన్ను రక్షించమని వేడి ప్రభువర్యా! తానూనేనూ అననిది పరబ్రహ్మమనియందురు. అదియేదిఅని? ప్రశ్నించినంతనే "బయలు" అని సద్గురుప్రభువనెను. నేను నేనని అనుచున్న నేనెవరు? లేనియెరుకప్పు అనిగురుజవాబు. అట్లైనవుంటెనికదా! అనిశిష్యుడనెను. వుండేగురువాక్యరీత్యా లేనే లేనను

కొనుమా ! అనిగురుజవాబు లేనేలేనను నేను లేకపోయినవెనుక తానుం డునుగదా అని శిష్యుడనెను. వున్నదేదో వుండును. నీవులేకపోయిన తరు వాత దానెల్లెరిగెదవూ ? అందుచేత లేనేలేనని నిశ్చయించుకొనుమా అనిశెలవిచ్చినందుకు శిష్యుడు గురువరా మొదలు అచలము నెరిగించి తరువాత లేనిమొరకను విమర్శించిచెప్పి ఆఖరున ఆలేనిమొరకను విడిపించె నని శెలవిచ్చిరి. అట్లువివరించి శెలవియ్యండి ప్రభువర్యా మీ పాదపద్మ ములు నిరంతరమూ నాహృదయకమలముననిల్పి పూజించుకొందును. సంశయములు పెట్టక నాసంశయ రాహిత్యమును జేయండి తండ్రిఅని పాద ములపై వ్రాలెను.

ఇట్లు
శక్తిద్వయ నిరాశకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థామృత
గంగాతరంగిణిలో శిష్యునిలక్షణం అశరీరగురుధర్మం
ప్రసజ్జన్మ సందేహం గురుశిష్య అన్యోన్య
సందర్శనంబుతో ద్వితీయోధ్యాయం
సమాప్తము.








శక్తిద్వయ నిరాశకంబైన శుద్ధ నిర్గుణ తత్వకందార్థ

అమృత గంగా తరంగిణి

# తృతీయోధ్యాయ ప్రారంభము

ఓయీ! కుమారా! భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు కర్మయోగములో ఆపరబ్రహ్మము.

శ్లో॥ అవినాశితుతద్విద్ధి। యేనసర్వమిదం తతమ్
వినాశమవ్యయస్యాస్య। నకశ్చిత్కర్తుమర్హతి॥

శ్లో॥ వేదావినాశినం నిత్యం। యఏనమజమవ్యయమ్
కథం సపురుషః పార్థ। కంఘాతయ తిహంతికమ్॥

శ్లో॥ నైనం ఛిందన్తి శస్త్రాణి। నైనందహతి పావకః
నచైనం క్లేదయంత్యాపో। నశోషయతి మారుతః॥

శ్లో॥ అచ్ఛేద్యోయమదాహ్యో। యమక్లేద్యోశోష్యఏవచ
నిత్యః సర్వగతఃస్థాణు। రచలోయం సనాతనః॥

ఆపరబ్రహ్మము నాశనములేనిది యనిన్నీ పుట్టుకలేనిదియనిన్నీ అస్త్రశస్త్రములచేత ఛేదింపబడనిదియనిన్నీ అగ్నిచేతకాల్పబడనిది నీళ్ళు దానిని తడపలేవనిన్నీ గాలిదాని శోషించి విసిరిపడగొట్టలేదనిన్నీ ఛేదింపబడదు. దహింపబడదు. తడుపబడదు ఎండింపబడదు నిర్వికారము అచలమై ఎల్లప్పుడూ వుండునది.

ఇట్లని మొట్టమొదట శెలవిచ్చినట్లు భాగవతకృష్ణప్రభువులుకూడా మొదట అచలలక్షణమే శెలవిచ్చిరి. ఇది అచ్చతెనుగున చెప్పుటచేత పండితులైన అహం విద్వాంసులకు చులకనగా కనుపడును కాని శుద్ధసత్వ గుణోపేతులై సమరసప్రజ్ఞగల సూరిజనులె ఈగ్రంధము సారము తెలుసుకొని ఇతరులకు నచ్చచెప్పుదురు. అందుకే "ఇదిఆంధ్రకవిత్వమని మది రోయందగదు దీనిమర్మమరయుడీ పదియ్యాకువన్నె పసికినిముదమున తోల్పెట్టెనుంచ ముట్టకుండుదురా" అనిశెలవిచ్చిరి.

అందుచేత కంద్యార్థములలో "అచలలక్షణము" అని హెడ్డింగు ఇచ్చిరి. అచలమునకు విచారించిచూడగా లక్షణమే లేదుకదా లక్షణము అని ఎందుకు శెలవిచ్చిరి ? అనగా ఈపిండాండరూపమైన ఈ దేహేంద్రియాది ఆవరణలోవుండి వ్యవహరించుచున్న ఆత్మయొక్క ఆదివివిచారించగా అచలలక్షణముకలిగినదగుటచేత అట్లు శెలవిచ్చిరి. అందుకే

కం॥ పుట్టుటగిట్టుటలేకను పుట్టేగిట్టేటియెరుక పోడిమెరుగకన్।
చట్టువలెకదలకుండును । బట్టబయలు"

అని శెలవిచ్చిరి ఇచ్చట "బయలు" అనగాకాళీ ఈకనుపడుకాళీనే అవకాశమనియందుము ఈ అవకాశమునకే ఆకాశమని విద్వాంసులు పలికిరి ఈ అవకాశలక్షణమైన ఆకాశమునే సంస్కృతములో "గగనం" అనివాడిరి గగనమనగా ఆకాశము ఆకాశమనగా రూపనామములు లేక కాళీగావున్నదికనుక ఈబయలునే "బట్టబయలు" అనిరి దీనికే విష్ణువును వర్ణించుటలో "గగనసదృశుడు" అనిరి. అందుచేతవృత్తి కాళీనే బట్టబయలు అని ఆంధ్రభాషలో నిర్ణయించిరి. ఇదిపుట్టదు గిట్టదు. ఇందులో అనేకమైన జంగమస్థావర రూపాత్మకమై రూపనామక్రియాత్మక జగద్రూప యెరుకపుడుతూ చస్తూయుండును. దీనియొక్క సంగతి యేమీ యెరుగక చలించకయుండును. ఇటువంటిదే బ్రహ్మాండ అతీతస్థానమున సృష్టికిపూర్వము జగత్తునామరూప రహితమైయున్నప్పుడు వున్నదనిభావించుకొనుము నాయనా ఇప్పుడునీకు సూచించి సౌంజ్ఞచే చెప్పినది

భూతమిశ్రిమబయలు దీనివంటిదే అది అనిభావించి అచ్చట రూపనామ క్రియాత్మకమైన ఈఆత్మయొక్క యెరిగేలక్షణములేదుకనుక ఈయెరుక లేనిదని నిశ్చయముచేయుచుండుటయే అచలపరిపూర్ణదేవునియొక్క శేవ చేయుట అదియెట్లనగా ఉపమానము. నీటిలోని చట్రాయినంటిది. అచలము. నీరువంటిది యెరుకఅనుకున్నప్పుడు నీరుపూర్తిగావున్నప్పుడు రాయి కనుపడదు. సూర్యకిరణములవేడికినీరుహరించిపోయినప్పుడు రాయిబయలు పడును.

అందుచేత పంచదసీ దృష్టాంతముతో మొదలుపెట్టి షోడసీమంత్రి జపముచేస్తూవుండి బయలును భావనచేయుటే యెరుకలేక సేవించుట. ఈనిజగురుగుట్టు సద్గురుముఖతా విచారించి ద్వాదశవర్షములు చాతుర్విధ న్యాయధర్మసిక్షలు పొందినపుడే నిశ్చయమగునుగాని పూరికేబయలు బయలు అంటే బౌద్ధుడవును.

ఇదియెరుగబడినట్లేవుండును. బిడ్డా నాస్వానుభవముచెప్పుచున్నాను అహర్నిశాదులూ పన్నెండు సంవత్సరములు ఎడతెరిపిలేక కందార్థములు భద్రాద్రిరామశతకం, దీక్షితీయం, పరిపూర్ణబోధ సిద్ధాంతశిరోమణి మొదలైన గ్రంధములు చదువుకుంటూ గురుసేవ గురునిష్టమానక గురుగీతార్థమును గ్రహించి చదివినదే పదేపదే చదువుతూ నిత్యమూగురుముఖతా అర్థమును గ్రహించునప్పుడు ఈజననమరణ సంసారభ్రాంతి తొలగును.

కనుక శిష్యా ! ఈబట్టబయలు ఇట్టిదని పలుకుచేత పలుకుటకువీలు లేదు ఆలోచించుదమంటేఅందదు విచారించిచూడగా ఇదిలేనిస్థలమంటూ లేదు. అందుకే గీతలోచెప్పిన "యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ" అని పలికిరి. వాయు, అగ్ని, జల, పృధ్వులు దీనిలోనే తోచబడుచున్నవి. వీటివల్ల ఏఉపద్రవములు పొందదని ఈపరము అణువుయొక్క అంతర్బహిస్సులకలదు. ఆకాశాది పంచమహాభూతములలో వెలినిండియున్నది. అదిగో నీముందు వెనుక క్రింద మీదనిండియున్నది. బిడ్డా!

ఇంకొకభావసూచన అందించెదను. భావమునగ్రహించుము ఆకాశ వాయు అగ్ని జల పృథ్వి పంచభూతములూ ఐదురకముల రంగురబ్బరు గాలి బుంగలని తలచుకోనుము ఈఐదింటికి ఒకదారముకట్టి గాలిలోఎగుర వేసినచో ఐదురంగు బుంగలనూ నిలపెట్టినది దారము అయినట్లు పంచ మహాభూతములకు మూలమైనదే యెరుక అందుకే ఆకాశాదికభూతానీకములకు అనగా ఆకాశాదిభూతములకు యెరుక ఆత్మస్వరూపమై రాకడ పోకడలు ఎందులోకలుగుచున్నవో అదే బటబయలుసుమాఅని బ్రహ్మాండ అతీతస్థానమున బట్టబయలైన అచలపరిపూర్ణ దేవుని భావసూచనజేసిరి.

నాయనా! ఇదికూడా నీభావమునకు అందనియెడల యింకొక చక్కని ప్రత్యక్షఉపమానము వినుము. అనేకవిధములైన జలచరములు మహాసముద్రములో వుండును. జలచరముయొక్క క్రిందా మీదా నాల్గు ప్రక్కల మూలల నీరువుండును. అట్లే రూపనామక్రియారహితమై బట్టబయలైన అచలపరిపూర్ణ మహాసముద్రములో యండమావులవలె ఈ పిండబ్రహ్మాండజీవేశ్వర కూటస్థరూపజగత్తు తోచబడుచుండెను. ఈజగత్తు వుండినాపోయినా రెండూ తెలియని పరిపూర్ణమే శాశ్వతమైయుండును. ఇచ్చట నాకుఒక ప్రస్తుత కాలఉపమానము తోచుచున్నది. సినీమా తెర మీద అనేకచిత్రవిచిత్ర జగద్రూపము తోచబడుచుండును. తెరఅచలమై అనగా చలించనిదై పలుకులు పలుకక సినీమాఆడుతున్నప్పుడు సినీమా జగత్తుకు లోపలా వెలుపలానిండి సూదిమోపనైన వెల్తిలేక సినీమా ప్రపంచములోని కష్టనష్టనిష్ఠూరాది బాధలుగాని చలి యెండ గాలివాన అగ్నిజ్వాలాదిభయోత్పాతములకు చెడక సర్వమూ తనయందే కలుగు చున్ననూ వాటిపై యెరుకలేక వున్నది. అచలపరిపూర్ణమైన తెర అట్లే సినీమాతోవచ్చిన సినీజగత్తు సినీమాతోనేపోవును. కాని తెరమాత్రమూ సినీమాతో రాలేదు. సినీమాతోపోలేదు. సినీమా తెరలోయెన్నడూ లీనముకాలేదు కనుక తనందుయెన్నడూ సినీమాజగత్తులేదు. ఇదినిశ్చయమైనట్లు అచలపరిపూర్ణపరబ్రహ్మమైన బట్టబయలుయందు జీవేశ్వరకూటస్థ బ్రహ్మలుయేకాలమందూ పుట్టలేదు. పుట్టినదని పరిపూర్ణ పరబ్రహ్మ యె

సుగమ. నాయనా ఈఉపమానములద్వారా పరిపూర్ణపరబ్రహ్మము నీకు భావగోచరమైయుండును. ఈవిషయమే మాండుక్యోపనిషత్తులో గౌడపాదులు అద్వైతప్రకరణాంత్యములో

మూ॥ నకశ్చిజ్జాయతేజీవ । స్సంభవోస్యనవిద్యతే ।
ఏతదుత్తమంసత్యం । యత్రకించిన్నజాయతే ॥

అనగా ప్రాచీనములగు ఉపనిషదాది గ్రంథములందు బ్రహ్మతత్వప్రాప్తికి ఉపాయములుగా చెప్పబడిన సత్యములలోపల ఇదియే ఉత్తమమైనసత్యము ఆసత్యమేదియనగా సత్‌స్వరూపమగు బ్రహ్మమునందు అణుమాత్రమైననూ పుట్టనేలేదనుటయే.

ఇటువంటి అచలపరిపూర్ణ పరబ్రహ్మములో లేనియెరుక తనంతట తానుగా తోచబడినది.

అదియెట్లనగా :

కం॥ "మేలుకసుషుప్తిలోపల యేలీలంతనకుతానెయే తెంచునో ।
గుర్తాలీలబయలులోపల వాలాయము తనకుతానె వచ్చునోయన్నా
వచ్చిహెచ్చి చచ్చునోయన్నా ॥"

యని ఆర్యులుశెలవిచ్చిరి. అనగా ఎదురస్థితి తనస్థితి గుర్తెరుగక ఏమియూలేక రూపనామక్రియారహితమై యున్న సుషుప్త్యవస్థలోనుండి ఎవ్వరూపిలువనిదే తనంతటతానుగా మెలుకువయెట్లువచ్చునదో అట్లే అచలపరిపూర్ణమైన బట్టబయలులో కలిగినది అనిఆర్యులయొక్క నిశ్చయం పరిపూర్ణములో లేక తోచబడిన యెరుకను మూడువిధములుగా కొందరు నిరూపించిరి. కొందరుపదువిధములుగా నిరూపించిరి. అదియెట్లనగా పరుడు పరాపరుడు అపరుడు అని మూడువిధిములు, పరుడు అనగా సర్వాధిష్ఠాన రూపమున పరోక్షముగావుండువాడు.

పరాపరుడుఅనిచెప్పటచేత కార్యకారణాత్మకముగా సర్వాత్మకుడై యుండువాడు.

అపరుడనగా ప్రత్యగాత్మ స్వరూపమున వుండువాడు. ఏడువిధములు యెట్లనగా। శుద్ధచైతన్యమనిన్ని ఈశ్వరచైతన్యమనిన్ని జడచైతన్యమనిన్ని, ప్రమాతచైతన్యమనిన్ని ప్రమాణచైతన్యమనిన్ని ప్రమేయచైతన్యమనిన్ని ఫలచైతన్యమనిన్ని, ఇట్లుఏడువిధములుగానిరూపించిరి. పైనిచెప్పిన మూడు విధములకూ భాగవతకృష్ణ ప్రభువర్యులు కందార్థములలో

కం॥ పిండబ్రహ్మాండంబులు రెండును యారెంటిలోను రెండహములు॥ యీఖండములు నాలుగుకూడి అఖండంబగు యెరుకరూపుఅని తెలిపిచ్చిరి. వీనినే మరికొందరు మహాపెద్దలు జీవుడు ఈశ్వరుడు కూటస్థబ్రహ్మముఅని వాడిరి. అనగా జీవుడు పిండాండరూపుడనిన్ని ఈశ్వరుడు బ్రహ్మాండరూపుడనిన్ని అఖండంబగు యెరుకే కూటస్థుడనిన్ని; అందుచేత కూటస్థబ్రహ్మమైన అఖండయెరుకయే పరిపూర్ణములో తోచిన యెరుక ఇదియే కలవలె తోచబడినది. ఎందులోను అనిఅనగా కేవల అమలనిర్గుణాతీత నిష్ప్రతియోగికపరిపూర్ణపరబ్రహ్మమైన పరాకాశమునందు కలవలె తనంతట తానుగా మూలములేని గుర్తును కలలో నారీనరరూపమైన ద్వంద్వస్వరూప జీవేశ్వర జగద్రూపముగాపరిణమించినది. అనగా కలరాకముందు జాగ్రదవస్థతప్పినతరువాత మనయొక్కస్థితియెట్లుండును అని విచారించిన యెడల రూపనామ క్రియారహితమై తేజోంధకారరహితమై యెరుకను గాని తన్ను తానుగాని గుర్తించలేని స్థితిలోవుండును. అందుకే శ్రీభాగవత కృష్ణప్రభు కందార్థములో

కం॥ "యెరుగదు సుషుప్తిని జాగ్రతను నిరవంద సుషుప్తి రెంటినెరు
గును మేల్కొ అట్లరయగ బయలెరుకల రెంటెరుగదు బయలు
యెరుక రెంటిన్నియెరుగూచు నుండూ గురుముఖమూన యెరిగి యీ
రెండు ॥

అని తెలచ్చిరి. మొత్తముమీద

శ్లో॥ శుద్ధేసుషుప్తిదృష్టాంతం తస్మిన్నాహంకదాచన తద్వత్సదాపి యః
శ్యాస్తి ప్రపంచం నాస్తితస్యవై ॥

అనుశృత్యనుగుణ్యముగా ఆర్యులు తెలవిచ్చిరి. దీనినే శ్రీశివరామ దీక్షిత అచలబుషీస్వాములవారి స్వగురు ప్రభువర్యులైన శ్రీధరస్వాముల వారు నిర్వాణ ద్వాదశ శ్లోకములు అచలవిషయములో వ్రాసిరి అవి యేవనగా:

శ్లో॥ ఆత్మానముఖిలాధారం త్యక్త్వావాసనయాసహ
సదాసుషుప్త్యవస్థేస్తే జ్ఞానకర్మ వివర్జితాత్॥

శ్లో॥ కర్తృత్వం కారయితృత్వం । సదానాస్తికదాచన
సదాసుషుప్త్యవస్థేస్తే । భ్రమమూల వివర్జితాత్॥

శ్లో॥ సదాశరీరరహితం । జన్మకర్మనివారణాత్
సదాసుషుప్త్యవస్థేస్తే । జ్ఞానకర్మవివర్జితాత్॥

శ్లో॥ ఏకస్యమూలం శూన్యంహి । ఏకంనాస్తికదాచన
సదాసుషుప్త్యవస్థేస్తే । విశిష్టాద్వైత వర్జితాత్॥

శ్లో॥ సర్వమస్తీతికోవేద । నాస్తీతికే ననిర్ణయః
సదాసుషుప్త్యవస్థేస్తే । అస్తినాస్తీతివర్జితాత్॥

శ్లో॥ చిత్రావిచిత్రసామర్థ్యం । జ్ఞానేనసహానశ్యతి
సదాసుషుప్త్యవస్థేస్తే । జ్ఞానాజ్ఞానవివర్జితాత్॥

శ్లో॥ సదావికారరహితం । భావాభావవివర్జితాత్
సదాసుషుప్త్యవస్థేస్తే । చిజ్జడద్వంద్వవర్జితాత్॥

శ్లో॥ సదాసదసద్రహితం । సుఖదుఃఖవివర్జితాత్
సదాసుషుప్త్యవస్థేస్తే । చిజ్జడద్వంద్వవర్జితాత్॥

శ్లో॥ ఉత్పత్త్యాదిత్రయం శూన్యం । కార్యకారణ వర్జితాత్
సదాసుషుప్త్యవస్థేస్తే । విభాగరహితంసదా॥

శ్లో॥ విభాగాన్యం మూలసూన్యం । సర్వాద్వైక ప్రకాశతః
సదాసుషుప్త్యవస్థేస్తే । నతుజన్మకదాచన॥

శ్లో॥ నానుభావోనచంజ్ఞానం । ధ్యానకర్మనచక్వచిత్ ॥
సదాసుఘుప్త్యవస్థస్తే । సాధనద్వయవర్జితాత్ ॥

శ్లో॥ సదాఆద్యంత రహితం । అంతర్బాహ్యా వివర్జితాత్
సదాసుఘుప్త్యవస్థస్తే । శ్శంకానాస్తికదాచన ॥

అందుచేత ఇటువంటి పరిపూర్ణ పరబ్రహ్మమైన పరాకాశమందు, లేనియొరుక నేగుర్తు తనంతటతానుగా మాయోపాది వినిర్ముక్త వ్యక్తావ్యక్త జ్యోతిర్మయ శుద్ధచైతన్యా సంవిదూప త్రిశక్త్యాత్మక స్వయంప్రకాశ బ్రహ్మమను । మహాకాశముతోచెను.

దీనినే శ్రీభాగవతకృష్ణప్రభువులు ఖండాఖండములుగా కనుపించే యెరుకనేదియిదండీ॥ యని యెవరైతే యెరుకనిరూపణ చేస్తారో వారే వృద్ధండులు అని శెలవిచ్చిరి. వారికి యిదికలదేకాని సత్యము కాదుసుమా అనిశెలవిచ్చి అయినా విచారించవలెనుసుమా అనిశెలవిచ్చిరి. దీనినే ద్వైతాద్వైత విశిష్టాద్వైతులు విష్ణువనియు, బ్రహ్మ మనియు, శివుడని, అణువని, అవ్యక్తమని, ఏకమేవా అద్వితీయుడని, మూల ప్రకృతి యని, అమృతమూర్తి, గురుపుత్రులు, పరమపురుషుడని, వాసుదేవమనసజ్ఞులు, వాసుదేవుడని, ఆరాధ్యమతస్థులు, మహాదేవుడని, వివిధ దేవ పురుషలింగ నామములతో వాడుదురు.

దీనినే భాగవతకృష్ణప్రభువర్యులు బిందువనివాడుతూ, చుక్కనిదగ్గర వుపమానముతో తెలియ పరచిరి.

కం॥ తెలుపుమ్మృదుత్వము, మధురముగలవస్తువు చక్కెరనంచు కనుగొ
న్నట్లు, తెలివిశరీర జగంబులుగలవస్తువ బిందువనుచూ కనుగొనరాదా।

అని శెలవిచ్చిరి. ఇచ్చట బిందువనగా చుక్క. ఈ చుక్కయొక్క పరిమాణము మంత్రపుష్పములో, 'నీవా రశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమ' అని శెల విచ్చిరి. ఇదియే పరుడు, లేక పరమ పురుషుడు. ఈ పరుడైన పరబ్రహ్మమును వర్ణించుటలో, భాగవతము తృతీయ స్కంధము

విదురమైత్రేయ సంవాదములో విదురులవారితో మైత్రేయి యిట్లు చెప్పిరి.

సీ॥ సకల జీవులకెల్ల । ప్రకట దేహము నాత్మ
నాథుండు పరుడు । నానా విధైక
మృత్యుప లక్షణ । మహితుండునగు భగ
వంతుండు సృష్టి । పూర్వంబునందు
ఆత్మీయమాయ । లయంబు నొందిన విశ్వ
గర్భుండై తాను । యొక్కటి వెలుంగు
పరమాత్ముం డభవుండు । పద్రష్టయయ్యె వ
స్త్వంతరపరి । సూన్యు । డగుటజేసి

తే॥ ద్రష్టగాకుండు । మాయా ప్రధానశక్తి
సతుల చిచ్ఛక్తి కలవాడు నగుచు 'దన్ను
లేని వానిగ' చిత్తంబులోన దలచి
ద్రష్టయగు దన భువన నిర్మాణ వాంఛ ॥

ఇట్టి అద్వయస్వరూపుడైన పరమపురుషుడు పూర్వాచార్యుల చేత పరమాకాశ మనబడు ఈ వృత్తబట్టయలులో 'తన్ను లేనివానిగ' తలచి, పరాపరరూపుడై, బ్రహ్మాండ శరీరాత్మకుడైన ఈశ్వరు డయ్యెను. దీనినే

తే॥ బుద్ధిదోచిన నమ్మహా పురుషవరుడు
కార్యకారణరూపమై ఘనతకెక్కి
భూరి మాయాభిదాన విస్ఫురిత శక్తి
వినుతికెక్కిన యట్టి యవిద్యయందు ॥

కం॥ పురుషాకృతి నాత్మాంశ స్ఫురణముగల
శక్తి నిలిపి । పురుషోత్తము డీ
శ్వరు డభవుండజుడు నిజోదర సంస్థిత
విశ్వమపుడు దగ బుట్టించెన్ ॥

సీ॥ ధృతిబూని కాలచో । దితమున వ్యక్తంబు
పరికృతియు ననుపేళ్ళ । బరగు మాంయ
వలన మహత్తత్వ । మెలమి బుట్టించె మా
యాంశ కాలాది గు । ణాత్మకంబు
నైన మహత్తత్వ । మత్యంత దృగ్గోచ
ర మగుచు విశ్వ నిర్మాణవాంఛ
నందుటఁజేసి రూపాంతరంబున బొంది
నట్టి మహత్తత్వమందు నోలి

తే॥ కార్యకారణ కర్తాత్మ । కత్వమైన
మహిత భూతేంద్రియైక మనోమయ మనంగ
దగు నహంకార తత్వము । త్పన్నమయ్యె
కోరి సత్వరజస్తమో । గుణక మగుచు ॥

ఇట్లని బ్రహ్మాండ ఈశ్వర శరీరసృష్టి కలిగినట్లు ఋష్యాదులచే నిర్ణయముగా చెప్పబడినది. తదనుగుణ్యముగానే బ్రహ్మాండశరీరుడైన ఈశ్వరుడు సప్తాంగములు కలవాడని (ఛాందోగ్య ౫. ౧౮. ౨) అగ్నిహోత్ర కల్పమునందు,

శ్రుతి ॥ తస్య హవా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజా
శ్చక్షుర్విశ్వరూపః । ప్రాణః పృథగ్వర్త్మా ఽఽత్మా సందేహో
బహులోబస్తి రేవరయిః । పృథివ్యేవపాదా । ఉరఏవ వేదిర్లో
మాని । బర్హిర్హృదయం । గార్హపత్యోమనోఽన్వాహార్య
పచనమాస్య మాహవనీయః ॥

ఈ వైశ్వానరాత్మకుడగుపురుషునకు (1) తేజస్సుగల ద్యులోకము శిరస్సు (2) నానావిధ శ్వేతపీతాదికిరణాత్మకుడగు సూర్యుడు నేత్రములు (3) నానావిధ సంచలనముగల వాయువు ప్రాణము (4) విస్తీర్ణగుణముకల ఆకాశము దేహమధ్యభాగము (5) అన్నము అనగా ఇది పుట్టుటకు కారణమైన

జలము బస్తి అనగా మూత్రస్థానము (6) సకలమునకూ ఆధారమగు పృథివిపాదములు (7) ఆహవనీయాగ్ని ముఖము. ఇవియే ఈశ్వర దేహాము నకు సప్తాంగములు.

అందుకే భాగవతకృష్ణ ప్రభువులు,

కం॥ యెరుకైన భూతపంచక । మెరుకకు చరణములు కటియు
హృదయము గళమున్ । శిరమున నయ్యోను క్రమమున
ధరణి మొదల్ జేసిరిట్లూ । తనయా గుర్తెరుగూ । గగ
నము బయలంచన రాదు । ఈ మరుగెరుగక । కొందరు
ఆకాశమె పరిపూర్ణమనుచు పల్కేరు ॥

అని తెలవిచ్చిరి.

ఇట్లు సప్తాంగములుగల ఈశ్వరుడే అక్షరపురుషుడు. ఈయన హిర ణ్మయ వర్ణావరణతో గూడిన దహరాకాశాంతర్గతుడై యుండి విశ్వశరీరమైన పంచీకృతపంచమహాభూత కార్యరూపమైన విరాట్ అను స్థూలదేహములో సూర్యుడను దక్షణనేత్రాంతర్గతమునవుండి వైశ్వానరుడను నామధేయ మున సర్వమునూ వెలిగింపజేయును. ఈయనే తిరిగి ఈశ్వరుని సూక్ష్మ దేహమున అపంచీకృత పంచమహాభూత తత్కార్యాదులైన శబ్దస్పర్శ రూపరస గంధాయుత బ్రహ్మేంద్రాది అధిదేవతలతో కూడుకొని హిరణ్య గర్భ శరీరుడై సూర్యాకాశమున సంచరించును.

ఈ ఈశ్వరుడను సర్వసాక్షియే విరాట్ హిరణ్యగర్భాది జాగ్ర త్స్వప్నావస్థలు విడచి కార్యరూపములేక కారణరూపుడై మహదహం కారంబను శుద్ధసాత్వికాయుత తత్వాకాశము నఅవ్యాకృతుడను నామధే యమున ప్రజ్ఞానఘనుడై అనగా ఘనీభవించిన ప్రజ్ఞకలవాడై యుండును. ఇదియే ఈశ్వరునికారణదేహమైన ప్రకృతి. ఆకారణమునవిరాట్ హిరణ్య గర్భ । అవ్యాకృతములను మూడు దేహములందూ సంచరించుచూ తద్వి లక్షణుడైన సర్వసాక్షియే ఈశ్వరుడు. లేక పరాపరుడు. ఈ నాలుగు శరీ రములూకలసి బ్రహ్మాండము. ఇందులోవున్న ఆత్మయేశివుడు. ఈయనలో

గల యెరుకనే 'అహం' అని అనుటలో 'నేననుట' అహ మనగా "నేను" అని అర్థము.

ఇదియే పిండాండములో అనగా ఈ దేహేంద్రియాది ప్రపంచ స్వరూపమైన దేహములో అపరుడనే పేరుతో ప్రత్యగాత్మయై అవస్థాత్రయ సాక్షియై యుండును.

అందుకే భాగవతకృష్ణ ప్రభువులు :

కం॥ ఆటాడి యాడకుండును. ఆటాడిన మేనిబొమ్మ
ఆటాడకనే ఆటాడు । యెరుక అనియెడి । ఆటాడించేటి
వాడు । అతడేరాకర్తా ।

అని శెలవిచ్చిరి. నిజముగా ఈకందార్థమును విమర్శించవలెనన్నచో మాండూక్యోపనిషత్తు లెస్సగా చదివినచో అర్థమగును. కాని పరశురామ నరసింహప్రభువులు శివరామదీక్షిత చూర్ణికలో,

| స్థూల. | సూక్ష్మ, | కారణ. | మహాకారణ. |
|---|---|---|---|
| విశ్వ | తైజస | ప్రాజ్ఞ | ప్రత్యగాత్మ. |
| సత్వ | రజ | స్థమ | శుద్ధసాత్విక. |
| జాగ్రి | త్స్వప్న | సుషుప్తి | తుర్యావస్త. |
| అకార | ఉకార | మకార | ఓంకార |

మాతృకా చతుష్టయ విచారణీయాం తను చతుస్థాతిశయం అని శెలవిచ్చి విచారించమనిరి.

కావున బిడ్డా! పిండాండ శరీరమున అపరుడని చెప్పబడు ప్రత్యగాత్మయైన జీవుడు, నేనే జీవుడను అని అనును. ఈయనయొక్క స్థాన నిర్ణయము "అంతరనాళ ముఖాంతర మధ్య త్రైలోక్య దర్పణ కల్పిత। వృగాకాశము" అనగా భ్రూమధ్యస్థానము, ఇతడే జీవోహం అనును. పైని చెప్పిన సప్తాంగ శరీర సర్వసాక్షియైన బ్రహ్మాండ శరీరాత్మకుడైన పరాపర స్వరూప ఈశ్వరుడు. నేనే నేను, అని శివుడనును. కనుక బిడ్డా! పిండాం

డ శరీరములో జీవోహం । బ్రహ్మాండశరీరములో శివోహం ఈఖండములు నాలుగూకూడి పైనివుండుకున్న । మాయోపాది వినిర్ముక్త శుద్ధ చైతన్య సంవిద్రూప జ్యోతిర్మయ మహాకాశ స్వరూపుడై తానైన నిర్గుణ బ్రహ్మ మొక్క రూపు ఇదియే లేనెరుక. దీని స్థానన్నిర్ణయము " దహరాకాశసూక్ష్మ రంధ్రాంతరత చిన్మయ కుహర విరాజమానమై స్వప్రకాశ మానమై, బహిరంతర ప్రకాశమై నిజానందస్వరూపమైన దేయెరుక. అదేశుద్ధమాయ అఖండ మండల మండిత హృదయ పుండరీక సౌధమధ్యస్థ కీటకము అని అనిపించుకొనును ' అని శ్రీ పండితారాధ్య పండిత శివానందస్వాముల వారు పరిపూర్ణబోధ సిద్ధాంత శిరోమణిలో సెలవిచ్చిరి. దీనినే 'తానుండు అచలమని ' పదప్రయోగముతో కందార్థములో కృష్ణప్రభువు సెలవిచ్చిరి.

కం॥ నేనెవ్వడ ననుజీవుడు నేనే నేననును శివుడు । ఈ రెండనకన్
" తానుండు అచల " మిదిటెని । నేనెరిగరిగినను పైది నేనె
ట్లనినీ । నేననకున్న । తానెట్లనినీ । నేనన్న దాంట్లోదె ॥ నీ
నా ప్రసంగాము । తానన్న దాంట్లోనె తలపోయవలె నిట్లు॥

అని శెలవిచ్చిరి. కనుక ఈ తానన్నదే అఖండంబగు యెరుక దీనిరూపే ఖండఖండములుగా కనుపించే ఈ పిండబ్రహ్మాండ విశాలజగత్తు ఈ తోచబడు కగత్తంతయూ అసత్తుయొక్క రూపము. అందుకే " సదసద్రహితంబేమి పదార్థమొ దానిని యీ మహి కందార్థములుగా యిటువినరయ్య " అని శెలవిచ్చిరి.

అందుకే నాయనా ! యీశుద్ధయెరుక యొక్క ఉత్పత్తి యెవ్వరికీ తెలియదు. హరిహరబ్రహ్మాదులకే తెలియనప్పుడు నరుడెంతటివాడుఅని శెలవిస్తు. గురుకృపాపాత్రుడికి సులభమని శెలవిచ్చిరి.

శిష్యునిప్రార్థన:— ప్రభువర్యా ! మీ కరుణాకటాక్ష వీక్షణముచేత యెరుక అన్న పదముయొక్క గూఢార్థము లెస్సగా వివరించిరి. ఇది లేనెరుకని ఇప్పటికి నిర్ణయమైనది. ఆహా ! పిండబ్రహ్మాండ జీవేశ్వరకూటస్థ బ్రహ్మల వివరణ ఎంతచక్కగా మనస్సునకు హత్తినది. అచల లక్షణము

ఎంత చక్కని ఉపమానములు తెలవిచ్చిరి. అందుకే భాగవత కృష్ణప్రభువులు మిమ్ము పొగడుటకా కాకోదరేసుడో పండాకార్యము నాతరంబె అచలమనస్కా అని తెలవిచ్చిరి. బ్రహ్మానంద మనగా యేదో తెలుసుకోని ఆనందించుచున్నాను. ఇట్టి "యెరుకను యెవ్వరు విడిపించలేరు ధాత్రిని గురుడొకడు తప్ప అని" తెలవిచ్చిరి. కనుక ప్రభువర్యా! యీ యెరుకను విడుచుకొనేయుక్తులు సూక్తులు జెప్పి విడిపించండి మహానుభావా?

ఇట్లు

శక్తిద్వయః నిరాశకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థ
అమృత గంగాతరంగిణిలో
తృతీయోధ్యాయం సమాప్తము.








శక్తిద్వయ నిరాశకంబైన శుద్ధ నిర్గుణ తత్వకందార్థ
అమృత గంగా తరంగిణి

# చతుర్థోధ్యాయ ప్రారంభము

గురుని జబాబు:—బిడ్డా ! తృతీయోధ్యాయములో చెప్పిన పిండబ్రహ్మాండ విచారణలో తేలిన పరుడని పరాపరుడని అపరుడని మూడువిధములుగా లేక తోచబడిన అఖండయెరుకే ఈబ్రహ్మాండ విశాల వృక్షమునకు మూలము. ఇది హిరణ్మయవర్ణావరణతో కూడుకొని దహరాకాశాంతర్గతమై సగుణస్వరూపమై అంతలో వ్యక్తమగుచు అంతలో అవ్యక్తదశను పొందుచూవుండును. అందుకే హిరణ్మయ వర్ణావరణయే యెరిగేశరీరము దానిఅంతరమందుగల శుద్ధచైతన్యా సంవిద్రూప జ్యోతిర్మయ బిందువే "గుర్తు" ముత్యము మీద "గుర్తెరిగే శరీరము" ఈ గుర్తేయెరుక. దీనిఆవరణయే తనువు అందుకే కృష్ణప్రభువు

కం॥ తలిదండ్రులు జీవేశులు యిలవ్యోమము యేనుమేను యెరుకమరు
పులున్ । కలమేళ్ళు శుక్లాశ్రింబులుసీరాన్నము ప్రకృతిపురుషు
డాలుమగళ్ళు గానై యెరుక కెరుకేగానబడు అని శెలవిచ్చిరి.

యీతనువెరుకలు రెండూ వక్కటేకాని వేరుకావని శెలవిచ్చిరి. దానికి

కం॥ చులకనియుక్తిగ నొక్కటి తెలిపెదవిను సందియంబుదీసను దీనన్ ।
పలుకునగలిగిన యర్ధము పలుకును విడనాడి నిల్వబడు చోటెం కేది
రెండుగనొక్కపలుకే అయినాది ” అని శెలవిచ్చిరి,

బిడ్డా! ఈ లేక కలవలె తోచబడిన

కం॥ నానావిధావయవములు । నానావిధనామరూప నటనలుమాయల్
నానావిధాల వ్యూహలు । ఈనేనను యెరుకం డెయిన్ని యిబిడ్డనై
యున్నవాకాదా ॥ ”

నాయనా విచారించుము, అంతవరకూ యెందులకు పిండ బ్రహ్మాండములు ఎన్నోరకములుగా ఎందరెందరో ఋష్యాదులు శృతులద్వారా ఉపనిషత్తులద్వారా విమర్శించిరి. కాని యేమిలాభము ? తర్కవాదనలకొరకు తగువులకొరకూ సంశయము పెంపొందింప జేయుటకొరకేకాని పత్రిమురద్దు పెట్టుకొని పత్రిమునకు బలమిచ్చిన చక్రవర్తి మొహరును చింపి సంశయరహితుడై యుండేపద్ధతులుకావు.

ఇంతకీ యీ యెరిగేలక్షణము నీకుయెప్పుడు వుండునో విచారించుము ?

దీనికి శ్రీభాగవతకృష్ణ ప్రభువర్యులు చక్కగా విచారించి వ్రాసిరి.

కం॥ “అన్నపుసూక్ష్మాంశము మనసు ఎన్నగ నీరంబు ప్రాణము ఎరుగుము యీ రెండెన్నడు కలియవో నాడే సున్నసుమీ యెరుక మాట సుగుణసంపన్నా కలసుటెయెరుకసుమి యింతకన్న యెరుక మూలమన్నదివినలేదు ” యీయెరుకయొక్క పుట్టుకయొక్క మూలము యెరుగుదమన్న భ్రాంతిని నీమనస్సున యెన్నడూ అంటనియ్యకు అని శెలవిచ్చిరి.

అనగా, అన్నము యొక్క సూక్ష్మాంశము మనస్సు ఈ మనస్సు యొక్క స్థానము కంఠము. జాగ్రదవస్థలో నేత్రస్థానమునకు వచ్చును. ఇక నీరుయొక్క సూక్ష్మాంశముప్రాణము యీప్రాణముహృదయస్థానమున

వుండి ఉచ్చ్వాస నిశ్వాసలనునడుపుచుండును. మనస్సు ప్రాణవాయువైన స్వాసతో కలసి సంచారము చేసినంత సేపు ఈజాగ్రిస్వప్న విషయాదులు యెరిగే లక్షణముకలిగుండును. ఎప్పుడైతే హృదయస్థానమునకు మనస్సు వెళ్లి ఆగి ఈప్రాణవాయువుతో కూడదో అప్పుడే ఈయెరిగే యెరుకలక్ష ణములేకపోవును. అందుకే " ఈరెండెన్నడు కలియవో నాడేసున్న సుమీ యెరుకమాట " అని శెలవిచ్చిరి. అనగా సుషుప్త్యవస్తలో మనోబుద్ధులు హృదయస్థానమున అవిద్యలో లీనమగును. కనుక మనస్సు ప్రాణముతో కలిసి సంచరించలేదు. వెంటనేయెరుక నశించినది. అనగా యెరిగేలక్షణ ము లేని గాఢనిద్రావస్త పొందుచున్నది. అందుకే "అంతలోగనవచ్చి పిదప నునుగు నెచటికో యింతియెనుమి యెరుక పుట్టువిక తెలుసుకోరా॥ " అని శెలవిచ్చిరి. బిడ్డా ! యీయెరుక యెరుగుచున్నదశ సగుణము ఈయెరు కకు యెరుకలేనిదశ నిర్గుణము. దీనిని అచ్చతెనుగుపదమున యెరుకఅని యెందుకనిరనగా యెరిగేలక్షణము కలదికనుక దీనికి మరుపుస్వాభావికము దీనిసహజలక్షణములేవియనగా:-

కం॥ చచ్చుట పుట్టుట మేలుకవచ్చుట గాఢాసుషుప్తివచ్చుట ఈనా్ఱ చ్చముగ సహజమెరుకకు అని శెలవిచ్చిరి.

నాయనా యెరుకను విడుచుట యనగా " నాది " " నేను " అను సంసారిక బంధుమిత్ర పుత్ర కళత్రాదులందుగాని ధన ధాన్య సంపత్తుల యందుగాని గాఢతరవ్యామోహమును విడచిపెట్టుట. అట్టివ్యామోహ మును విడిచిపెట్టుట అనేమాట చాలతేలికయే. కాని మానసికబంధమును విడచుట చాలకష్టము। అందుకే ఇప్పటినుంచీ ఈగురుమంత్రము మరువ కుండామననముచేస్తూ బోధవినుకుంటూ నిరంతరమూమా నసికవిడుపును కలిగియుండవలెను. అదియెట్లనగామనఇండ్లలో పిల్లలు తాటాకు బొమ్మల పెండ్లిండ్లు చేసుకొని నిజముగా సంసారములో మునిగినవారివలే ఆయాట లోలీనమై ఆడుకొందురు. వారలతలిదండ్రులు నిజమని తలచెదరా ? తల చరు. అట్లే గురుమంత్రసిద్ధులు అనగా " కలలో తోచిన శరీరా లెలాగో

అలాగే ఈమూలంలేని గుర్తెరిగే శరీరంయేమీలేదు" అని మనసా లేని నిశ్చయములేక నిశ్చయింపబడినవారు ఈకల్ల సంసారజగన్నాటకమాడుతున్న మనలను చూచి నిజమని తలచుచు. నీవుకూడా అట్లే యీ కలవ్యాపారము కల్లయని చెవులద్వారావిన్నది, నేత్రములద్వారా చూచినిది, మనస్సుద్వారా ఆలోచించినది సర్వమూ నీఆత్మఅనేయెరుకయొక్క వికారమేనని నిశ్చయించి అట్టినేనైన యెరుకేకలయని భావించి యీనేనైన కలలేనిదే మేల్కొ అదియే ద్వాదసని నేనులేనిస్థితిని పొందుతూ వుంటేనే మేల్కొనుపొందుట, ఈ నిశ్చయమునకు వచ్చుటకొరకే శ్రీ భాగవతకృష్ణ ప్రభువులు క్రమముగా చక్కని ఉపమానములతో యెరుక విడుపు శెలవిచ్చిరి:

కం॥ మేనెరుకలు రెండింటిలో॥

అనియు,

కం॥ లేనికలకలిగినప్పుడు దానికి దశదిశలయందు తగ। మొదట కొనన్ తానంటకున్న మేల్కొను లేనికలే చూచెనేని లేకాపోవుగదా। కలతో మేల్కొలేకా పోదుగదా। లేనెరుక బయలు లీలీలాగు। నీకెపుడు గాన వచ్చితె। బోధగావలెననవపుడు॥

అని లేనికల తోచినప్పుడు కలలో ఎక్కడ చూచినా తనవికారమే కాని అన్యముకాదు. ఈ లేక తోచబడిన కల కల్లే అనగా అబద్ధమేకాని నిజముకాదు. నిజమైనమేల్కొ కలవలె లేకపోయేదికాదు. అట్లే ఈ ద్వంద్వస్వరూపమైన జగత్తు నేననే యెరుక వల్లనే తోచబడుచున్నది. ఇట్టి నేనే కలనని లేనని మేల్కొన్నయెడల అదియేమేల్కొ. ఆమేల్కొలో ఈ నేననే తెలివుండదప్పా అందుకే,

కం॥ యెరుకను కలలోతోచబడిన పురుషునకు యెరుకే. ఈజాగ్రస్వప్న సుషుప్త్యవస్థాత్రియ జగత్తుకలగా॥

ఈ కందార్థమును విమర్శించుటలో, పరుడని లోగడ చెప్పబడిన సర్వాధిష్ఠాన శుద్ధ యెరుకయే కల. దానియొక్క స్థానము మసలో సహస్రారము. అట్టి యెరుకను కలలో తోచబడిన అక్షర పురుషుడే. అవస్థాత్రయ సాక్షియైన ప్రత్యగాత్ముడు లేక అపరుడు. ఈయన వల్లతోచబడుచున్నవే ఈ జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్తలు అందుచేత ఈయనకు యెరుకే అనగా పురుషుడైన ప్రత్యగాత్మనకు తెలియబడుచున్నదే ఈ అవస్థాత్రయ కల జగత్తు లేక కల విశ్వము. అందుచేత అఖండ యెరుకైన 'ఏకమేవా అద్వితీయ' మనబడు ఒకటి దగ్గరనుంచి పైని అచలమై ఆద్యంత రహితమై అనిర్వాచ్యమై, వృత్తిబట్టబయలైన పరిపూర్ణ పరబ్రహ్మావలోకన నాలుగు దిక్కుల మూలల నడుమ మీద క్రిందా నిరాలంబమై నిర్గుణమై, నిత్య శుద్ధమై నిరుపద్రవమై, నిష్కళంకమై నిరంజనమై నిరాకాశమై నిర్మలమై నిరాకారమై నిర్వికారమై అణు మధ్య, మహత్పరిమాణములకు అంతర్బాహ్యముల నిండి నిబిడీకృతమైన బట్టబయలునుభావించుటయే వొంటుకు వలపల సున్నాపెట్టుకొనుట, అట్లు భావించుకొనుచూ యీ నేననేదే యెరుక. ఇదే శుద్ధవియత్. ఇదే కల. అని భావించుచూ 'స్వప్నే ప్రతీయమాన రూపాణిచ యథాతథా । మూలాభావ మిదంజ్ఞాతం । నశరీరంనకిమస్తి' అని ఈశుద్ధవియత్ వల్లనే జ్ఞాన శరీరజగత్తులు తోచబడుచున్నవి. కనుక "ఏతన్మిథ్యా శుద్ధ వియత్ కించిన్నాస్తి యని" తా రహితము కావలెను. అనగా యెరుక కల వల్ల లేనిదని పరము శాశ్వతమైనదని నమ్ముచున్న నమ్మికయే లేకపోవలెను. దీనినే బాగానమ్మకొనుము. ఈ యెరుకతో పొందును పైనిచెప్పిన విధానముగా వదులుకొనుము. ఇదే పిస్స అనగా చేదస్తము. ఈ విధానముగా తానైన నిర్గుణబ్రహ్మ లేక బయలును కన్నట్లయితే తానువుండీ లేనిస్థితిని పొందును. అందుకే ఉత్తరగీతలలోనూ భగవద్గీతలలోనూ,

శ్లో॥ ఉల్కాహస్తో యథాకశ్చి । ద్ద్రవ్యమాలోక్య తాంత్యజేత్
జ్ఞానేన జ్ఞేయమాలోక్య పశ్చాజ్ఞానం పరిత్యజేత్ ॥

అనిన్నీ,

శ్లో॥ జ్ఞాన మజ్ఞానినం దృష్ట్వా ద్వయోశ్చజతి నిశ్చయం । ద్వయోశ్చ జతియజ్ఞానం । తత్ జ్ఞానంచ పరిత్యజేత్ ॥

అని తెలవిచ్చిరి.

షోడసే పంచదసని రెండింటిని కలిపి నిరసించుటయే ముఖ్యమని తెలవిస్తూ భాగవతకృష్ణప్రభువర్యులు,

కం॥ అంటముకల మేల్కను । మేల్కంటదు కలనెన్నటికిని । కడు నిశ్చయ మీ రెంటి క్రియ గుర్తు బయలుల రెంటిని రెం డంటకుండు । రెండ్రింటిలోనూ । కలయెరుకలీ రెండూ మిధ్యేనూ । దంటాగ మేల్క బయలుంటూ వెప్పటి కెరిగి । గెంటూ మాపై రెంట రెంటికల యెరుకాల । రెండ్రెంటి లోనూ,

అని తెలవిచ్చిరి. అనగా పంచదసీ మంత్రమును ముందువేసుకొని షోడసీ మంత్రము జపించినయెడల । జగమెరుకల భ్రాంతి తొలగును.

ఈ సంకల్ప రూపమైన జగత్తు లేనిదె నిస్సంకల్ప రూపమైన శుద్ధ యెరుకయందు తోచబడి తిరిగి దానందే అణగిపోతూవుండును. యీ సంకల్ప రూపమైనదే వేదము. వేదఅను సౌంస్కృతపదముకు తెలుగుఅర్థము యెరుగుట అనివచ్చును. తెలివిచేత తెలియబడుచున్న జాగ్రిస్వప్న సుషుప్త్యవస్థా రూపమైనవిశ్వమున్నూ తెలివికలిసివేదము. అందుకే చతుర్వేదములు అనిరి. అందుచేత ఎచ్చటైతే యెరిగేలక్షణము లేక కేవల నిర్గుణ తత్వమై చలన ముడిగిన నిశ్చలత్వమైయుండునో అది వేదాంతము అనగా తెలివియొక్క తెలివిలేకపోయిన దశ. అందుకే యీ పూర్ణబోధ,

శ్లో॥ వేదవేదాంతాతీతం । యత్సారం పూర్ణబోధో విధీయతే ।

అని శృతి పలికినది. వేదము సంకల్పము. వేదాంతము నిస్సంకల్పము. సవికల్పమువేదము. నిర్వికల్పమువేదాంతము. అందుకే “సవికల్ప నిర్వికల్పములు సూన్యముచేసి, తాను మునుపే లేకపోవడమే పంచముక్త్యా

తీత పరిపూర్ణబోధస్థితి యని పండితారాధ్య పండితశివానంద స్వాములు శెలవిచ్చిరి" అందుకు మాండూక్యోపనిషత్తు అలాతప్రకరణములో సంకల్పనిస్సంకల్పములగురించి చక్కని ఉపమానము యిచ్చిరి.

శ్లో॥ "ఋజువక్రాదిక్యథాభాసం । అలాతస్పందితం యథా । గ్రహణ గ్రాహ్యకాభాసం । విజ్ఞానస్పందితం తథా॥

అని శెలవిచ్చిరి" అనగా అలాత మనగా కాలుతున్నకొరివి. ఇట్లు కాలుతున్నకొరివినికాలములో త్రిప్పినయెడలవంకరవంకరగానూ చక్రాకారముగానూ అగ్నిగీతలు తోచబడును. కొరివిని ఆపినయెడల చివరనున్న ఒక్క అగ్నికణమేకాని తోచబడిన అగ్నిగీతలు లేవు.

అందుకే శ్రీకృష్ణప్రభువులు,

కం॥ "సంకల్పములేనిదే నిస్సంకల్పము లోనతోచు । చనుదోచు చనున్ సంకల్పము తప్పున నిస్సంకల్పము నెరిగెనేని చను"

ఇట్లు వంకరగీతలవలె తోచబడు సంకల్పజగత్తు పోయినవెనుక 'తాలేననుచు నిస్సంకల్పము నిలిచేదనుచూ సంకల్పించుటకింక సంకల్పమేది ? నిస్సంకల్పమందు!' అని శెలవిచ్చిరి. అందుకే "ఈ యెరిగేదే లేకుంటె యేమో ఆవలిజాడ యెరిగేవారెవరింక" అని నాలుగు శరీరములూ రహితపరచుటలో "మరుపన తొలిమేనులుమూడు" అను కందార్థములో శెలవిచ్చిరి.

ఇట్లు యెరిగే శరీరమైన నాలుగవ శరీరము రహితమైన తరువాత మిగిలున్నదే నిర్గుణప్రజ్ఞాన స్వరూపమై నివారుముల్లుకొనంత సూక్ష్మమైన శుద్ధయెరుక. అదియే దీనిస్వరూపమని భావమునకు అందజేస్తూ ఈస్థానములో,

కం॥ "దేవుణ్ణి నిన్ను యెరుగవు నీవిప్పటి కెట్టివారో నేదెల్పెద నీకీ వెర్రిబోధ లెందుకు కావున నద్దేవుణ్ణి యిదిగో కనుగొనవోయీ"

అని పూర్వేమేవ నిరాలంబం ఆగ్నేయే నిర్గుణం తథా దక్షణే నిత్యశుద్ధంచ నైరుత్యే నిరుపద్రవః పశ్చిమే నిష్కళంకైవ వాయువ్యేచ నిరంజనం ఉత్త

శేశ నిరాకాశం ఈశాన్యో నిర్మలోభవేత్ ఊర్ధ్వమేవ నిరాకారం అధశ్చ నిర్వికారకః అంతర్బహిశ్చ సర్వత్ర అచలోయం సనాతనః అని నాలుగు మూలల దిక్కుల నడుమ మీద క్రింద పరిపూర్ణ పరబ్రహ్మావలోకన భావసూచనచే సూచించి అటువంటి దేశకృత కాలకృత వస్తుకృత పరిచ్ఛేద్య రహితమైన పరిపూర్ణ పర బ్రహ్మములో నివారుముల్లుకొనంత సూక్ష్మాత్సూక్ష్మమైన నిన్ను విచారించితే లేవు అటువంటి నామరూప కర్మరహితమైన దేవునియందు నిన్ను వెతికితే లేవుకనుక నీవా దేవునిలోన నిను లెస్సవెతకి నన్నావల ముచ్చట నడుగోయీ అని ప్రశ్నార్థకముగా అన్న పదము అడుగుటకు నీవు లేవుసుమా? అని అర్థము. ఈ కందార్థాభిప్రాయమునకు (శ్రీ) బోధానంద సజ్జా శేషమాంబా సమేత రామమూర్తి సద్గురుప్రభువర్యులు ఒక చుక్కని ఉపమానము తెలవిచ్చిరి. అదియెట్లనగా విశాలమైన తెల్లని వెల్లగోడమీద ఒక పెనసలుతో ఒక చిన్న చుక్కను పెట్టినయెడల విశాలమైన వెల్లగోడపైని ఈచుక్కను విచారించిన యెడల లేదు. ఈచుక్కే ఆత్మ అని అనుకున్నప్పుడు,

శ్లో॥ "ఆత్మాతీతం కేవలాత్మ । దేహోనాస్తి కదాచన । అస్తినాస్తీతి కోవేదా నిర్ణయో నాస్తి సర్వదా ॥

అన్న శృతికి సరిపడుచున్నది. ఈచుక్కే 'శుద్ధవియత్' అనగా కేవల జ్ఞానమూర్తి. ఇదే శరీరమందు లేక వున్నదని శివరామదీక్షితప్రభువులు తెలవిచ్చినట్లు కృష్ణప్రభువులుకూడా తెలవిచ్చిరి. అదియెట్లనగా,

కం॥ 'వినుమునే వనుచుయెరిగే తనువందున లేక । బయలుతానిండినదా"

తానసగా శుద్ధవిజ్ఞప్తిమాత్రమైన శుద్ధయెరుక "కనుగొనుమది కనుగొని ఈతనువును విడనాడుమింత తడవేలనోయీ యీపని కింకగడువేలనోయీ అనుమానముం బె నీవరయుము, శివరాములను దీక్షితులుచేసె నచలగ్రంథమునంత" అని అధ్యాత్మిగా తెలవిచ్చిరి. ఈకందార్థ అర్థము విడదేమోనని దాని క్రిందనే తెలవిచ్చిరి.

కం॥ దేహాకారముగానిది, । యాహంభావంబులేని దక్షులజనులు దాసో
హంబని సను । మోహాముజెంద నిది బయలు మొదలెరుగనలెరా”

అని శెలవిచ్చిరి. ఆరూఢములో “యీావృత్తిబట్టబయలూ యేమీాలేదు” దీని అర్థమే మంత్రార్థములో “తోలుమంత్రిపక్షమెక్కడ కలదో యని వెతుకనేల కలదంతట ఆవలి మంత్రిపక్ష మెక్కడకలదో యని వెతుకనేల కాదా చూచేది అనేది వినేది తినేది అలతోస్తుదాన్ని నీవవలోకనముచేసి కలకాల మెరుకలు కల దీన్ని విను వెరుక కాదా చూచేది” అని శెలవిచ్చిరి.

ఈశుద్ధ వియత్ నే ‘సంవిత్’ యనియు ఇదే సత్యస్వరూపమైనదని యు ‘ఓం మిత్యేకాక్షరంబ్రహ్మ’ మని శబ్దబ్రహ్మమును చెప్పుచూ యీా ఓంకారము యభిదానము దీనియొక్క స్వరూపము ఆత్మ ‘యీాఆత్మయే బ్రహ్మ మ ని తు ర్య వే ద ము లో అయమాత్మా బ్రహ్మ యని శెలవిచ్చిరి. ‘సో అయమాత్మా చతుష్పాత్’ అనిరి. యనగా యీాఆత్మ నాలుగుపాదములు కలది అదియెట్లనగా జాగ్రితపాదము, స్వప్న పాదము, సుషుప్తిపాదము, తురీయపాద మని ఆత్మకు నాలుగు పాదములుచెప్పిరి. ఓంకారమునకు నాలుగు మాత్రలు అనగా అకారము ఉకారము మకా రము ఓంకారము అభిదానము శబ్దబ్రహ్మము, ఆత్మ అభిధేయము అర్థ బ్రహ్మము. అర్థమనగా వస్తువు, ఉపమానము కుండ అ ను ప ద ము లో శబ్దము అభిదానము దానిచేత చెప్పబడువస్తువ అర్థము యిది అభిదేయము యీా ఓంకారములో గల అక్షరములు నాలుగూకలసి “చతురాక్షరి” యని యందురు.

అందుకే ఓంకారములోనుండి ఏబదిఅక్షర సముదాయముపుట్టెను. ఈ ఏబది అక్షరముల సంపుటివల్ల నే మనచేతచూడబడు యీా రూపనామ క్రియాత్మకమైన జంగమస్థావర పిండబ్రహ్మాండ వస్తురూత జగత్తుకు పేర్లు పెట్టబడినవి. ఇంత జగత్తుకీ ఆత్మ అధిష్ఠానమెట్లో అట్లె ఏబది అక్షరము లకూ ఓంకారము అధిష్ఠానమై యున్నది. అందుకే, భాగవతకృష్ణ ప్రభు వర్యులు,

కం॥ పంచాదశాక్షరముల । ప్రపంచము తానుద్భవించె । ప్రణు
వాక్షరమందంచు శృతులెన్నె । దాన్నెరుకంచనియెరిగి । యె
రుగు మచలాము దీనన్ । నిల్వకు మెరుక నచలాములోనన్
చంచాల మతిచేత । చతురాక్షరెక్కువం చెంచేదవెందుకు
యిది నమ్మ । కెరుగుము । అచలము దీనన్ ॥

అని తెలవిచ్చిరి. దీని అభిప్రాయము షడ్చక్ర విచారణ చెప్పవలసి యుండును. అనగా గాయత్రి మంత్రవిచారణ. గాయత్రి మంత్రము :

"ఓం భూః । ఓం భువః । ఓం సువః । ఓం మః । ఓంజనః
ఓం తపః । ఓం సత్యం । ఓం తత్సవితుర్వరేణ్యం । భర్గో
దేవశ్య ధీమహి ' ॥

దీనినే భాగవతములో,

కం॥ లోకంబులు లోకేశులు । లోకస్థులు తెగిన తుది అలోకం
బగు పెంజీకటి కవ్వల నెవ్వా డేకాకృతి వెలుగు । అతని
నే సేవింతున్ ॥

ఎదుర వ్రాసిన షడ్చక్ర విచారణాపటమును పరికించి చూడుము. చక్రవిచారణలోగల లోకంబులు, లోకేశులు, లోకస్థులు, తెగినతుది అనగా భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనర్లోకంబులకు పైని తపోలోకస్థానమే భృమధ్యస్థానము. ఇది మొదట అలోకముగావుండును. ఇచ్చట గాఢతరమైన చీకటివుండును. అనగా ప్రాణాయామ కాలమున యోగి భృమధ్య స్థానమున లక్ష్యము నిల్పును. ప్రథమమున అచ్చట ఏమియూ కనుపడక అలోకమై అనగా ఏ లోకమూ లేనిదై గాఢచీకటిగా వుండును. ఇట్లుండగా వాయువును కుంభించి చాలాసేపు నిలపెట్ట గలిగి నప్పుడు హృదయ కమలములోగల జీవజ్యోతి, ఆధార చక్రస్థానమే ముఖ ద్వారము నాగల సుషుమ్నా నాడిద్వారా పయనమై స్వాధిష్ఠానాది ఐదు చక్రములు దాటి భృమధ్యస్థానమునకు వచ్చును. అప్పుడే జ్యోతి దర్శన మగును. అదియే తారకము. అప్పుడే దశవిధనాదములు వినబడును.

# సప్త చక్ర నిరూపణ

1956 సం॥లో శ్రీ బోధానంద సజ్జా రామమూర్తి సద్గురుప్రభువులు అరట్ల రామారావుకు యిచ్చిన దసరాబహుమతి.

| చక్రము 1 | స్థానము 2 | దళములు 3 | అక్షరములు 4 | ఆకారం 5 | భూతం 6 | బీజం 7 |
|---|---|---|---|---|---|---|
| 1. మూలాధారము | గుదము | 4 | వ, శ, ష, స | చతుష్కోణ | పృధ్వి | లం |
| 2. స్వాధిష్ఠానము | గుహ్యము | 6 | బ, భ, మ, య, ర, ల | అర్ధచంద్ర | జలం | వం |
| 3. మణిపూరక | నాభి | 10 | డ,ఢ,ణ,త,థ,ద ధ,న,ప,ఫ | త్రికోణ | అగ్ని | రం |
| 4. అనాహత | హృదయము | 12 | క.ఖ,గ,ఘ,ఙ,చ ఛ,జ.ఝ,ఞ,ట,ఠ | షట్కోణ | వాయు | యం |
| 5. విశుద్ధ | కంఠ | 16 | అ,ఆ,ఇ ఈ,ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ | వర్తుల | ఆకాశం | హం |
| 6. ఆజ్ఞేయము | నేత్ర | 2 | హం, క్షం | బిందువులో త్రికోణం | మహత్తత్వం | సం |
| 7. సహస్రారము | మూర్ధ్ని | 1000 | ఓం | సహస్రముఖ వర్తులం | సాక్షి భూతం | ఓం |

| ముఖములు 7 | వర్ణము 8 | కారణము 9 | శక్తి 10 | దేవత 11 | హంస 12 | నాదం 13 | లోకం 14 | భక్తి 15 |
|---|---|---|---|---|---|---|---|---|
| సద్యోజాత | కుంకుమ | ఘ్రాణము | క్రియా | గణపతి | 600 | కింకిణి | భూ | సద్భక్తి |
| వామదేవ | విద్యుత్కాంతి | జిహ్వ | జ్ఞాన | బ్రహ్మ | 6000 | వీణ | భువః | నైష్ఠిక |
| అఘోర | శ్యామల | చక్షు | ఇచ్ఛా | విష్ణు | 6000 | వేణు | సువః | నవదాన |
| తత్పురుష | బంగారు | త్వక్కు | ఆది | రుద్ర | 6000 | శంఖ | మహః | భవ |
| ఈశాన | స్ఫటిక | శ్రోత్ర | పర | ఈశ్వర | 1000 | మేఘ | జనః | స్వానంద |
| అంతర్ముఖ | మాణిక్య | మనస్సు | చిచ్ఛక్తి | సదాశివ | 1000 | అబ్ధి | తపో | సమరస |
| సహస్రముఖ | ఉత్రివర్ణం | జ్ఞానం | సహజాత్మశక్తి | సద్గురుడు | 1000 | ఝాంకార | సత్య | పరమ |



ఇదియే "హం" "క్షం" అను రెండు దళములతో కూడుకున్న ఆగ్నేయ కమలము. ఇక్కడితోటి ఏబది అక్షరములూపూర్తి అయ్యెను. ఇదియే యెరిగే శరీరము లేక వేదము. ఈ భృూమధ్యస్థానమునకు పన్నెండు వేళ్ళ దూరమున మూర్ధ్ని లేక సహస్రారమువుండును. ఇదియే గాయత్రీమహా మంత్రములో చెప్పబడు ఓం తత్, సత్, సంవిత్ అని చెప్పబడు అచల పరిపూర్ణ కేవలాత్మ. అనగా చలించక తాను తానై యుండి గగన సదృశముగా బ్రహ్మాండమంతటానిండి నిబిడీకృతమై కేవల జ్ఞానమూర్తై నీవారసూకాగ్రమై అణోరణీయాన్ మహతో మహీయమై యున్నందున అచలపరిపూర్ణ కేవలాత్మయని అనవచ్చును. అందుకే సచ్చిదానంద వెంకటేశ్వర వధూత ప్రభువర్యులు "కేవలచలపరిపూర్ణాత్మ యందున యెరుక జగములు యేరుపడెనూ యేమిలేనిదె తనకుతానై యెరుగవలె ఆరోపిత ముగన్నా" అని శెలవిచ్చిరి. దీనినే శ్రీమదచల ఋషీ శ్రీ శివరామదీక్షిత ప్రభువర్యులు "మూలములేని గుర్తని" శెలవిచ్చిరి. ఇదియే వేదాంతము.

దీనినే వేణుగోపాల శతకములో బమ్మెర పోతనామాత్యులు,

సీ॥ వేదాంతమనుచు బ్రహ్మాదు లెంచిన వెల్గు
నాదాంతసీమకు నడుమ వెల్గు
సాధుజనానంద సంపూర్ణమగు వెల్గు
బోధకు నిలయమై పొసగు వెల్గు
ద్వాదశాబ్జమధ్య మందుదయమై బహు వెల్గు
సుషుమున నాళమునజొచ్చి వెల్గు
శతకోటి సారసాహితుల మించిన వెల్గు
మేరుశిఖరాగ్రంబుమీద వెల్గు
చూడచూడగ మహాశోభితంబగు వెల్గు
నిఖిలజగంబుల నిండి వెల్గు

గీ॥ అట్టి వెల్గును యెపుడు బాహ్యాంతరంబుల
తెలియనేర్చిన యతడెపో దేవుడనగ
మదిరెపురపాల మునిజన హృదయలోల
వేణుగోపాల భక్తసంత్రాణశీల॥

అని తెలపిచ్చిరి. ఇదియే శుద్ధయెరుక. దీని దిగువను విఝృంభించిన మహత్తును హిరణ్మయ వర్ణావరణతో కూడిన దహరమే "అజడము" అధికమైన ఊష్ణప్రకాశ ఆవరణతో కూడిన సత్వ, రజ, స్థమ, శుద్ధ సాత్వికాయుత తత్వాకాశమను మహదహంకారమే జడము. ఈమూడూకలసినదే ఈజగత్తు కనుకనే భా॥ కృష్ణప్రభువులు,

కం॥ "యెరుక జడమజడ మీజగ మరయగ పరిపూర్ణ మేమియనరానిది"

అని తెలవిచ్చిరి. ఈశుద్ధయెరుకే దేవుడనినమ్మికొందరు, హిరణ్మయ వర్ణావరణతో కూడిన మహత్తే దేవుడనికొందరు పంచభూతములే దైవస్వరూపములని పంచబ్రహ్మలని కొలిచేవారుకొందరు వెన్నెలలో బయలునుకనవలెనని షణ్ముఖీముద్రపట్టి లోచూపు భ్రూమధ్యమందుచూడ ప్రయత్నించుదురు. ఎన్నిచూచిననూ ఎన్ని యోగ యాగములుచేసిననూ యీ యెరుక నిలువదు కనుక.

నిజగురునాశ్రయించినవారు లేని అహమనగానేదో ఉన్న బయలనగా యేదో లేని ప్రపంచము ఏదృష్టాంతముచేత రద్దుఅయి నిస్పృహను పొందుచున్నదో తమలో తాము అర్థజ్ఞానముతో సహా పంచదసే షోడసని జగమెరుకలను నిరసిస్తూ ద్వాదసైన పరబయలుస్థితిని పొందవలెను. అందుకే తలకిందబడితపస్సెందుకు! తను నేను కాననుకొనడమెందుకు యాగ యోగ వ్రతములెందుకు నాయనా! కలమేల్కా యెరుక బయలుఅని సామ్యమునుచూచుకొని కలలేనిదే మేల్కా నెరిగినట్లు నేనైన యెరుక లేనిదే పరమార్థముకనుక. నేనులేక పోయెదనని యనుకొంటూ నేననే తెలివిని మరచియుండవలెను. అందుకే భా॥ కృ॥ ప్రభువులు.

౪౦॥ "నిను నను ప్రపంచమును జగమని యెరిగే యెరుకచేత । అచలమును కనుంగొని । నిను నను జగమును జగమని యెరిగే యెరుకమాను । మమలావివేక । చాలును నీ వీక్రమమెరిగి నన్నా" ఇట్లు శెలవిస్తు ఆఖరున " నిను నన్నూ పై రెండింటిని విశ్వమనక బయలనకుండ । అది ఉన్నాదంచన గుర్తు లేకుండా వుండుము " అని శెలవిచ్చిరి. ఈపద్ధతిని నీవు తెలుసుకుంటేచాలు నాయనా అని శెలవిచ్చిరి.

ఇట్లు

శక్తిద్వయ నిరాశకంబైన శుద్ధనిర్గుణతత్వ కంద్యార్ధ

అమృత గంగాతరంగిణిలో

చతుర్ధోధ్యాయం సమాప్తము.








# శక్తిద్వయ నిరాశకంబైన శుద్ధ నిర్గుణ తత్వకందార్థ

## అమృత గంగా తరంగిణి

# పంచమోధ్యాయ ప్రారంభము

శిష్యుని ప్రశ్న :– హేనిజగురుప్రభో ! భాగవత కృష్ణప్రభువులు పరిపూర్ణబోధా ధ్యాయములో తానైన గురుప్రభువును నేనైన శిష్యుని ఈ కండ్లబడి కానబడు జగత్తునూ యెరుకేనని భావించమన్నారుకదా ? ఈ పుత్తబట్టబయలును ఎచ్చటనుండి చూడవలెను ? ఆ కందార్థమును, దాని దిగువ కందార్థమునూ విమర్శించ ప్రార్థించుచున్నాను.

గురుప్రభుజవాబు :– నాయనా ఈ పరిపూర్ణబోధప్రకరణములోనే ఆరవ కందార్థములో,

కం॥ "గురుమూర్తి చూపకున్నను పరిపూర్ణంబొల్లుతనకుప్రత్యక్షమగున్"

అని శెలవిచ్చియున్నారు. అందుచేత నీవు ఇప్పుడు అద్వయ బ్రహ్మస్వరూపులైన గురుస్థానము నలంకరించి అనగా కేవల జ్ఞానమూర్తియైన బట్టబయలైన మహాకాశస్వరూపస్థితిని భావించి అచ్చటనుండి ఈ పుత్త బట్టబయలును దర్శించవలెను. అది యెట్లనగా నాలుగు మహావాక్యముల చేతను జహల్లక్షణ మొదలైన మూడు లక్షణములచేతనున్నూ జీవబ్రహ్మైక్యసంధానముచేసి "అది నీవైతివి నీవే అది అయితివి" ఇట్లయిన తరువాత ఈ యెరిగే లక్షణమైన జ్ఞానములేదు. అప్పుడు అది యెట్లుండు

ననగా, ఆదిమధ్యాంతములు లేనిదై ఖండించుటకు వీలుకానిదై, రెండు కానిదై అనగా ఒక్కటై ఉన్నదే నిజగురుమూర్తి. ఇదియే కాలుతున్న అగరుపుల్లకదలించనప్పుడు చివరనున్న అగ్నిచుక్క వంటిది. దీనినే అలాతమని గౌడపాదులు మాండూక్యములో తెలవిచ్చిరి.

కనుక నాలుగు మహావాక్యములచేత అది నీవౌట యెట్లనగా, ఋగ్వేదవాక్యము "ప్రజ్ఞానం బ్రహ్మ" ప్రజ్ఞానమనగా శబ్దస్పర్శ రూప రసగంధాదులుమనలో ఏజ్ఞానముచేత గుర్తెరుగబడుచున్నవో ఆజ్ఞానమే ప్రజ్ఞానము. ఇదియే మనలో అవస్థాత్రయసాక్షి. అనగా ఈ జాగ్రదవస్థలో ఈ "నేను నేననే" జ్ఞానమే ప్రజ్ఞానము. ఇది చక్షురంతర్గతమున పీతాభాసుడైయున్నప్పుడే శబ్ద, స్పర్శ రూపరస గంధకాదులను గుర్తించుచున్నది. ఇది పిండాండ ధర్మము. ఇక బ్రహ్మాండములో ఈశ్వరుని విరాట్ శరీరమైన పంచీకృత పంచమహాభూత నిర్మాణ విశ్వశరీరములో సూర్యుడనే దక్షిణనేత్రాంతర్గతమున వైశ్వానర నామముతో జగత్పాలనజేయుచున్నది. కనుకనే,

శ్లో॥ బ్రహ్మస్వరూపముదయే । మధ్యాహ్నేతు మహేశ్వరః ।
సాయంధ్యాయే సదావిష్ణు । స్త్రిమూర్తిశ్చ దివాకరః॥

అని సూర్యోపాసకుల ధ్యానం కనుక పిండాండ ప్రజ్ఞానమునకూ బ్రహ్మాండ ప్రజ్ఞానముకూ స్థానము ఒక్కటే కనుక రెంటికీ అభేదము. ఈప్రజ్ఞానము బ్రహ్మము యెట్లనగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మొదలుకొని ఇంద్రాదిఅష్టదిక్పాలకాది దేవతాదులయందు మానవాశ్వగవాదిమశక పిపీలికాదులయందుకూడా వ్యాపించి ఈ సమస్తదేవ జీవ శరీరాలన్నిటినీ ఆడించుచున్నది. ఎక్కడవుండి ఆడించుచున్నదనగా, ఈశ్వరదేహ అంతరనాళ ముఖాంతరమధ్య త్రైలోక్య దర్పణమందు ప్రతిఫలించి పిపీలికాది బ్రహ్మపర్యంత దేహములయందు చక్షురంతర్గత సూక్ష్మ సుషిరజనిత పరమాణు స్వరూపమై విశ్వాన్ని ఆడించుచూ విశ్వాకారముగా తోచబడుచున్నది. కనుక కమలజాది పిపీలికాది శరీరములన్నీ జడస్వరూపములని

వాటిని భావనలో తీసివేసినయెడల మహదహంకారంబను శుద్ధ సాత్వికా యుతత్వాకాశంబను దర్పణంబునగల హిరణ్మయ వర్ణావరణతో కూడిన శుద్ధజ్యోతి స్వరూప చైతన్యమే బ్రహ్మము. ఇదియే అపరుడనే ఆత్మ. ఇచ్చటనుంచే రజ, సత్వ తమోగుణ త్రయప్రవాహరూపమైన జగత్తు విడబడినది. అందుచేతనే ఋష్యాదులు ప్రజ్ఞానం బ్రహ్మ అను మహావాక్య విచారణకు జహల్లక్షణమును ప్రయోగించిరి. జహల్లక్షణమనగా విడచిన లక్షణము. దీనికి ఉపమానము "గంగలో గొల్లగావున్నది" అని అందుము. కాని విచారించి చూడగా, గంగవొడ్డునున్న గొల్లపల్లెలో గొల్లకాని గంగలో గొల్లలేదని ప్రవాహరూపమైన గంగను విడచిపెట్టుటయే. జహల్లక్షణమనే విడచిన లక్షణముయొక్క ధర్మము. అందుచేత ప్రజ్ఞానం బ్రహ్మ అను ఋగ్వేదవాక్య లక్ష్యార్థ విచారణవల్ల మహదహంకారంబను శుద్ధసాత్వికాయుత తత్వాకాశము దగ్గరనుండి విడబడిన కమలజాది పిపీలికాంతజీవ జడప్రవాహరూప జగత్సృష్టిని గంగను తోసివుచ్చినట్లు భావనచే విడిచి మహదహంకారంబను దర్పణంబున గల హిరణ్మయ వర్ణావరణతో కూడిన శుద్ధ జ్యోతిస్స్వరూప చైతన్యమే యీ నేను నేనను ప్రజ్ఞానము యొక్క స్థానమని నిశ్చయించుకోవలెను. దీనికి భద్రాద్రిరామ శతకములో ప్రజ్ఞానం బ్రహ్మవాక్యమునకు చెప్పిన రెండు పద్యములూ చూచుకోవలెను.

చూచితివాబిడ్డా! ఋగ్వేద వాక్యవిచారణచేత పిండాండములో ప్రత్యగాత్మైడు. బ్రహ్మాండ ఈశ్వర శరీరములో విరాట్ హిరణ్య గర్భములు దాటి అవ్యాకృత శరీరమువద్దకు వెళ్లెను. ఇదియే బ్రహ్మవిద్యను తెలుసుకొనుటకు యోగ్యమైన దేహము. లేక కాయము. ఇందులో మహాందహంకారంబను ప్రజ్వలిత జ్యోతిశ్చక్రమనే. బుద్ధి ప్రకాశమునకు దగ్గరగా తోచబడుచున్నదే, బంగారువర్ణావరణ, ఈ మాయావరణతో కూడి యుండుటచేతనే ఆస్వయంప్రకాశమానమైన నిర్గుణబ్రహ్మమునకు "అహం" అనగా "నేను" అనేస్ఫురణకలిగినది. అందుకే "బుద్ధికి సాక్షియై స్ఫురియింపుచున్నది. అహమనే పదమునకర్థమని" ఆర్యులు పలికిరి.

అందుచేత ఇట్టిహిరణ్మయవర్ణ మాయావర్ణాంతర్గతస్వయంప్రకాశమానపర మాత్మయే బ్రహ్మము. మాయావరణను విడిస్తే ఈ బ్రహ్మము నిర్గుణమై నిర్మలమై సత్తారహితమై యుండును. మాయావరణకుకూడా సృష్టిస్థితి లయాది సత్తా సమసిపోవును. అందుచేత మాయావరణయే యెరిగే శరీరమైన మంచ అనగా అరప. దీనినే అజహల్లక్షణములో అనగా విడువని లక్షణములో "మంచాః క్రోశంతీ" అనిరి. అనగా మంచలు కూయుచున్నవి. అందుచేత దీని అంతరమందుగల నిర్గుణబ్రహ్మమే మూలము లేని గుస్తు అనే కూతలుపెట్టే మానవుడు. మొత్తముమీద గుర్తెరిగే శరీరం ఒక్కటేకాని రెండు అని వేరుకావని శ్రీ శివరామదీక్షిత అచలఋషీ ప్రభునుడి. దానినే యజుర్వేద వాక్యములో "అహమేవ బ్రహ్మ బ్రహ్మైవాహ" మనియన్న అస్మనే పదమున కర్థమని పరశురామ నరసింహ ప్రభువులు భద్రాద్రిరామశతకములో "అహం బ్రహ్మాస్మి యను" యజుర్వేద వాక్యములో సెలవిచ్చిరి. కనుక మహదహంకారావరణను భావనలో జడమని లేక వాత్యమని త్రోసిపుచ్చి విచారజన్యానుభవజ్ఞాని హిరణ్మయ వర్ణావరణతో కూడిన స్వయంప్రకాశమే తన యొక్క స్వరూపమని నిశ్చయించుకొని ఈశ్వరత్వమును పొంది ఈశ్వరకారణశరీరమైన అవ్యాకృతమును విడిచిపెట్టవలెను.

ఇప్పుడు ఈశ్వరత్వమును పొందియున్న మాయావరణ శరీరసహితుడైన శిష్యుడున్నూ ఈ మాయావరణ శరీరరహితుడై కేవలజ్ఞానమూర్తియైన అవ్యక్తాక్షర పరబ్రహ్మమైన పరమపురుషుడైన అశరీర సద్గురుమూర్తులిద్దరే కలరు. అదియెట్లనగా ఉపమానము,

వస్తురూపము :— 1 తులం పాదరసమును సీసాలోనుండి ఒకనున్నని న్నని గచ్చుపై పారపోసినచో అణుస్వరూపభిద్రమై గది అంతటా పడిపోవును. ఇద్దరు వ్యక్తులు కలసి అవతల ఇవతల ప్రక్కలనుండి ఈపరమాణుపాదరసబిందువులను పోగుచేసినచో మొత్తము ఇద్దరూ దగ్గరకు వచ్చేసరికి చెరియొక బిందువు పాదరసమూ నేలపై రెండుగా కనుపడును.

నూలువాసి దూరముగా వున్నంతసేపూ రెండుగానే వుండును. కేవలమూ దగ్గరపడినప్పుడు రెండూ కలసి అఖండ బిందువగును. అప్పుడే "అసి" అను పదమగును, కనుక,

"తత్వమసి" అను సామవేదవాక్యమును విమర్శించుటలో సృష్టికి పూర్వమందద్వితీయమై నామరూపక్రియలేమి లేక ఏకమై నిత్యమై అచలమై యేదియుండునో అది తత్ పదలక్ష్యార్థము. అదే శుద్ధ వియత్. ఇక తన వివేకమున సాధనచతుష్టయములు కలిగిన పూర్ణాధికారియందు ధీమనో బుద్ధ్యాది దేహేంద్రియములకు అతీతమై సాక్షియై తేజరిల్లుతున్నవారే త్వంపదలక్ష్యార్థ స్వరూపులైన సచ్ఛిష్యుడు. ఈయనకు హిరణ్మయవర్ణ మాయావరణమను మఠావరణ కలదు. ఈ ఆవరణ కవతలది మహాకాశము. ఆవరణతో కూడుకున్నది మఠాకాశము. ఇట్టి మఠమనే ఆవరణను తీసివేసినయెడల ఉన్నదంతా తానైన బట్టబయలే. అందుచేత ఆవరణా రహితము చేయుటయే ఐక్యము. ఎందుచేతననగా నిర్గుణబ్రహ్మము వస్తు రూపముకాదు గగన సదృశము అని ఋష్యాదులచేతనే చెప్పబడుటచేత. నిరామయమైన గగనమునకు విచ్ఛిన్నదశ, అవిచ్ఛినదశ అంటూ లేదు కనుక. ఆవరణను రహితపరచుటయే ముఖ్యకర్తవ్యము. అందుచేతనే భాగవతకృష్ణప్రభువర్యులు కం॥ రానిది పోనిది బయలని లేనిది యీయెరుక యనుచు లెస్సగదృఢమూదానుక నీవీమంత్రము మానక జపియించుచుండు మానీతిశాలి లేనిది లేదు మరువకీజోలి. లేనిదిలేదాని పూనినిశ్చయమైతె తానొక్కటుండుగాని యెట్లన, వినుమానీతిశాలి అని రహితము వకేమంత్రమని శెలవిచ్చిరి. అందుచె ఈగు ర్తెరిగే శరీరావరణా త్యాగమయిన తరువాత మిగిలినదే బట్టబయలైన గురుస్వరూపము.

దీనినే అధర్వణవేదములో,

సీ. "స్వచ్ఛమై సత్యమై స్వప్రకాశంబునై
అపరోక్షమై సదా అమలమగుచు

ఆద్యంత రహితమై యచలమై నిత్యమై
శుద్ధమైబుద్ధమై సిద్ధమగుచు
నిర్వ్యాజమైనట్టి నిర్గుణం బయ
మాత్మపదముకు లక్ష్యతాత్పర్య
మిదియు ప్రతిలేనిదై నిరుపద్రవంబై
స్వతః పరిపూర్ణమై బట్టబయలునగుచు

గీ॥ జగదధిష్ఠానమై చరాచరములందు
బాధితములేకయున్న దే బ్రహ్మమగును.

అని ఆర్యులు శెలవిచ్చిరి.

కనుక పైవిచారణనుబట్టి పిండాండములోగల దేహేంద్రియాది ప్రపంచాధిష్ఠాన అవస్థాత్రయ సాక్షిస్వరూప ప్రత్యగాత్ముడు బ్రహ్మాండ అతీతస్థానమునగల గురుస్థానము నలంకరించెను. అనగా తత్వమస్యాది మహావాక్యార్థ లక్ష్యార్థ స్వరూపుడై అద్వయబ్రహ్మమయ్యెను. ఇచ్చట తన స్వరూపము నివారుముల్లుకొనంతసూక్ష్మము. ఇచ్చటనుంచి అనగా ఈమహాకాశావరణనుంచి పూర్ణబ్రహ్మవలోకన చేయవలెను. అందుకే భాగవత కృష్ణప్రభువులు కందార్థములప్రకరణవరుసలోతిలకించినచో అచలలక్షణము. యెరుకలక్షణము – యెరుకోత్పత్తిలక్షణము. యెరుకమోక్ష లక్షణము – మతాలలక్షణము. అయినతరువాత పరిపూర్ణబోధఅని హెడ్డింగుఇచ్చిరి. అందుచేత యెరుకలేని యెరుకైన శుద్ధయెరుకస్థానమే నిర్గుణ ప్రజ్ఞానస్థానము లేక గురుస్థానము ఇచ్చటనుంచి ఈ వృత్తబట్టబయలును నీవిప్పుడు వుండజూచి నిజముగా ఈయెరుకను పరుడనిచెప్పబడు ద్రష్టాస్వరూపుడనైన నేనుగానున్నా పరాపరుడనిచెప్పబడు దర్శనరూపమైన మహాద్రూపుడవైన నీవుగానున్నా అపరుడనబడు దృశ్యస్వరూపవిరాట్‌హిరణ్యగర్భ అవ్యాకృతాది జగత్తుగానూ భావించి ఈపరుడను శుద్ధాత్మ పరిపూర్ణములో తోచినయెరుక యిదీఅని నిశ్చయించుచూ ఇదేకలఅని మృషనివిడిచిపెట్టుమా శిష్యతిలుకా! ఇట్టినిశ్చయము చేయుచుండుటవే

నీపని యింతేచాలుకాని బ్రహ్మావిష్ణుమహేశ్వర ఇంద్రాది దేవతల శేవించు తలపు వద్దుఅని ఆర్యులయొక్కనుడి.

బట్టబయలైన గురుస్థానమువద్ద ఈ వృత్తిబట్టబయలును యెరుగుచున్నాను అని అనుటకు ఇచ్చట శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు లేవు కనుక శుద్ధ యెరుకను "వేదన" కు ఉన్నది అదుగో నేను తెలిసితిని అని యనుటకు దీన్ని నీవుయెరిగేవా? లేదు నీచేత తెలియబడేదికాదు. ఒకవేళ తెలియబడుచున్నదీ అని అనుటకు పంచతన్మాత్రలు ఏవినాయనా ఈ బట్టబయలైన బ్రహ్మంబునందూ అందుచేత దీనందు లేక తోచబడిన యెరుకచేతనే విచారణద్వారా కనిపెట్టి కనిపెట్టినయెరుకను పోగొట్టుముచాలు. ఇక మళ్ళీపుట్టదు అని శెలవిచ్చిరి.

బిడ్డా ముఖ్యమైనమాట చెప్పెదను వినుము. సత్యస్వరూపమైన బట్టబయలులో అసత్యమై అధ్యారోపముగా ఆరోపించబడిన యీ యెరుక అసత్యమని నిజముగా ముమ్మాటికీ నమ్మియుంటేచాలునుతండ్రీ ఇట్లు సత్యమిది అసత్యమిది అని నిర్ణయించిన నిర్ణయముకూడా మరచి నిజబోధస్థితిని పొంది నిత్యుడైయుండవలెను. ఈ స్థితికలుగుటకు "నిరతాము గురుసేవపరతంత్రులై తత్కరుణకు పాత్రులై యెరుకమాలవలెను అనగా లేకపోవలెను.

అదియెట్లనగా కం॥ యిదివున్నదియిదివున్నది యిదివున్నది యనుచు బయలు నెరిగియెరుకచేయిదిలేనిది యిదిలేనిది యిదిలేనిది యనుచు యెరుక నెరిగీతె సరిరా। ఆపైనుండేదెట్లందువినరా । వృదయాస్తమానములుడుగక యిదినీ నెమ్మదిలోన నమ్మి నామాటనిశ్చయమిట్లెరిగీతెసరిరా । అని భాగవత కృష్ణప్రభుఆర్యులు గట్టిగానొక్కివక్కాణించిరి.

శిష్యునిప్రశ్న:—ఆర్యా! "పైని తమరుశలవిచ్చిన కందార్థములో నిరంతరమూ గురుసేవచేయుట యెట్లు? పరతంత్రములో యెరుక (మాలుట) అనగా లేకపోవుట యెట్లు? దీనివిమర్శన దయవుంచి చెప్పెదరని ప్రార్థించుచున్నాను.

గురుప్రభుజవాబు :— బిడ్డా! మదీయసద్గురు ప్రభువర్యులైన శ్రీకూరాకుల వంశపయః పరావార రాకాశుధాకరుండునూ పరమగురు సమరస నిర్మలానంద సన్యాసాచార్య ప్రియశిష్య శిరోభూషణులునూ శ్రీ విజయనగర శ్రీ శివరామదీక్షిత పీఠపాఠ పరంపరాభివృద్ధ్యోద్దేశ బద్ధకంకణులునుయయిన శ్రీ సరస్వతీ దుర్గానందపంచదశీస్వాముల వారి దివ్యచరణారవిందసేవజేసి వారికరుణాకటాక్ష వీక్షణములకు పాత్రుడనై వారుయెరుకను విడిపించినపద్ధతినివిని విచారించిస్వానుభవమున నాఅభ్యాసపద్ధతిని చెప్పుచున్నవాడను శ్రద్ధతో వినుము.

ఈ శ్రీ శివరామదీక్షిత అచలఋషీశ్వరులు ద్వాదసీమంత్రము షోడసీమంత్రము అని రెండుమంత్రములునూ దృష్టాంతముగా పంచదసీ మంత్రమున్నూ ఇచ్చి దార్ష్టాంతముచూపింపమని చెప్పినట్లు ఉపదేశకాలమందు క్రమమువల్ల తెలియబడుచున్నది. అందులో ద్వాదసీమంత్రన్యాసము. షోడసీమంత్రన్యాసము అని రెండు న్యాసములుకలవు. ఈ రెండున్యాస్ధవిచారణవల్ల యెరుకలేనిస్థితిని పొందగలుగుదుము.

అది యెట్లనగా ద్వాదసీమంత్రన్యాసములో ద్వాదశాక్షరీమహామంత్రమునకు అచలఋషి.మూాల పరమపురుషుడన్నీ ఈయన చందము నాశనములేని చందమన్నీ అభవో దేవుడన్నీ అమృత బీజమన్నీ ఇతరశక్తులమీాద ఆధారము పడని స్వతంత్రశక్తుడన్నీ దీనినే అప్రమేయ శక్తిః అనివాడిరి. ఇదియే తత్ పదము అదియే అయమాత్మఅనగా ఈయాత్మఅనగా తనహృదయముమీాద చెయ్యిపెట్టి ఈ యవస్త్రయసాక్షియైన ప్రత్యగాత్మయే ఉపక్రిరణములో చెప్పిన మహావాక్య విచారణద్వారా తానుతానైన నిర్గుణబ్రహ్మమైనది. ఇచ్చట అదినీవైతివి యన్నటువంటి యెరిగే లక్షణముగల చైతన్యము (లేక జ్ఞానము) లేదు. దీనికే "తత్వమశ్యాది జ్ఞానరహిత కీలకం" అని ద్వాదశీ మంత్రమునకు కీలకమని ఆర్యులు శెలవిచ్చిరి. ఈయెరిగే జ్ఞానమే నాలుగవశరీరము. దీనినే గురువాక్కుచేత యెగరజిమ్మమని శ్రీ భాగవతకృష్ణ ప్రభువర్యులు శెలవిచ్చిరి అది యెట్లనగా:—

కం॥ మరుపనతొలిమేనులు మూ । డెరుకన నాలవశరీర । మీరెండొక
టేపరిపూర్ణమవలి । దీవలియెరుకను । గురువాక్కుచేత యెగరా
జిమ్మినమా । పోవును లేనిదెరిగే దేగినమా । యెరిగే దేలేకుం ట
యే మోఆవలిజాడ । యెరిగేవారెవరింక । యింతేచాలకుక నిక్క
గరజిమ్మినమా । పోవును లేనిదెరిగే దేగినమా॥ అని శెలవిచ్చిరి.
ఈ కందార్థములో ద్వాదసీమంత్రిన్యాస విచారణ ప్రభువులు యిమిడ్చి
నట్లు కనుపడుచున్నది యెట్లనగా:

మరుపుదశలో అనగా అజ్ఞానావస్థలో మనముపొందుతున్న అవ
స్థలు మూడు. అవి జాగ్రిత, స్వప్నము, సుషుప్తి యీమూటికీ స్థూల
సూక్ష్మకారణములను మూడు శరీరములు యీమూడు శరీరములలోనూ
తిరుగాడుచూ జాగ్రిస్వప్నములలో సర్వమూగుర్తెరుగుచూ సుషుప్త్యవ
స్తలో విశ్రాంతి తీసుకుంటూ సుఖదుఃఖాదులు పొందుతున్నది "నేను"
అనే యెరిగేచైతన్యము. ఇదే స్ఫురణారూపమైన ధ్వనిరూపము. దీనికే
అయమాత్మ అని సంస్కృతపదమువాడిరి. అయమాత్మయనగా, యీయవ
స్థాత్రియములు పొందుతున్న సాక్షియైనజ్ఞానము యిదే నాలుగవశరీరము
ఇదేపిండ బ్రహ్మాండ జీవేశ్వర కూటస్థబ్రహ్మలను విచారణ జన్యానుభవ
ద్వారా సర్వమునూ గుర్తెరుగుచున్నది. అందుకే "యెరుకేపరిపూర్ణమెరి
గే దెరుకా నెరిగేది యింకొకటి లేదీరెంట్నెరిగేది" అని శెలవిచ్చిరి కనుక
ఈయెరిగే దే భ్రూమధ్యస్థానమునగల ప్రత్యగాత్మయైన అయమాత్మ ఇదే
"అది నీవై తివి" "నీవేఅదిఅయితివి" అన్నజ్ఞానము. ఇది లేకపోతే ఆవలవుం
డుకోబడిన "శరీరమందు లేకపున్న గురుస్వరూప బట్టబయలైన అశరీర
తత్వజాడయెరిగేవారెవరింక" కనుక అచలఋషి అవినాశచ్ఛంద అభవోదేవ
అమృతబీజ అప్రమేయశక్తియుతస్వరూపరహిత అరూప సద్గురుస్థానమును
శేవజేయుటయెట్లు? అని అడిగినప్పుడు "అయమాత్మా తత్వమశ్యాది జ్ఞాన
రహితమే కీలకము" ఇట్లు అనుకున్నప్పుడు ఈయెరిగే యెరుకకుండుకోబడిన
నానాగుర్తులనూ రద్దుపరచుకుంటూ నేనేకల యైనప్పుడు ఈజాగ్రిస్వప్న
వ్యవహారికరూపనామ క్రియాత్మకజగత్తంతయు నాలోనిదే అని అనుకొని

నేనేకల అయినప్పుడు నేనైన కలలేనిదే మేల్కొ అనుకోనవలెను. అందుకే "యెరుక" "నే" "కల" అని "నీకెప్పుడు తోచితే యెరుక లేందను మేల్కొ యెరుగుమప్పుడే' అనికృష్ణప్రభువులు శెలవిచ్చిరి. ఈభావముకే శ్రీసచ్చిదానంద వెంకటేశ్వరవధూత ప్రభువులు :

కం॥ కను తెరచి చూడకలయగు । కనుమూసియుజూడ కలయు । కన్నే కలయా । కనులోనియెరుక తొలగితె। కనపడదది లోన బైట కల వుండదప్పా । మేల్కొలో యెపుడు తెలివుండదప్పా ॥

అని శెలవిచ్చిరి. కనుక చతుశ్శరీరరహిత మేగురు శేవ. ఇదియే ద్వాదశాక్షరీ మహామంత్రిన్యాస కీలకవిచారణ.

పైని చెప్పిన విచారణ ద్వారానేకల. నేనైన కలలేనిదే మేల్కొ అని అనుకొని యెరిగే లక్షణము లేకపోతున్న శుద్ధ విద్యద్రూప సంవిత్ మిగులును. దీనినే "తత్ జ్ఞానం" అని ఋష్యాదులు శెలవిచ్చిరి. అదియెట్లనగా,

శ్లో॥ జ్ఞానమజ్ఞాని సంద్రుష్ట్వా । ద్వయోశ్చజ్యతి నిశ్చయం । ద్వయోశ్చజతి యజ్ఞానం "తజ్ఞానంచ పరిత్యజేత్" అని శెలవిచ్చిరి.

కనుక ఈ తత్ సంవిత్ జ్ఞానముకూడా విడచి పెట్టుటే పరమాకాశోపస్థితి. తంత్రముగా యుక్తిచేసి ఈయుక్తిని భుక్తిచేయవలెను. అనగా అనుభవించవలెను. అది యెట్లనగా షోడసిమంత్రి న్యాస కీలక విచారణ ద్వారా చేయవలెను.

పరిపూర్ణ బోధస్థితి పొందుటకు షోడసీ మహామంత్రి న్యాసవిచారణే ముఖ్యమైనందున అచల పరిపూర్ణ వెంపటి లక్ష్మీనరసింహ సద్గురు ప్రభువర్యులు వారి పరిపూర్ణ శుధాకర గ్రంథములో షోడసిన్యాసములో "అస్యశ్రీ నిరుపమాన షోడశాక్షరీ మహామంత్రశ్య" అని నిరుపమానమని వాడుకచేసిరి. విచారించిచూడగా ఆపదము ప్రయోగించవలసినదే యని నా అభిమతము. అట్లు వారు మంత్రవిచారణానుభవముచే వారు ప్రయోగించినందుకు వారికి నా అభివందనములు.

ఇటువంటి నిరుపమాన షోడశాక్షరీ మహామంత్ర న్యాసార్థమును అవలోకించుటలో తాను తానైన నిర్గుణబ్రహ్మావలోకనలో వున్న ఆరూఢులు ఆరూఢాతీత వునికికలిగి యెరుక కుంకుటివేరు త్రవ్వి లేకుండా తిరిగి రాకుండా చేయుటకు తత్స్వరూప అశరీర గురుస్థానమువద్దనుంచి నిరంజన నిరామయ నిరాకాశ అమలనిర్గుణాతీత నిష్ప్రతియోగిక పరిపూర్ణపరబ్రహ్మమైన పరాకాశ నిరంజనబుషిని భావించి నిర్హంకార నిస్పృహాయుతుడై దేశకృతకాలకృతవస్తుకృత పరిచ్ఛేద్య రహితమైన నిరామయ నిరాకాశ విశాల ఇంత అంతని చెప్పుటకు వీలుకాని అచలపరిపూర్ణ పరబ్రహ్మావలోకనచేస్తూ ఆవరణ లేనిదని నిస్త్రిగుణ్యాశక్తియుతుడై శుద్ధ వియత్ రూపమైన నిర్గుణాప్రపన్న నివారుముల్లుకొనంత సూక్ష్మమైన తాను విశాల పరిపూర్ణ పరబ్రహ్మావలోకనలో ఏమీ లేదని దీనినే (కించిన్నాస్తి అనిరి.) ఇది పరిపూర్ణమనిన్నీ ఇది చిజ్జడమనిన్నీ యెరుక లేక యుండటమే. స్థితి లేకవునికి దీనికి అనగా ఈస్థితికుదుర్చుకొనుటకు ఆరూఢులకు భాగవత కృష్ణప్రభువర్యులు చక్కని యుక్తి మంత్రము చెప్పిరి. అది యేదనగా,

కం॥ మరుపు సుషుప్తిమరణముల్ పరిపూర్ణమునకు సాటిపరచి మరి
యెరుకకున్ యాది మేల్కొ పుట్టువు యిరుదెరగుల యెరిగి యెరుక
నెగర జిమ్మోయి । ఆపైనుండే దెరిగేదెల్లోయీ । గురుమంత్రమిదె
సుమ్మీ మరువాక యే ప్రొద్దు స్మరణా జేసితివేని తిరిగి పుట్టవు నీవిల్లగ
రాజిమ్మోయి॥ అని యుక్తిమంత్రము తెలపిచ్చిరి.

ఈవిధానముగా యుక్తిమంత్రమును భుక్తిచేయనున్న పుణ్యమూర్తిని సద్గురుమూర్తి గురుదక్షిణ యిమ్మని అడుగును.

కం॥ పరిపూర్ణము యెరుకను నేనెరిగించితి రెంటి నీవు యెరిగితివిగదా ।
యెరుకను గురుదక్షిణగా మరి వేగిరమివ్వు వట్టిమాట లేమిటికి। యెరు
కతో యింక కూటమేమిటికి । అని అడిగి పరులు నేనని యేటి
భావమభావమై నిరతాము ఒకరీతి నిలచుండు । మిక । వట్టిమాట
లేమిటికి । అని కంద్యార్థములోనున్నా, కందపద్యములలో

కం॥ అని మెచ్చి యేమియిచ్చెదవని । గురుదక్షిణటంచు నతడడిగిన । నన్నని పల్కె శిష్యరత్నము । విని యిది యిక ముట్టబోక విహ రించుమనన్॥

కం॥ విని శిష్యుడు గురుమూర్తిని । గనుగొని చిత్తరవు ప్రతిమగా నిల చున్నన్ । తన శిష్యుని హస్తములన్ । గొని దగ్గర తీసుకొని । కొడుకాయనుచున్॥

అని "నన్నని" తనను గురుదక్షిణగా యిచ్చిన శిష్యరత్నము యెట్లుండెనో కూడా తెలవిచ్చిరి. ఈవిధానముగా యెరుకను విడచి నిశ్చే ష్టతస్థితినిపొందిన పుణ్యమూర్తుల చిత్రపటములలో శ్రీభాగవత కృష్ణప్రభు వర్యుల పటమున్నూ శ్రీరామకృష్ణపరమహంస పటములోనూ తెస్సగాతిల కింపవచ్చునని నాదృగ్భ్రమ లక్ష్యము.

అందుకే

కం॥ స్థిరమగు పరిపూర్ణము అస్థిరమగు ఈ యెరుక । నెరుక తెలియు జగములన్ । యెరిగిన దెరుకేకద । సద్గురు కృపచే యెరుకపోతే । గురుశిష్యులేరీ" అని శిష్యునిప్రశ్న వేస్తూ తిరిగిలేరని చెప్పనేమోనని "నోరెత్తాక మరివినరోరీ" అనితెలవిస్తూ,

నామాటనమ్మి నాయనా గురుపాదములపై వట్టుపెట్టి చెప్పచు న్నాను. గురుతులేనటువంటి పరిపూర్ణ మొకటుండు ఆస్థితిలో పలుకుటకు వీలులేదు. అని "గురుని పాదములాన గురుతులేనటువంటి పరిపూర్ణ మొక టుండు పలుకరాదట్లుంటె అని సంపూర్ణముగా యెరుకను విడిచిన స్థితిని తెలవిచ్చిరి. నీవునూ అట్లేయుండుము శిష్యా!

ఇట్లన్నందుకు శిష్యుడు బ్రహ్మానందభరితుడై గురుపదములదరి యెరుకను మహాలింగార్పణచేసి యెరుకను విడిచిపెట్టి నిశ్చేష్టుడై సవికల్ప జ్ఞానములేక నిర్వికల్పజ్ఞానములేక వీటికాధారమైన మాయలేక నేననుట లేక నీవనుటలేక మానముకాక అవమానముకాక నిస్పృహాయుతుడై

యుండగా గురుప్రభువు దృక్‌దీక్షా వాక్‌దీక్షల తరువాతనైన స్పర్శదీక్షచే శిష్యునిమేనుపై చేయివేసి మేను నివిరి బిడ్డా! ఇట్టి బోధస్థితి పొందిన ఉత్తమపురుషుని స్థితి చెప్పెద వినుము.

పైవిచారణనుబట్టి గురుమూర్తియెరుకను గురుదక్షిణగా అడిగినతరువాత యెరుకను విడిచి సచ్ఛిష్యుడు ఆరూఢస్థితి కుదిరి యెట్లు ప్రవర్తించు ననగా భాగవతకృష్ణప్రభువర్యులు "పురుషుడు లేనట్టి పొలతి సౌందర్యము మరిమరి కలిగుండి మరిలేనట్లనియంటి అని ఉపమానము తెలవిచ్చిరి" ఈఉపమానమునకు బాహ్యార్థము. భర్తలేని స్త్రీకి సౌందర్యము ఎంత కలిగున్ననూ భర్తలేడనే దృష్టిచేత ఈసౌందర్యమంతయూ నిష్ప్రయోజనమే కదా యను మానసిక చింతనయెట్లుండునో అట్లే ఈసర్వాధిష్ఠాన గుర్తెరిగే చైతన్యమే మూలములేక కలవలే తోచబడి కల కల్లైపోయేదే కనుక కల లోతోచిన ఈసకల సంపత్తులూ కలయేనను నిశ్చయము కలిగియుండునని అర్థమువచ్చును. ఈఅర్థము అభ్యాసాతీత ఆరూఢస్థితుల మధ్యను అనుకోవలసినదేకాని బోధస్థితి కుదిరిన పురుషుడు ఇట్లనుకొనుటకు కూడా గుర్తుండదు. అప్పుడు "పురుషుడు అనగా అవస్థాత్రయసాక్షియైన ప్రత్యగాత్మనకు చెప్పుకోవలెను. పొలతి యనగా అవస్థాత్రయ దేహేంద్రియాది ప్రపంచమునకు చెప్పుకోవలెను. అప్పుడు పురుషుడులేనట్టి పొలతి యనగా యెరిగే లక్షణము లేని సుషుప్త్యవస్థకు చెప్పుకోవలెను. సుషుప్త్యవస్థలో యెరుక వున్నట్లుగానే మాటలుకూడా ఒకప్పుడు కలుగుచుండును. అనగా నేననే గుర్తెరిగే తెలివికి తెలివి లేకుండానే, తెలివున్నట్లుమాట్లాడునేకాని తెలివికి తెలివి లేదు. ఈఅంతరార్థము చక్కగా సరిపోవునని గురుకరుణలోలేని యీ నా తెలివికి సరిపడిన అంతరార్థము. ఈవిధానమైన అంతరార్థస్థితికే బోధస్థితి పురుషలక్షణములోని తక్కినవిదుకందార్థములు అభిప్రాయమూవచ్చును. అదియెట్లనగా "కార్యములందు సమరసబుద్ధిన్ సహజప్రవృద్ధిన్" అని రెండవపద్యములో పదప్రయోగము అనగా గౌరవా గౌరవములకు నిందాస్తుతులకు ఉబ్బుసుక్కులులేక సమరసమున చిరునవ్వుతో అనుభవించుచూ యుండును. ఇకపనులు యెరుకలేక యెట్లు చేయునన్న యెడల

సహజప్రవృద్ధిని చేయును. అనగా ఎంతమందితో ఎంతనిదానమైన మాటలు మాట్లాడుచున్ననూ శరీరముయందు దురదకలిగినయెడల చేతులు వాటికవిపెళ్లి దురదగోకుకొని వాటిపని పూర్తి చేసినట్లు అనగా వేరేచేతియందు యెరుకపెట్టి గోకవలసిన అవుసరములేకుండానే వాటికవేవెళ్లిగోకుకొనునట్లు యెరుకకు యెరుకలేకుండానే పనులుజరుగుచుండును. ఇటువంటి కృతకృత్యుడే అనగా మానవ జన్మవచ్చినందుకు మానవుడనిపించుకొని మానవులలో ఉత్తమస్థాయిని పొందిన పురుషుడు అనగా పురుషోత్తమ ప్రాప్తిని జెందిన పురుషుడు. అనహంకారుడు అనిమిషుడు కనుక విశ్వంబ నేటికలను గానడు. అనగా విచారించడు దీనికి నేకారణమని అనుకోడు. ఈయనే గురుకృపచేత తెలివొందిన పుణ్యమూర్తి. ఈయనకు తిప్పలులేవట. ఎట్లనగా కలమేలుకొన్న పురుషునకు కలలోపలి బాముతెరుక కలిగుండగనే తిలకింపలేవు. అని శెలవిచ్చిరి. అనగా కలమేలుకొంటే కలలో జరిగిన ముచ్చట్లు తెలివికి తెలియబడుతున్నా చూచుటకు ఎదురలేనట్లు గురుకృపచే తెలివొందినవారికి సర్వమూ చూస్తు చేస్తూవున్నా వాటియందుయెరుకవుండదు, అనగా కార్యము చేస్తున్నంతసేపే దానియందు నిమిత్తమాత్రమైన యెరుకగాని కార్యానంతరముకూడా దానిని జిజ్ఞాసారూపమైని విచారణవుండదు. ఈస్థితి అనుభవైక వేద్యమేకాని వ్రాయుటకువీలు లేదు. అందుచేత కలమేలుకున్న పురుషునకు కలలోపలి సుఖదుఃఖాదులు యెరుకకలిగుండి చూచుటకు లేనట్లు గురుకృపచేత మేల్కొను యెరిగి యెరుకలేని పరధ్యానాయుతుడై యున్న పుణ్యపురుషుడు యెదర వ్యవహారికము నుచూచుచుండీకూడా వాటియందు యెరుకవుండదు అది యెట్లనగా "ఏదైనా గాఢతరమైన వ్యవహారిక ఆలోచనలోవున్న వ్యక్తితో ఏదైనామాట అడిగినచో తాత్కాలిక జబాబు యేదోయిచ్చును. కాని దానియందు యెరుకవుండదు. ఆలోచనానంతరము జరిగినకార్యమునకు ఆశ్చర్యపడి "నేనెప్పుడు చెప్పితిని" అనును "ఇటువంటి అనుభవములు బోధస్థితి పురుషులుగమనించుకోవలెను. ఇట్టిస్థితిలోవున్న పురుషులకు ఇతర ప్రాపంచీక నిందాస్తుత్యాది దూషణభూషణ తిరస్కారాది భావములకు మనస్సుచలింప

నీయరు. చలించదుకూడాను. ఎందుచేతననగా శబ్దస్పర్శ రూపరస గంధాదులు లేనిది బట్టబయలని గురుకరుణచే భావనలో భావించుచూ శబ్దస్పర్శ రూపరసగంధాదులతో కూడుకున్నది. ఈభావనాస్వరూప మెరుకని విచారించి యిదిలేనిదని లేని నిశ్చయమును లేక పొందుతూ సవికల్ప నిర్వికల్పములు రెండూలేక పరమెరుకల రెంట్లో దేన్నియెరుగని జ్ఞానరహిత తూష్ణీభూత సంగస్థితి లోవున్న వునికి కలిగిన ఘనులుకనుక వారు మీవారు మావారు వీరనుచు సారెకు వీధిలో పోరాడెవారిని వలదనియనదూ చెవియొగ్గి కావలెనని వినదు॥

ఇట్లు
శక్తిద్వయ నిరాశకంబైన శుద్ధనిర్గుణతత్వ కందార్థ
అమృత గంగాతరంగిణిలో
పరిపూర్ణబోధ గురుమంత్రి పత్రాప బోధదృఢ
బోధస్థితి పురుషలక్షణ
పంచమోధ్యాయం సమాప్తము.



1961 — 5 నెల 2 తేదీ అనగా ప్లవనామసంవత్సర వైశాఖ బహుళ విదియా మంగళవారమున శ్రీమతి పడాల గంగయ్యమ్మ పరిపూర్ణబోధ కంఠీరవాంబగారి నిర్యాణం

నాటిపాట. "శ్రీగురునీశరణు జేయుదమా"

(1) పడాలవంశ శశికళవో। నడినాళాబాటత్యాగినీ। నీడైనా భక్త కల్పతరువా ॥ పడాలా ॥

(2) సత్యలోకమునా వుండినా। సత్యనారాయణున్। నిత్యముగకలియ నేగితిరా। యిచ్ఛలేనీ స్వఛ్ఛమోమాతా ॥ పడాలా ॥

(3) ఆ నశేజ్ఞాతగహితంబే పూర్ణమనీ। రానిమరుగెరిగీ। మరిగెసుజ్ఞాన గురుమాతా। కనకమయకోశత్యాగినీ ॥ పడాలా ॥

(4) పరమునెరుకలనూ। యెరిగినా। యెరుకగురుకొసగీ। వరాకంఠీర వాంబవుగా సురానుత అమృతగురుమాతా ॥ పడాలా॥

(5) యింగితంబెరిగి యెరుగానీ। యెరుకనూ। భంగపరచితివో। త్లింగా గంగయాంబరో। మహాల్లింగా పరమద్వైతీరా ॥ పడాలా॥

(6) ధరాతలంజెల్లా। సురాస్వప్నమనితలచీ। మురారీసేవనుంటిరో। గంగరాజా సేవనుంటీరో ॥ పడాలా ॥

(7) పరముకొరకిలలో। తిరుగుచూ। విరివిగాధనమున్। స్థిరముక్తి త్యాగపరచితిరా। ద్వారంపూడ్వంశ జలజాతా ॥ పడాలా ॥

(8) శ్రీధరాశివరాములబోధల్। నమ్మినా। సాధుజనపాలా సుసీలా। సుజనగురులోలా। నాగోలా వినుము గురుబాలా ॥ పడాలా ॥

(9) యీస్పృహాజగము రెండింటినీ। తోస్పాడిలోనిస్పృహాగవిడచీ। పరాగురుస్థాయి నొందితిరా। పరాకంఠీరవాంబారో ॥ పడాలా॥

(10) హృదయభారమునూ। బాపుమా ॥ నాదుకన్నతల్లి। నేనికాసైపతే నమ్మా। నాదుక్షేమమును కోరమ్మా। రామరావ్ నీదుకొడుకమ్మా ॥పడాలా॥

—: (శ్రీ) గంగయాంబగారిపై పూజపాట :—

( 1) పూర్ణబోధ కంఠీరవాంబగురు పూజలు చేయగరారండీ । నిర్ణయ
తీతావర్ణరహితగురు ॥ స్థాయినొందినా మాతండీ ॥శ్రీపూర్ణ।

( 2) ప్లవసంవత్సర వైశాఖకృష్ణ విదియమంగళవారమునా । అవనివిడచి
పరబయలుగమారిన । గంగయాంబగురు మాతండీ ॥ పూర్ణ॥

( 3) పడాలవంశజు సత్యనారాయణ । ధర్మపత్నియనియెరుగండీ । యేడు
మూడు రెండింటి భావములో । రాధమెరిగినామాతండీ ॥పూర్ణ॥

( 4) అంగలింగనిస్సంగి గుర్విణీ । గంగయాంబగురుపదములనూ । రంగు
గాను హృత్కమలమునందున ధ్యానించుచు మనమందరమూ॥
॥శ్రీపూర్ణ॥

( 5) భావమందు భవరహితముకొరకై । త్యాగముచేసిన మాతండీ ।
ఆవాహనపాద్యార్ఘ్యంబులనూ అందముగా మీరొసగండీ ॥పూర్ణ॥

( 6) ఈడపింగళానడి నాళంబుల బాటనెరిగినామాతండీ । కడిగికడిగి
కర్పూరసెంట్లతో తడయక స్నానంబొసగండీ ॥పూర్ణ॥

( 7) పాచితివ్వయీ నీచబంధమును । తోసిపుచ్చినామాతండీ । ఆచ
మానపంచామృత స్నానాలందముగా మీరివ్వండీ ॥ పూర్ణ ॥

( 8) సంచితాగమము కొంచెముంచకను । సంచీనులిపినమాతండీ। పట్టు
పంచజల్తారువస్త్రమును కొంచెమనక మీరుకట్టండీ ॥ పూర్ణ॥

( 9) సాంజ్ఞనెరిగి హృత్కమలములోపల । ప్రజ్ఞనువీడిన మాతండీ ।
యజ్ఞసూత్రముగ । పుష్పహారములు । యింపుగమీరలువెయ్యండీ
॥శ్రీపూర్ణ॥

(10) దోషబుద్ధులను తలపనట్టి గురు । గంగయాంబసమరస మాతండీ ।
భూషణములుగను । సమరసశాంతా హారంబులనే వెయ్యండీ ॥
॥పూర్ణ॥

(11) గంధత్రియముల । వీడితనదుహృద్గ్రంధిని వీడినమాతండీ । చందన
మును కర్పూరమిళితముగ అందముగా మీరు పూయండీ ॥పూర్ణ॥

(12) సహస్రారగురుస్థానముసంగల గంగయాంబ గురుమాతండీ। సహ
స్రదళార్చన జేసియు సద్గురుమాతను మీరలు వేడండీ ॥పూర్ణ॥

(13) కోహంకస్త్వంబను దేహీ దేహముల। మోహమువీడిన మాతండీ।
బాహాటంబుగ మహా నైవేద్యము దాహము మధ్యను యీయండీ॥
॥పూర్ణ॥

(14) నాల్గునాల్గుపదహారు వెల్గులో। పలుకును వీడినమాతండి। ఫలము
ద్వాదసేఫలహారంబని। పలుకురహితులై యివ్వండి ।పూర్ణ॥

(15) తాంబూలారతి దక్షిణనమస్కారంబులు మీరలుయీయండి।అంబ
రనిభసంభవమునుదాటిన। గంగయాంబకే మీరండి ॥పూర్ణ॥

(16) వాసిగాను తొస్పూడి పురంబున। వాసికెక్కినామాతండి ॥ దోసి
లొగ్గి యీరామారాయుడూ। సాష్టాంగముతో వేడండి ॥పూర్ణ॥

ప్రథమ సంవత్సర వార్షికారాధన పాట — అటతాళం.

(1) భవము లేని దినము యిదియండీ। శ్రీగంగయాంబకు ప్రథమవత్సరా
రాధనమురండీ। భవము లేనీదినము నందు నె।అవయవంబునువిడచి
యంతట। భావతీతపు పరమపదమై। లోవెలీ నిండున్న తల్లికి॥భ॥

(2) అందముగ శ్రీసౌమ్యవారమునా। పొందైన ప్లవశ్రీ ఉత్తరాయణ
పుణ్యదినమూనా। సందియంబులు లేక యందరు మందిరంబుకు
వచ్చుకాలము। అందమగు వైశాఖ కృష్ణా విదియదినమదె శుభ
దినంబో॥ భవము॥

(3) తరుగు విరుగులు లేని పరమిదనీ। పరసూచనిచ్చే మారామగురు
వరు కరము మంచిదనీ। పరుగు పరుగున లేపుమనిగురు కరమునం
దున నొరిగి నిజ। గురు స్థిరతరామంత్రార్థమెరిగీ తిరిగిరాని స్థాయి
నొందిన॥ భవము॥

(4) ద్వారంపూడి వంశజలజాతా। శ్రీబుచ్చమాంబగర్భముక్తాఫలము
శ్రీమాతా। కారణాగురు కామేశ్వరిచే। దారి తెలసుక సూరిజను
లకు కోరి భవ రోగములు బాయగ। విరివిగను భవనంబునిచ్చిన
॥భవము॥

(5) భావమందున ధర్మమెరుగుడనీ । భవరోగములునిట బాయుచుం
డును నిజమువినిగని నాభావమందు నిప్పుకర్పూరంపు చందము
యెరిగి యరుగ ని। రావరణమై నిండియున్నది। భావతీతపు బట్టబయ
లనె ॥భవము॥

(6) వాసిగాతోస్వాడిపురమునను । ఆరట్లరామారాయగురు । నిస్వా
ర్థమై మ్యాలనూ । నాశరహితము దెల్పుడని గురు గృహస్థాశ్రమ
వాసు జేసిన । దాసుడౌ యీ వెంకట్రెడ్డికి మేనత్తయా శ్రీగంగ
యాంబ ॥భవము॥

జై శ్రీ గురు.

—♦ శ్రీ గంగయ్యమ్మగారిపై మంగళ హారతి ♦—

( హారతిదే గొనుమా శ్రీరామచంద్రా ) అనువరస

(1) హారతిదేగొనుమా వరగంగాయాంబా ॥హార॥
హారతిదే గొనుమా సారమెరిగీనాతల్లి । పడాలావంశాసంభవు సత్య
న్నారాయణ పత్నీ ॥హారతిదే॥

(2) పరిపూర్ణాభావము నెరిగీ । కర్పూరా జ్యోతిగ యరిగి సురనూత
పరమాపావని । పరిపూర్ణాబోధా రూపిణి ॥హారతిదే॥

(3) గురుగురుగురు సభలకు యరిగీ । పరిపూర్ణాబోధా నెరిగీ । కంఠీర
వాంబా యనియెడి । పూర్ణాదీక్షానూ గుణవతి ॥హారతిదే॥

(4) పుట్టీనా మెట్టీనిండ్లకు । దిట్టయినా గుణవతివమ్మా । పుట్టూగి
ట్టూలూ లేనీ పూర్ణాస్థితి పొందినతల్లీ ॥హారతిదే॥

(5) కామేశ్వరి సద్గురు జేరీ । భూమేదో త్వరగా నెరిగీ ఈ మహి శ్రీ
శివరామార్యుల పీఠస్థాపనా చారిణీ ॥హారతిదే॥

(6) తోస్వాడను కాసీలో భక్తాస్పదమై వెలసీనావూ । సమరసప్రజ్ఞానా
విలక్షణ రామారావ్ మాతవు తల్లి ॥హారతిదే॥



# —* నక్షత్రమాల *—

## —: జంట కందార్థములు :—

కం॥ పరిపూర్ణబోధపరులా । వరగురు శ్రీకృష్ణమార్య సేవన్ జేసీ । పరి
పూర్ణబోధనొందిన । పరమగుణోపేతులైనా॥ శ్రీసన్యాసార్యుల్॥
సమరసమూన నిర్మలానందుల్॥ ఆసన్యాసార్యులా కరుణాబడసీ
పంచా॥ దశిపుగ్గానందా శ్రీ॥ దేశీకేంద్రులు నేడూ॥ ప్రేమతో నన్
జేరబిలచిభూమతత్త్వము తెలియపర॥చా భూమయందున నేను లేనని॥
సామమున నాసంధి దెల్పిరి॥ శ్రీ సన్యాసార్యుల్॥ సమరసామూన
నిర్మలానందుల్॥

కం॥ ప్రిణమిల్లెద గురువర్యా । ప్రిణమిల్లెద నామహృదయపద్మనివాసా॥
ప్రిణమిల్లెద వేదసార । ప్రిణమిల్లెద ప్రిజ్ఞానరహితా॥ పుచ్చుకో
వయ్యా॥ హెచ్చుతగ్గు లెంచా లేనయ్యా॥ యిచ్ఛా రహితులు
మీకే॥ హెచ్చు తగ్గుంటేనూ॥ పిచ్చివాడను నాజన్మచే చ్చన
దెట్లగునా॥ పాపములు హరియింపజేసిన॥ పంచదశి శ్రీపుగ్గనందా॥
పంతగించక కృతినిగ్గై కొని॥ పల్కు లేకను జేయుమయ్యా॥ పుచ్చు
కోవయ్యా॥ హెచ్చుతగ్గు లెంచబోకయ్యా॥

కం॥ ఆరట్ల గృహనాములగు । శ్రీ నరసింహారావు నాదు ప్రిపితా
మహులున్ । మరి వారికి జ్యేష్ఠసుతులు । వరభక్తులు రామరావూ॥
తాతా లౌతారూ॥ శ్రీనివాస సేవకులైవారూ॥ పుత్రద్వయము
నుబడసి॥ భక్తి నివెలుపరచీ॥ పరమపదించేరీ వరపుత్రులను వీడీ॥
పుత్రద్వయములో॥ జ్యేష్ఠులా నా పితృమాతృలు శ్రీనివాసాక్రిష్ణ
మాంబలు॥ ప్రిస్తుతము నన్ పెంచి పెద్దగజేసె కక్కయ నరసింగ
రావూ॥ తాతా లౌతారూ॥ శ్రీనివాసా సేవకులైవారూ॥

కం॥ ఛందసు సంధులు యెరుగను । అందంబగు మీదు చరణనమ్రి
కచే । పెంపొందిన కవితంబిదియే । ఛందము చదువ లేదూ॥ యిది

నికామయ్యా॥ చరణమె నమ్మి జేసేనోయయ్యా॥ అందూకె మిమ్మూ నా॥ డెందామందున నిల్పి॥ కందార్థములు జేసీ ముందార బెట్టితి॥ అందముకు కాదయ్య యిది మీ॥ డెందమేదో తెలియ పరచితి॥ ముందుగా మీరెందు జేరెప॥ సందు జేయుడి కృతిని కృపతో॥ యిది నికామయ్యా॥ చరణమె నమ్మి జేసేనోయయ్యా॥

కం॥ ఆనేవేడేదేమన । మానసమున నిలచియుండు । మరుపదిలేకన్ । పూని నే జెప్పు కవితము । లోనన్ తప్పేమిలేకా॥ కంఠమునా నిలచీ॥ కవితాకన్యా బ్రాహ్మివై వెలసీ॥ అనహాతీతదేవా అచలా గురుమహారాజా॥ అహమూ అనహమూ విడచీ । హాయిగానుంటిరా॥ ఆహాహా నేనెంతవాడను ఊహ పొడమిన కొలది చెప్పితి॥ దేహమేమియు లేని ప్రభుడా॥ దీక్షధారను నొసగుమయ్యా॥ కంఠమునా నిలచీ॥ కవితాకన్యా బ్రాహ్మివై వెలసీ॥

కం॥ బుద్ధిలో బృహస్పతివని। అర్థంబులో వాణివనుచు । యిద్ధరవిని । మీవద్దను జేరితి నిజమును । అర్థించియు దిద్దనాదూ॥ ముద్దూతనమంతా॥ సాధనాతీతా బోధావేదాంతా॥ హద్దూమీరి నేముద్రెడ్డానై తిరిగి యూ॥ అద్దాములోగన్న॥ ముద్దూ జ్యోతదేముక్త్యని॥ వద్దనున్న వికారగుణముల రద్దు తెలియక॥ పెద్దలని మీ వద్ద జేరితి॥ శ్రద్ధతోడుత రహితపరచూ॥ ముద్దూతన మంతా॥ సాధనాతీతా బోధావేదాంతా॥

కం॥ దేశములెన్నో తిరిగితి । వ్రాసిన గ్రంథములవెన్నొ పరిశోధిస్తిన్। ఆశించిజేస్తి యోగము । వీసంబున్నకైన మనసు॥ విరుపాలేనైతీ॥ కాశిని నమ్మి మాసీపోయీతీ॥ దేశికా మీచరణా లాశతో నమ్మితి॥ జేసి యుపదేశాము॥ తీసీవేయుడు మనసు॥ వాసిగా మీ శిష్యజన సహా॥ వాసమున మీదరిని జేరితి॥ విశేషముగ మీకీర్తి వింటిని దేశదేశములందు దేవా॥ విరుపాలేనైతీ॥ కాశినినమ్మి మాసీపోయీతీ॥

కం॥ గురుడనగ యెవ్వరిలలో । అరుదగు పరమార్థమేది । హరి గురు
వర్యా । యెరుకనె దెట్లుజనించెను । తరగని యీ యెరుకపోవ్వా॥
వివరామెరిగించూ॥ యెరిగిన యెరుకా నెగరాజిమ్మించూ॥ పరిపారి
విధమూలా ప్రబలే సందేహములూ॥ తిరిగి పుట్టకుండా॥ తరుగా
జేయుమా తండ్రీ॥ విరివిగను తమ చరణములపై నొరిగి మొక్కెద
కరుణజూడుడి॥ తరుగు విరుగులు లేని ప్రభుడా॥ కరము శిరమున
నుంచి నాకిక॥ వివరామెరిగించూ॥ యెరిగిన యెరుక నెగరాజి
మ్మించూ॥

కం॥ పరగురు సన్యాసార్యుని । వర మొసగెడి ప్రభుడటంచు । ప్రణుతిం
లొనర్చి । పరిపూర్ణబోధదెల్పద । పరిపరివిధమూల నీవు॥ పరు
గిడాకోయీ॥ ప్రజ్ఞను జిమ్మేదారీ వినుమోయీ॥ పరిపూర్ణ మెరు
కాల పద్ధతి దెల్పద॥ తెల్ప తెలసిన తెలివి॥ నిల్పాక జేసేదా॥ అల్ప
గురుబోధజ్ఞులను కలనైన నీమది॥ నిల్పకెన్నడు సిల్పకారునిబల్ప
బొమ్మది॥ స్వల్పమైనను పల్కగలదా॥ పరుగిడాకోయీ ప్రజ్ఞను
జిమ్మేదారి వినుమోయీ॥

కం॥ గురుడనగ గుర్తురహితుడు । గురుడనగ లేనివాడు । గురుడేపరమా ।
గురుమూర్తి సేవజేసిన గుణవంతులు తిరిగిరారూ॥ గుర్తెరుగా
బోరూ॥ గురుసేవలలో మగ్గియుంటారూ॥కరుణాజూచిగురుడుమరుగు
లన్నియుదెల్పా॥ హరికరిచందామై తిరిగీరారెన్నాడు॥ సతులు ధర్మ
మునిల్పుకొరకా॥ పతులసేవలొనర్చుసట్లుగ॥ గతియుకొరకా శిష్య
తతి గురు॥ నతిరయంబున సేవజేతురు॥ గుర్తెరుగాబోరూ॥ గురుసేవ
లలో మగ్గియుంటారూ॥

కం॥ అచలము నాల్గక్షరములు । వచియింపగ తరముగాదు।వివరింపంగా।
వచియింప సచలమగునిది । అచలంబునజూడ దీని॥ జాడా లేదన్నా॥
మాయాభ్రాంతిని విడుమా నాయన్నా॥ వచనా రచనలు లేని॥
సూచాన తెలసీనీ॥ వాచావీడుటపూను॥ సాచానస్థను జేరీ॥ గోచరిం

బిన విశ్వమంతయు॥ వాచాచందంబనుచు తెలసియు॥ సాచాసద్గురు కృపను బడసీ॥ వాచావీడిన పైని నీవిక॥ జాడా లేదన్నా॥ మాయా భ్రాంతిని విడువా నాయన్నా॥

కం॥ యెరుకన నాలవ దేహము । విరివిగ దానందుగలవు తెలివివీ దేహాల్ తెరదీసి గురుముఖంబున । మరుగెరిగిన తిరిగిరావూ॥ మరి పుట్టా బోవూ॥ నిజమగు దాంట్లో నీవెపుడూ లేవూ॥ యెరుకానె కలనీకు యెప్పుడూతో చీతె॥ యెరుకా లేందను మేల్కు॥ యెరుగు మప్పుడె చాలు॥ విరివగను నే తెల్పు భావము స్థిరతరంబుగ నెమ్మనంబున॥ పరములోనగెటి పరమగురుచే॥ విరివిగను చర్చించనీవిక మరిపుట్టా బోవూ॥ నిజమగుదాంట్లో నీవెపుడూ లేవూ॥

కం॥ సత్యానృతములు లేని । వసత్యంబా స్వప్నమువలె తాజనియించెన్ । వృశ్చిక ప్రసూతివలెనే । సత్యంబగు బయలుజూడా॥ సమసీ పోవు నురా॥ గురుకరుణాచె తిరిగీచూడుకురా॥ మేనన్నృతమెగాని నేనే సత్యంబనుచూ॥ పూనీపల్కుమునీవూ॥ మేనూవిడి సూన్యము నా॥ గాన శబ్దార్ధంబు లొకటటు॥ నేను మేనులు రెండు ఒక్కటై॥ పూనిపరి పూర్ణంబు తెలసిన॥ లేనిసత్యానృతము లొకటిగ॥ సమసీపోవునురా॥ గురుకరుణాచె తిరిగీచూడుకురా॥

కం॥ వృత్తే యీఘటమాయెను । కర్తైయదె కుండలన్ని కల్పన జేయన్ । యటువలెగు ర్తే తను నెరుకదియై । కర్తై యీసకలజంతు॥ జాలామా యెనురా॥ గుర్తెరిగేదే యేమీ లేదనరా॥ కర్తాభోక్తగనుండే గుర్తే లేదని తెలసీ॥ వృత్తి సూన్యము జేయూ కర్తృత్వమదివిడచి ధాత్రి లోగల వింతలన్నియు॥ రాత్రి నిదురందేమి లేనటు॥ కర్తయా నీరాకపూర్వపు॥ గుర్తు నెరుగిది రహితమూనికి॥ జాలామాయెనురా॥ గుర్తెరిగేదే యేమీ లేదనరా॥

కం॥ ధర్మము విడువనివారిక । ధర్మము ప్రతిపాదియగుచు ప్రజ్ఞల మించున్ । మర్మము తెలియగలేరీ । ధర్మంబును విడచువారే॥

ధన్యాలోయన్న॥ నిర్మలులైతే నిజమెరిగేరన్నా॥ విపరీతమూ బుద్ధి విడచీ సద్గురు జేరీ॥ మర్మామెరిగినవారు॥ ధర్మమూ విడతూరు॥ కర్మకులు నిజమెరుగలేకను॥ అహంబ్రహ్మామము ధర్మమనుచును॥ ఉర్విలో తిరిగేటి గర్వులు॥ సర్వసముతెల్లాపు రరయగ॥ ధన్యాలోయన్నా॥ నిర్మలులైతే నిజమెరిగేరన్నా॥

కం॥ ఏమియుకానిదిపూర్ణము । నామము రూపంబులేక నంతటయుండున్ । భూమనగజెల్లునముగో । సోమరులకు తెలియబోదూ॥ తెలివాదికాదూ॥ తెలివినినమ్మే త్రోవీదిగాదూ॥ సామవేదాతీత సాక్షిరహితంబైనా॥ స్వామినదిగోకని॥ యేమనకుండుము ॥మిత్రం॥ కామక్రోధాములను కలియక కొద్ది గొప్పలు లేక నున్నది॥ కాలత్రయముల నంటకుండా॥ గురుని సూచన చూడురామా॥ తెలివాదీగాదూ॥ తెలివినినమ్మే త్రోవీదిగాదూ॥

కం॥ చైతన్యమెట్లుగల్గెనో । చింతను మరి జెందబోకు చెలువుగవినుమీ భూతంబులైను గూడియు । చైతన్యంబాయె తనయా॥ చక్కాగ వినరా॥ భూతములె యీచేతానమూరా॥ చరణాకటిహృదయంబూ గళమూశిరమున నయ్యే॥ శరభూతంబులానూ॥ ధరయూ మొదలుగజూడు ॥మిత్రం॥ నీతివాక్యములాడు బ్రహ్మము॥ చేతనము వీడెందుగానదు॥ నేతినేతీతీతియనినను॥ చేతనాచేతనము లొక్కటె॥ చైతన్యామూరా॥ భూతములే యీ చేతానమూరా॥

కం॥ అకార మనహామనబడు । అకారమె సాక్షియగును । ఆత్మయు నదెయూ । అకార మక్షరంబగు । అకారము రహిత మదియే॥ హింసానాబడురా॥ "అ" హింసదియే పరమాధర్మమురా॥ హింసా జేయుటయందూ హంసా బాధ తెలియూ । హంసా బాధ తెలియా నింసాభోద్యముచేసి ॥మిత్రం॥ హంసపై నోంకారబ్రహ్మాము నిరసనంబదహింస యనబడు॥ సంశయంబునువిడచి నీవికసంగ తెరుగుము॥ సద్గురునిచే॥హింసానబడురా॥ "అ" హింసదియేపరమాధర్మమురా॥

కం॥ యాదియు మసుపులులేనిది । సూదిమొనకు సందులేక సకలము
నందున్ । యేదియుగాకను యున్నది । ద్వాదశి సూచనయదేరా॥
అదుగో కనుగోరా॥ బదులు లేని దిదియే యనుకోరా॥ కదలాక
చూడునీ॥ యెదురుగానున్నాది॥ సదయులైన శివరామదీక్షిత
మార్గం ॥మిత్రం॥ నిదురవచ్చిన రీతిగనుగొని॥ మదిలో మంత్రము
మననజేయుచు॥ ఎదురపత్రులను చూడకను మరి॥ పదిలముగ
పన్నెండు భావము॥ అదిగో కనుగోరా॥ బదులు లేని దిదియే యను
కోరా॥

కం॥ భావించిచూడు నీలో । ఈ విశ్వంబంత కలలో కానంబడునూ ।
నీవపుడు మేలుకొన్నను । యేవంకను లేకపోవ్వూ నీకలలోజగమూ॥
కావున నీ వా జగ మొకటే నిజమూ॥ ఆపీధంబున నీ వా భావా
తీతముగాంచీ॥ భావాభావములం దభావూఢవై యుండూ ॥మిత్రం॥
త్రోవబోవుచు దప్పిచే నొక యెండమావులజూచి నిజమని॥ దవ్వూ
నను జేరంగ లేనటు॥ నీవు నీజగమటుల సత్యము॥ నీకలలోజగమూ॥
కావున నీ వా జగ మొకటే నిజమూ ॥

కం॥ ధర్మము దేహీయనంబడ । ధర్మము దేహంబటంచు చెప్పంబడునీ।
ధర్మము నిజగుసు కరుణచె । నిర్మలముగ విడచినపుడే॥ నిశ్చాలా
మన్నా॥ మర్మంబెరుగా మరి మాయాసున్నా॥ గర్వించీ నీవిలలో
కర్మాలె లేవాని॥ దుర్మార్గావృత్తులయందూ చరియించ కోయప్పా
॥మిత్రం॥ ధర్మమార్గ ప్రవర్తకుడవై ॥ కర్మ జనులకు చూపుచుండు
ము॥ దుర్గయానందూని బోధిదె కర్మరహితుడవౌదు వీవిక॥ నిశ్చా
లామన్నా॥ మర్మంబెరుగా మరి మాయాసున్నా॥

కం॥ విను శిష్యుడ వివరంబుగ।అభ్యాసభ్యాసతీత పంచదసులలో। కలతో
చిన శరీరం మేల్కొన్న యేమీా లేదన॥ యిది యేయభ్యాసం॥ దీనిలో
మూడూ మంత్రాలాహంశం॥ అనయూ మీాజగమంతా॥ పంచదసి
కలయనునూ॥ షోడసీయర్థంబే తోచిన శరీరం ॥మిత్రం॥ మేలుకొ

న్నను యేమిలేదను॥ ద్వాదసీసూచనయె నిలచెను॥ యిటుల పంచదసిలో యిమిడెను॥ మూడు మంత్రాలంతరార్థం॥ యిదియే అభ్యాసం॥ దీనిలోమూడూ మంత్రాలా హంశం॥

౯౦॥ కల నీకు జగమటంచును । సలలితముగ నమ్మి నీవు । సద్గురు కృపచే । కల నేనె యనుచు నెరిగియు । నిల్కడయా గురుమేల్క నెరిగీ॥ నేనే లేనసరా॥ లేనిదె నె తానందే తోచెనురా॥ నేనూ మేనీ రెండూ నేనే॥ తానందూనా లేకాపోవునుగాన॥ మంత్రా మిట్లనుకొనుము ॥మిత్రం॥ గురుమేల్కయంమునతోచినా శరీరమే॥ కలయనుచు నెరిగియు॥ పంచదసి యభ్యాసతీతము॥ వంచనా రహితుండవై విను॥ నేనే లేనసరా॥ లేనిదె నే తానందేతోచెనురా॥

౯౦॥ పిండబ్రహ్మాండంబుల । శృష్టిని క్రిమపద్ధతెరిగి । సద్గురు కృపచే । రెండూ మృషయనివిడచి య । ఖండంబగు యెరుక నేనని॥ యెరిగీ యరుగుమురా॥ కలయూ తా మేల్కొన్నేమీ లేదనరా॥ "గురుమేల్కయూ తానే కల మేల్కొన్నేమీ లేద"న ఆరూఢ పంచదసదె॥ అహరహితాన్నైయుండూ ॥మిత్రం॥ దండిగురులా దుర్గనందులు॥ శోధజేసిన పూర్ణభావము॥ పండితా గురుమండలీలో॥ ఖండితంబుగ విమర్శించుము॥ యెరిగీ యరుగుమురా॥ కలయూ తా మేల్కొన్నేమీ లేదనరా॥

౯౦॥ యెరుకన నాలవదేహము । గురుతన యూన్పైది నైమెను । అవ్యక్తం బౌఆరీతి కర్పురజ్యోతుల । పరికించియు నీలో నీవూ॥ పలుకాకుండుమురా॥ కలవాలె వెలిగీ కనరాకుందువురా॥ కర్పూరమే నాల్గూని ప్పాంపై ఐదోదీ॥ స్థిరమందు వెలిగవల తరలీపోవునుజూడు ॥మిత్రం॥ "యీా వృత్త యిత్తడి పళ్లెమేమీా లేదు" యనునటు బయలు గనుగొని॥ గుప్త కర్పుర శిఖనియెరిగియు॥ జ్ఞప్తివిడి నిరవందసుప్తిలో॥ పలుకాకుండుమురా॥ కలవలె వెలిగి కనరాకుందువురా॥

కం॥ శ్రీకరమగు గురుపదములు । ప్రాకటముగ హృదయపద్మమందున నిల్పి । లోకేశుగురుని బోధలు । ఈ కల జగమునకు చాటా॥ కలగానే వ్రాస్తి బయలెరుకలకే యిది జూడా కుస్తీ॥ ఆకార రహితాహా అచలాబుపి గురుప్రభుడూ॥ సాకారరూపమున సరగూన చనుదెంచీ ॥మిత్రం॥ ప్రకటముగ పరిపూర్ణబోధలో॥ మర్మధర్మము తెలుకపరచిన॥ మద్గురూ శ్రీ మద్గనందుల కంకితంబుగ కృతిని జేస్తి॥ కలగానే వ్రాస్తి॥ బయలెరుకలకే యిది జూడా కుస్తి॥

కం॥ ఆరంభమెచట జేస్తినో । యేరంగులులేని నేను యేకాంతములో యీరంగా నక్షత్రమాల । యీనాటికి ముగిసెనేమా॥ యింపూమీరగనూ॥ సొంపగు భార్యా సీతాయుండగనూ॥ సంగా తెరిగిన మాతా గంగాయాంబిచ్చినా॥ తోసూప్పడి పురపీఠా॥ శివరాము తెదుటాను ॥మిత్రం॥ వికారి వత్సరాషాఢ శుద్ధ పౌర్ణమీ శ్రీ యిందువారము॥ సత్య సుభద్రలు సంతసింపగ సాహసంబున పూర్తి చేస్తిని॥ యింపూ మీరగనూ సొంపగు భార్య సీతా యుండగనూ॥

జై శ్రీ కూరాకులవంశ పయఃపారావార
రాకాశుధాకరుండగు శ్రీ మద్గురు
సరస్వతీ దుర్గానంద పంచదసీ
స్వామిస్వగురు ప్రభు మహారాజుకీ
జై జై జై.



## —: పాట :—

(1) పలుకులా వెలది దుర్గానంద బోధ వి । నానంద రహితమా ॥పలు॥ ఆమహాతిరము నదుగ్గొ గనుమనుచు । చూపి చూపకున్న । దా నంతు యెరుక జగమెన్నడైన ఘట్ట లేదనే ॥పలు॥.

(2) నిండుగ జలచరమూ । వుండినా తీరుగాను స్థిరమూ । నందుయెరు కుండె । గాన స్థిరమూ । యెండమావులటు । లుండుకున్న యా ఖండ యెరుక నేననుచు దెల్పి । నన్ లేకుండ జేసినా ॥పలు॥

(3) అధ్యారోపముగా । మధ్యనే మాయదోచెననుచూ । మిథ్యయన లేనిద నెడిభావం॥ బనుచు దెల్పి । యీ మధ్యదోచుమాయెప్పుడైన మిథ్యనుచు దెల్పి । యాతథ్యమిథ్యముల । యెరుక లేక నన్నుండ మనినయా ॥పలు॥

(4) యెరుకభావమందూ । మరిగినావారి చెంతయందూ । తిరిగి నాస్థి తియు కుదరదిందూ॥ అనుచు దెల్పి చంచలము లేకుండ । నుందు ననుచు బాసజేయ । కీలు దెల్పి నన్నుద్ధరించినా ॥పలు॥

(5) ఖరగపురములోనా । పరమగురు దుర్గాచరణమూనా । ఒరిగి నే పరము దెల్పమూనా॥ రామరావ నీవె లేవనుచు । కీలు దెల్పి । గురు మేల్కజూపి । నాయున్కిదెల్పి । లేకుండయున్నయా ॥పలు॥

## —: పాట — రూపకతాళం :—

గురుశిష్య సంవాదం "పరమగురూ వరసన్యాసార్య అను వరస

ప):— యోగములలో నేగనినా । జ్యోతిరూపు నాశిఖందునాటిపోయెగా॥ జిగియటువలె మెరుపురాగ । జ్యోతే యనుకొని నామనసానందం బొందుచుండు । నిజముగ నమ్మెడు దేవా ॥యోగ॥

జ:— స్థిరముగాని యీజ్యోతదె । పరమునందు లేదుగాన నమ్మబోకుమో శిష్య॥ తారకమదె నీరకముర తక్లిపోవు తాతలవలె । తక్లనిదానిని గనుగొని । తల్లెడి మార్గము తెలియుము ॥స్థిరముగాని॥

ప్రి:- మలుకలత్రో వలకుబోవు । మనసుకెట్లానందముగూ । డీవిధమును దెల్పి నాకు।చలనమూను తొలగజేయు॥ మాహాత్య్యముగలవారిని । యెన్నడైన చూచునపుడు । మనసున సందియ మొందుదు । మన్నించుము నాదుమనవి ॥యోగములలో॥

జ:- మానసమన నీకు వేరే యెన్నటికిగాకుండుశిష్య । మానసమన దేహీయనిన । సాక్షియనగ నీవేనయ్యా॥ మహత్య్యముగలవారలు। మధ్యములని శృతులుబల్కె ఉపనిషదర్థములన్నియు । మథియించగ తేలెసారం ॥స్థిరము॥

ప్రి:- సగుణమువిడ నిర్గుణంబు । నిల్కడై తానుండెదేవ । నిర్గుణాసమాధి యెంతో నిల్కడనుచు శృతులుబల్కె । నిర్గుణ సమాధియందుననే నీవను భ్రాంతిలేదు । నిజముగ నామదికదియే । సత్యంబనుతోచు చుండె ॥యోగ॥

జ:- తాననియెడినిర్గుణంబు। నేనుకూమూలంబుగాన। తనుతానతానేటితాను దేహము విడిచుండ లేదు॥ సగుణా నిర్గుణములు రెండేకముగా జేసి నీవు । నిర్గుణమనియెడి సూర్యుడు లేనేలేడని తలచిన । ప్రితిబింబం బెక్కడుండు । పల్కుట కేదుండునురా ॥స్థిర॥

జ:- విజయనగరవాసుడైన । సుజన సన్యసార్యశిష్య । భారతీ శ్రీసుగ్గనంద దేశికులా పంచదసీ ॥మి॥ చరణంబులు హృదయంబున । నిల్పుకొనుచు రామరావు । గజిబిజి జ్యోతెరుక భ్రాంతి రహిత పరచెనేడు ॥స్థిర॥

—: తత్వము - రూపకతాళము :—

(1) దుగ్గనంద నీదు డెందమెరుగ నెవరికలవియగును ॥దుగ్గ॥
గానలేరు నీదుచర్య । తానే తానన్న వారు॥ నానా మేనులు నేనని। నేనన్నది లేదనుకొని । నేను మేనుగానిదాన్ని । పూనికతో తేకె
టెగిరి ॥దుర్గనందా॥

(2) మరుపెరుకలుగాని ఘనము । అరలిప్తలో యెరుకపరచి । అరుగు కరుగు పెరుగు తరుగు । యెరుకతొలగ జేసిరయా॥ కరము శిరము నొంచి భవచ్ఛరణంబుల నొరిగి మ్రొక్క । అరుణోదయ మిా చూడ్కుల । అరిగెను నేనన్న యహము ॥దుర్గనంద॥

(3) జన్మచేత సూతుడవై । ఖర్మచేత ద్విజుడవేద । మర్మమెల్ల తెలసుకోని । విప్రుండవైతివహహా॥ బ్రహ్మజ్ఞానముచేతను । బ్రాహ్మణుండవైతివీవు । నిర్మల నిర్గుణతీతా । ధర్మాధర్మవివర్జిత ॥దు॥

(4) తొలకారి మేరుపువలెను । నిలకడేమి లేనిదనుచు। కల కల్లగ జేసి నిజము యుల్లమందునాటజేసి॥ చెల్లి చెల్లక జేసిన తొల్లింటి ఖర్మ బాపి । మళ్లీపొందుచునుండిన । మాయకలను బాపినట్టి ॥దు॥

(5) వాసిగా నరసన్నపేట । కాశీ రామేశబాట । ప్రక్కనున్న అచల పీఠ । స్థాపకా శ్రీమర్గబాట॥ వాటముగా హృదయమందు నాటింపగ జేసుకొన్న । ఆరట్ల రామరావు అహము విడచి వ్రాసెపాట ॥దుర్గనంద॥

## —: గురు శిష్య సంవాదము :—

(1) చలమచలంబుల జాడనెరుంగక । యిల వలలోనే జిక్కితిరా । కల యేదొ దెల్పి మేల్కనుజూపి । యిల బాధలనూ తొలగగజేయర॥ చలమిది జూడగ జలబుద్బుదమన । బుధులన వింటిని దెల్పుము దేవా । మలుకలులేనీ చులకన మార్గము । అలసటలేకను దెల్పుమురా ॥చలమచలంబుల॥

(2) సూటగు మాటనూ కోటికొకటివినూ । నీటనుయుండిన జలచరములవలె । సూటిగ గురుడూ మిాటలొజూపిన । సాటిలేని పరిపూర్ణాజలధిలొ॥ బూటక కలగా నాటకమాయెను । కోటిమాళ్లు తా పుట్టుచు గిట్టుచు । దీటుగాను సద్గురుని చెంత । దీని మిాట దెలసినా మాసైపోవును ॥సూటగుమాటనూ॥

(3) కన్నది విన్నదీ సున్నని పల్కిరి । తిన్నని త్రోవను జూపుమురా ।
భిన్నాభిన్నాముగాని పరంబున । యెన్నఁడైన యెరుకందువ లేదని॥
చెన్నుమీర మీవాక్యము విన్నను । తన్ను తాను కన్నది సున్నా
యెను । కన్న తండ్రి మీ చెంత జేరితిని । వున్నవిధంబును పన్నుగ
దెల్పుడీ ॥చలమచలంబుల॥

(4) చక్కరబొమ్మవు నిక్కముగావుర । చక్కగ నీటిలో నిజమున్
జూడరా । నిక్కము జూచితినని పల్కగ నీ । వెక్కడ నుంటివో
దెల్పుమురా । చక్కగ పరిపూర్ణంబును జూచిన । యెక్కడగలవుర
పరమదిదెల్పగ । లెక్కపెట్టుటది మానియు నీవిక । చొక్కము
సద్గురుసేవ జేయరా ॥నూటగు॥

(5) నాదమె బ్రహ్మని మేదినిబల్కిరి । భేదముమదిలో బాపుమురా ।
సాధనలో విదె నాదమదయ్యెను।నాదబిందుకళల్ పాదుకొనున్నది॥
శ్రీధర శివరాముల బోధలువిన । నాదరహితమే బ్రహ్మనియుం
డెను । ఆదిదెల్పి మేదిని నాదగు యీ భేదబుద్ధిని మాన్పుము శ్రీ
ధర ॥చల॥

(6) యిచ్చ షోడశిది సత్యముగానునీ । ముచ్చట స్వప్నంబని తెలియు
మురా । అచ్చముగా మేల్కొచ్చిన యీకల । మచ్చుకైన లేదూ
హాలోగనరా॥ సచ్చరితుల సాంగత్యముచేసియు । మచ్చ మాయ
నూరోయుము తనయా । గచ్చులుకొట్టే దిచ్చులచెంతను । విచ్చ
కుమీ పరిపూర్ణభోధనూ ॥నూటగు॥

(7) పరమెరుకల సంధదిపీఠెనయో । పరమగురూవరా పంచదశీ । తెర
నుదీసిన నాయురమునందునా । పరబోధను మది నాటగజేసిన॥
భారతి దుర్గానందునిగొలచి । సారము తెలసిన రామారాయుడ।
పారవార సంసారమురోసీ । తానవె యీ యెరుకర్మ్యంబొసగెను
॥చలనుచలంబుల॥

—: తత్త్వము – రూపక తాళము :—

(1) మిత్రమా పూర్ణబోధ మరుగు నెరిగెవా సు । క్షేత్రరహిత సూచ నెరిగి యెరుకవిడచెవా । రాత్రి గన్న కలను నమ్మి క్షేత్రజ్ఞుని విడువలేక । ఆత్రతతో పంచాక్షరి । సూత్రమెరిగి తిరుగుచుయా॥ త్రిపుటీనాదాంతర్గతభావంబుల నమ్ముచుండి । గాయత్రి జప దేవత సావిత్రిని నమ్మితివా ॥మిత్రమా॥

(2) బృహద్వ్యాశ్రిత్య మూనుజదివెవా । అహమేదొయెరిగి । సాహసమున దాన్ని రోసెవా । దేహమందు పాదుకొన్న సోహమే స్థిరమైనద నుచు । మోహమిడక పూర్ణమనుచు । అహమునా వాదించెదీవు ॥మి॥ ఐహవ్యా యీపల్కులనగసాహసమదియెట్లుగల్గె । కోహంక స్త్వం బనియెడి సోహంబునె సూచననగ ॥మిత్రమా॥

(3) గురునిచెంత గురుతు విడచెవా । మరుగైన పరము । విరివిగా నీమదిని యెరిగెవా । సరగునా సద్గురునిగనక । తిరమై నేనుంటిననుచు । పొరపాటున పల్కితీవు । తర్కమేల పెద్ద లతో ॥మి॥ విరివిగ యీ మేరుశిఖర కుహరమందు వెలుగుచున్న । పరమపురుషు నమ్ముకొన్న । తిరిగి జన్మ కలుగదన్నా ॥మిత్రమా॥

(4) పదిరెంటిలో పరము నెరిగెవా । అది యెరిగినంత పదియారదిమదిని రోసెవా । ముదముమీర పదియున్నైదే । పదియారని మేల్కొన్న ను । సదమలా పన్నెండు నెరుగ । మొదలేమి లేకపోవు ॥మి॥ పదపద సద్గురుచెంతకు । సదయత యీ బోధ నెరుగ । కుదురును నీకుళ్ళు గుణములు । నెదలో సద్గురునమ్మిన ॥మిత్రమా॥

(5) శ్రీ రామచంద్రపురమునా । వరఅగ్రహారమనియెడి శ్రీపల్లెయం దునా । విరివిగా శ్రీ దుర్గనందుని । వరములొసగ శేవజేయు సమ రసా నిర్మాలరమ్మని । కరము శిరమునుంచి తాను ॥మి॥ అరమర లేకను వినరా । ప్రజ్ఞాన విలక్షణుడా వర రామరాయ వినర । అల్లదిగో పరముగనరా ॥మిత్రమా॥

## —: తత్వం – లక్ష్మీనారాయణ సంవాదం :—

### రూపకతాళం

(1) పాలకడలిశయనజూపుమా । యిలనిలకడైన బ్రహ్మమేదో యెరుక
పరచుమా । తొలిదైవము మీరటంచు । పలుకుచుండెనష్టాక్షరి ।
చులకనైన మార్గమూన చలనమూను తొలగజేయు ॥పాల॥

(2) చూడుధనదు సోదరీమణీ । యీడెందుగాని । జోడు రహితపూర్ణ
స్థిరమదీ । వాడవాడలందు గలదు । మూడుమూర్తులదియుగాదు।
గూఢమైన నాదుగురుని । పీడయెరుక విడచినేడు ॥చూడు॥

(3) అస్తిభాతిప్రియము లేదనీ । పరవస్తు వేదొనాస్తిగానిదనుచు దెల్పిరీ।
విస్తరించి రెంటివిధము । శాస్త్రలోన దెల్పి నీమరస్తా (శ్రీ) రాజ
బాట । అస్తిభాతి ప్రియశూన్యుడ ॥పాల॥

(4) మృత్తుఘటముల్తైన రీతిగా । చిత్తైన ప్రకృతి । విత్తమగుచు జగతి
వెలసెగా । మిత్తిరహిత పూర్ణగురుని । ఉత్తిశిరిగనంత మెరుగ ।
మొత్తమైన సత్తుచిత్తానందరహిత మదె కనుగొను ॥చూడు॥

(5) మూటిమూటి మూటిదాటుచూ । సూక్ష్మైన సద్గురు కోటి సూర్య
ప్రభనుగాంచుచూ । మేటి యోగపరుల మనుచు । బూటకములు
పలుకుచుండ్రు । బూటకమో నాటకమో । సూటిదెల్పు దేశి
కేంద్ర ॥పాల॥

(6) దహరగమ్యస్థాన నిలయుడూ । అమనస్కపరుల అనహ మనెడి
ఆత్మరూపుడూ । ఇహము జగము । పరమదాత్మ । అహద్వయం
బదంచు తెలిసి । ఇహము పరము రెంట్నిరోసి । మహిమ లేని
మద్గురువరున్ ॥చూడు॥

(7) భావరహిత బ్రహ్మమెరిగితీ । ఈజీవబ్రహ్మ । మొదలు లేనిదనుచు
విడచితీ । నావరీతీ త్రోవ దెల్పె । సావధానగురు వెవరిల । ఆవం
తయు కొరత లేక । భావమెరిగె శిష్యులెవరు ॥పాల॥

(8) ధరను పేరపీఫురంబునా । హారగురుడు వెలసె సరస్వతీ (శ్రీ) దుర్గ నందనా । మురయుచూ గురుదీక్షనొందె ఆరట్లా రామరావు । యెరుకవిడచి పరముదెలసె । పరమగురుని యునికి నేడూ ॥పాల॥

—: తత్వము — గురుశిష్య సంవాదం :—

(1) పదరా పరమార్థమెరుగగన్ । విధితముగను మదిని నరికి ॥పదరా॥ ముదముమీర పరము నెరుగ । వదులు జనన మరణభ్రాంతి । కదులునీవు కల్మిమృషని । వదులు నీవు జన్మమికను ॥పదరా॥

(2) వరగురు మీచరణ ద్వయములన్ । స్థిరతరముగ మదిని గొల్చెద వరగురు॥ మేరలేని అహము నిపుడు దూరముగా వదులుకొందు । సారమేదొ దెల్పి నాదు పారవార భ్రాంతిదీయు ॥వరగురు॥

(3) గనరా పరిపూర్ణ బ్రహ్మమున్ । అనయమునను నిన్ను విడచి॥గనరా॥ నేనులేని పరమదనుచు । పూనికగా నమ్మి నీవు । తాను నేననూచు నుండె । మేనెరుకల నెరుగకుండు ॥పదరా॥

(4) తెలివగు నన్నెట్లువిడతునూ । సలలితముగ చలనమయ్యె॥ తెలివగు॥ యిలను తెలివివిడచియున్న । మెలగు టెట్లు మహ్గురువరా । జాల మేమిశాయకాను । చలనమూను తొలగజేయు ॥వరగురు॥

(5) యెరువువస్త్ర సొగసుబీదగా । నిరుకులేని తెలివనుకొను ॥యెరువు॥ సురుచిరాపు మెరుకలనూ । యెరిగి యెరుగకుండి కడకు । హరికి కీ కల చందమెరిగి జరుపుపనులు నిన్నువిడచి ॥పదరా॥

(6) సంపెంగా బృంగమైతిగా । ఇంపగు తమ బోధవలన ॥సంపెంగా॥ సొంపుమీర దుర్గయార్యుని । అంపోల్పుర మందు గొల్చి । ఇంపు రోసి రామరావు । సొంపగు గురు యునికిదెలసె ॥వరగురు॥



—: తత్వం "మరుగేలరా ఓ రాఘవా" అను వరస :—

(1) తెరదీసెనే గురురాయుడూ ॥తెర॥
తెరదీసి నాదు మొరలాలకించి । కరుణతోడ కరమూ శిరమూన నుంచి॥ పరమార్థంబును తేటపరచెదను । పరిపరివిధముల పరుగిడకుంచును । వరకరుణామృత చూడ్కులచేతను । విరివిగ పరమెరుకల మధ్యనుగలయూ ॥తెర॥

(2) సాధనాసంపత్తి బోధజేసిజెప్పి । "అథాతో బ్రహ్మజిజ్ఞాస" యంచు దెల్పి ॥ సాధనంబు మరుగుచుండిన యీ । బోధలోని శోధ దెలియ దంచును । వాదభేదమేమి లేని యః । నాది తత్వమెరుక జేసి నేడు యాదనె ॥తెర॥

(3) పట్టువిడుపు లేని గుట్టు గురుడవంచు । బట్టబయలుజూపి । వట్టిపల్కదనెనే॥ వట్టిమాటగాను దీన్ని గుర్తు నెట్టి సేవించవలెననుచు । పట్టుగాను సద్గురుని చెంత యెరు। కొట్టుపెట్టి విడచి సేవించవలెననే ॥తెర॥

(4) భావగమ్యస్థానమదే । నీవారసూకాగ్రి మోంభూర్భవ స్వరోమని యెడిమంత్రి॥ జీవరాజమదె షోడశాక్షరంచును । శివజీవైక్యరహిత నిర్బీజభావమెరుక జేసి నేడు తెలివనె ॥తెర॥

(5) తెలసిన తెలివే కలయని దెల్పియు । మెలుకువ యందున తెలివే లేదనె॥ రూలుగాను గురువాక్యముచేతను మేలుకందు సుషుప్తిపొందినను కాలుని బాధలు తనకే లేవని । కీలుదెల్పి తత్థినిజూపి నేననే ॥తెర॥

(6) వాసిగాను వైశాఖపురంబున । దేశిక దుర్గానందుని పదములు॥ దోసిలొగ్గి తను మన ధనములు గురుకర్పణన్న । తీసివేసె భవ బంధ సహిత రామరావనె యిచ్ఛయనె కామెర్ల తెరనునేడు॥ తెర॥

—: తత్వము :—

లెండీ గురుభక్తులారా । గురుజాడ తెలియ । రండీ గురుభక్తులారా

(1) లెండీ గురుజాడ తెలియరండీ । అభిమానముంచకండీ । తను మనసు ధనములండీ । సద్గురుని కర్పించండీ ॥లెండీ గురుభక్తు॥

(2) అందూ పశ్చిమ చక్రమందూ । మహాకాశమందూ బ్రహ్మాండ కోశమందూ । హిరణ్మయుండై యుండూ ॥లెండీ॥

(3) ఉండూ। ద్వయమూలు లేకయుండూ । తెలివిని విడచియుండూ । దేహము లేకయుండూ । అశరీరసద్గురుండూ ॥లెండీ॥

(4) అట్టి । సద్గురుని పాదముపట్టి । అచలమును గనిపెట్టి లేనట్టి ప్రజ్ఞనెట్టి । పద్మనైదుకు సరిపెట్టి ॥లెండీ॥

(5) చేతూ పాద్యార్ఘ్యములు । చేతూ । కర్పూర గంధము పూతూ । చామంతిపూలు వేతూ । దేశికదుర్గగొల్తూ ॥లెండీ॥

(6) స్థలము వాసిగ రణస్థలమూ । దేశిక దుర్గపదమూ। రామారాయుని మనసమూ । నమ్మిన మహాఘనమూ ॥లెండీ॥

—: తత్వము — ఆట తాళము :—

(1) పలుకైనా పలుకవేరా । సద్గురువర్యా ॥పలుకైనా॥
పలుకైనా పలుకాకా । తొలకారి చూపూల । కల మేల్కొల్పగ చూచెవూ । తెలియగతరమా ॥కల॥ తొలుత మంత్రపు అర్థమిది యని । పలుకు లేకనె సౌంజ్ఞ చేసెవు । మలుకలూ లేనట్టిమార్గము । తెలివివిడచిన తెలియబడుననా ॥పలుకైనా॥

(2) మంగాళసూత్రాత్మ భంగానిస్సంగావో । సింగినిన్ కల గను వ తెంగా॥ సద్గురుపుంగా ॥సింగి॥ పొంగుచును పంచాంగములు । మహాల్లింగమెరిగి విభంగపరచగ । అంగలింగ నిస్సంగుడశ్శృంగార వతియూ యువతివలె నీవు ॥పలు॥

(3) బోధానె సాధనచె । వేదావతినిజూపి । నాదానందం బిదియాని । మీాదనెగుకుడో మేలు విరాట్టానుచూ ॥మీాదనె॥ మోదమలరగ వేదవతి తన్నాథుడో గురుపాదుల । ఆదినెరుగిది రహితపానని సీదామార్గముజూపి నీవూ ॥పలు॥

(4) భస్మాసురునిజాడా లెస్సాగ వివరించ । విస్మాయమొందితినీ అస్మద్గురువర ॥విస్మాయ॥ గ్రీష్మఋతువున మృగజలముజూచి । విస్మయముతో పరుగుబెట్టాశ్చర్యస్పదమయె జలములేమిక నాయునికనా ॥పలుకై నా॥

(5) పంచాదసీ దుర్గానందాయనుచు మిమ్మూ।యెంచీపెద్దలు పిలచేరూ। సంచితాగమనాశా ॥యెంచీ॥ కొంచెమన కంపోల్పురంబున పంచరాత్రి లూర్ణబాధలో । పంచనుండి రామరావుచె । అంకితము రచియింపచేస్తిరా ॥పలు॥

—: తత్వము — అట తాళం :—

(1) చెల్లిరొవినవె గురు నుల్లామందున నిల్పి । చల్లాని సద్బోధనూ చెల్లించు మిక నీ తను మన ధనమూలనూ॥
యెల్లాలోకములూనూ । కలయెనీకని తెలసి । మళ్ళిరానట్టి యూ మరుగైన గురుబోధా॥ పిల్లిపిల్లలన్యాయమున నేతొల్లి వినికన్నట్టి బోధను । పిల్లాడెడి బొమ్మపెండ్లటు । కల్ల సంసారంబిదంచునూ ॥చెల్లిరొ॥

(2) వన్నెలన్నియుమీారీ । యున్నా వస్తువజాడా । సన్నూతాంగిరో చూడుమా॥ తిన్నగా గురుసూచనదుగో సన్నుతించిరి జేజేలందరు। మిన్ను రహితంబైనపూర్ణ మదన్ని దిశలను నిండియున్నదీ ॥చెల్లిరొ॥

(3) నూటీగ నడినాళ బాటలోపల వెలిగే । కోటీ సూర్యుల కాంతే । మేటీ గుర్తెరెతనువూ॥ బూటకంబులుకాదు విను కల నాటకము

నకు సూత్రమదియె । పాటగా షోడసిజపించిన । నీటదాచిన । వుష్పమూలా ॥చెల్లిరో॥

(4) కల తానొందితినేనే । కలనాని మది తెలియ । మెలుకూవలో నీదూ । నిలకాడ లేదమ్మా॥ పలుకు లేలనుగనుము చెల్లెల । నిలకడో యాపల్లెరంబున । కలిగి తొలగె కర్పూర శిఖవలె । కలను గురు శిష్యాల న్యాయము ॥చెల్లిరో॥

(5) వరమూ యెరుకల రెంట్నీ । యెరిగీ యెరుగని ప్రభుడూ । సర స్వాతివర దుర్గానందా ప్రభువరుడూ॥ విరివిగను యె రామరావుకు పరము కరతలమలకమును జే। సెరిగియెరుగని యెరుకయూ తన్నడిగె నంపోలందు దక్షణ ॥చెల్లిరో॥

## —: తత్వము :—

(1) ద్వాదశిదోరీ । యేసాధన లేనట్టి బోధ ॥ద్వాద॥
ద్వాదశినీ తెలియుటకూ । మేధాయుండాలీ । బోధా తెలిసినవె నుకా భాధాతీరాలీ । సాధూలాసాంగత్యం సమరసముండాలీ। ఆది అంత్యము లేని ఆనందరహితమురా ॥ద్వాదశిదోరీ॥

(2) పన్నెండూ పదహారూ పదిహే నెరుగాలీ। నిన్నంటీయున్నట్టి కన్యను వీడాలీ । సన్నాపుదిక్కులో చిన్మయునిడువాలి । కన్నతల్లి పూజ సున్నా చెయ్యాలీ ॥ద్వాదశిదోరీ॥

(3) మూంటిమూంటిమూంటి కోటాదాటాలి । ఆటాపాటలు లేనీ బాటా నెరుగాలీ । వాటముగా త్రికూటస్థానం విడువాలీ । నాటకరహితం శైన సూటీ నెరుగాలీ ॥ద్వాదశిదోరీ॥

(4) హద్దూమీరక గురునీ ఆజ్ఞానడువాలీ । మొద్దూతనమును విడచీ ముద్దుగయుండాలీ । సద్దూచేయక గురుని పద్ధతి నెరుగాలీ। రద్దయినా పత్రమునని బుద్ధికితోచాలీ ॥ద్వాదశిదోరీ॥

(5) గంగాయమునల సంగం భంగాపరచాలీ । అంగాలింగారహితా ఆర్యునిచేరాలీ । నిస్సంగుడవై నీవూ నిండుగ నుండాలీ తంగుళ్ళాపేటలో యీసంగతివినాలి ॥ద్వాదశిదోరీ॥

(6) కలయే నీ యునికనుచూ మెలుగూచుండాలీ । తెలసీ తెలియని తెలివి మొదలేవిడువాలి । కలలో మద్గురు దుర్గానందుని చేరాలీ । కలయూ ఓతిరుమూర్తీ!! మేల్కానరుగాలీ ॥ద్వాదశిదోరీ॥

—: తత్వము :—

(1) ప్రణువా తీతాగురో । నగురోరధికం ॥ప్రణువా॥
పంచదేహావినిర్ముక్తం । పంచకోశవివర్జితం । పంచభూతాద్యసంగత్వం । సత్యమే పరమార్థతత్వం పంచా పంచ పంచా । ప్రపంచాతీతా ॥ప్రణువా॥

(2) దేశాదేశావినిర్ముక్తం । కోశాతీతసుసంస్థితం నిరాఖ్యాతం నిరాభ్యాసం । నిర్మలత్వం పరమతత్వం నిగమా ఆగమముల కంటకనిండియున్నాదీ ॥ప్రణువా॥

(3) జలధిలోపల జలచరమువలెనట్లు । చల చలముల సరణిగంటినీ । కలనువిడచిన దేశికుడవని। నిలకడతో స్మరియింపుచుంటిని॥చలమూ అచలాముగాని । అప్రమేయుండా ॥ప్రణువా॥

(4) బహిరంతరమంతునిండినా । అహరహితంబైన పరమదీ । ఊహాచేగురుసూచనెరిగిన । అహం బ్రహ్మము లేనిదీ కోహం కస్త్వంబానూచు । కూతలు కూయనిదీ ॥ప్రణుతు॥

(5) యెండమావుల జగద్భ్రమనికా । చెండి వైచిన కన్నతండ్రీ । దండిగాబ్రహ్మండ మంతట । వుండి లేకున్నట్టి వాడా॥ అండాబాయూ లేనయ్యా ! మొండిశిష్యుడనూ ॥ప్రణువా॥

(6) వాసిగా అంపోల్పురమునా । వాసులౌ పర దేశులైనా । పంచదసిశ్రీ దుర్గానందుని । పదద్వయములు । మదిని నిల్పిన॥ ఆరట్లరామరావూ అహము విడచేనూ ॥ప్రణువా॥

—: వేదవేదాంతాతీత పరతత్వబోధ :—

—: సభావిజ్ఞాపన :—

( 1) ఆశతో విన౦డయ్యా । ఈశా సద్గురుచరితం
యీశా సద్గురు చరితం । నాశనం బహురిజనితం ॥ఆశతో॥

( 2) కన్న జగమెరుకలనూ । సున్ననుచు మది తెలసీ
వున్నమార్గంబు నిపుడు । చిన్నకలగ వ్రాస్తినయా ॥ఆశ॥

( 3) తావు జూపిన గురునీ । భావమందుననిల్పీ
భావభావంబులేని । గ్రోవా సద్గురుచరితం ॥ఆశ॥

( 4) పెద్దపెద్ద భావముతో । శుద్ధిగా వ్రాయలేనూ
మొద్దువాడనునన్నూ । ముద్దుగాను మన్నించీ ॥ఆశ॥

( 5) మతవాదమూలబడీ । సతతమూ శ్రమపడకా
అతులితముగ నాత్మానాత్మా । వర్జితబోధా ॥ఆశ॥

( 6) వచన రచనలలోనా । సుచరితులున్నారూ
అచల భావంబు నెరిగి । వచనా విడచినవారు ॥ఆశ॥

( 7) చిన్నవాడను నన్నూ । కన్న కొమరుగజూచీ
పిన్న పెద్దలలోనా । చిన్నబుచ్చబోకండీ ॥ఆశ॥

( 8) యీపూర్ణబోధంబోనూ । సొప్పైన పెద్దలనూ
మేపుమీరగ గొల్చి । ప్రాపుజేరినవాడ ॥ఆశ॥

—: శ్రీ మహావిష్ణు సాంప్రదాయం :—

( 9) అమ్మహావిష్ణుజేరీ । నమ్మి శ్రీ తిమిరారీ
కమ్మనీ బోధజెంది । యిమ్మహి తాపూర్ణుడాయె ॥ఆశ॥

(10) తిమిరారిసేవజేసీ । కమల బృంగము భంగీ
విమలా శ్రీయాజ్ఞవల్కి । అమలాబోధను బడసె ॥ఆశ॥

(11) మనమునా ఋషివరునీ । వినయముతో తాగొల్చి
జనకమహారాజపుడూ । తనకల్మి మృషనియుండే ॥ఆశ॥

(12) ఆజనక దేశికునీ । మోజుగా శుకవరులూ
హాజరై సేవజేసి । బేజారీ కలనుబాసె ॥ఆశ॥

(13) శ్రీ సుకా సేవజేసీ । దేశికావరులైరీ
భాసురంబుగ వెలసిరి । శ్రీశా సాందీపవరులు ॥ఆశ॥

(14) సాధనా లేని బోధా । ద్వాదశాబ్దములుగొల్చి
ఈధరలో శ్రీకృష్ణులు । బేధాబుద్ధినివిడచె ॥ఆశ॥

(15) అర్జునా మహారాజా । సజ్జనా కృష్ణునిచే
దార్జన్య మెరుకవిడచి । సజ్జనుడై తావెలసె ॥ఆశ॥

—: శ్రీ శివరామదీక్షిత సాంప్రదాయం :—

(16) శ్రీధరునిపాదమూలు । యీధరలోపూజించీ
సదమలా బోధదెల్పె । బుధజన శ్రీ శివరాములు ॥ఆశ॥

(17) శ్రీరామలింగునిచే । పరమారాధ్యుంశిలలో
పరమార్థ్యుని గొల్చె । విరివిగ శ్రీ దేశికయ్యా ॥ఆశ॥

(18) దేశికేంద్రా గురునీ । యీాశ శ్రీ నాగయ్యా
ఆశతో నాగయ్యను బాసురబలరాము గొల్చె ॥ఆశ॥

(19) బలరామపండితునీ । అలబూరి విరికృష్ణుం
డిలలో తా సేవించి । కల మెరుకనుబాసె॥ ఆశ॥

(20) కృష్ణమాచార్యగురునీ । వ్యాప్తి లేకను గొల్చె
తృప్తినొందిన సద్గురు । విష్ణుడౌ సన్యసయ్యా ॥ఆశ॥

(21) సమరసా నిర్మల । విమల సన్యాసార్యున్
తమమిడచి సేవించె । అమలా శ్రీ దుర్గానందా ॥ఆశ॥

(22) సరస్వతీ దుర్గానందా । పరములో పంచదసీ
కరుణాతో పిలుపొందిన । వర శ్రీ సద్గురు చరితం ॥ఆశ॥

(23) పంచదసి దుర్గానందుని । మెంచెంచి సేవజేసీ
సంచితాగములుద్ధృంచె । మించిన యీరామారావూ ॥ఆశ॥

(24) కవులనందరి నేనూ । సవినయాన్ ప్రార్థించీ
సేవా సద్గురుఫలితం । కవితగనే వ్రాస్తినయ్యా ॥ఆశ॥

—: గురు శిష్య అన్యోన్య సందర్శనం :—

(25) సాధనలు రెండెరిగిన । బోధాధికారొకరూ
సాధనాతీతగురుని బోధాచేయగవేడె ॥ఆశ॥

(26) అష్టాంగాయోగములూ । స్పష్టముముగసాధించీ
నిష్ఠాభృామధ్యమందు । దృష్టినైక్యముపరచుట ॥ఆశ॥

(27) మూఢమానసులిలలో । రూఢమెరిగేవరకూ
కూడి పంచాక్షరితో । మేడలెక్కుచుండవలె ॥ఆశ॥

(28) మేధాసిద్ధినవారూ । బోధచే రాధారెరిగీ
సాధనాసంపత్తిలో । మేదిని తా ముందురయా ॥ఆశ॥

(29) నిత్యా నిత్యములానూ । హెచ్చుగా మది తెలసీ
మచ్చు మాయను రోసీ । నిత్యమెరుగుచుండుటదే ॥ఆశ॥

(30) ఇహపరలోకములా । మహాపదవులయందూ
ఊహా లేకుండునదె । ఆహా సద్గురుచరితం ॥ఆశ॥

(31) శమదమాశాంతులూ । సమముగా నలవడియూ
క్రమము తితీక్షశ్రద్ధ । సమాధానముండునదె ॥ఆశ॥

(32) యుగళసాధకుడొకరూ । జగములే నీగురునీ
బాగుగా నొరిగిమ్రొక్కి । ఆగాములు త్రుంచమనే ॥ఆశ॥

(33) అంతలో శ్రీగురులూ । చెంత చేరిన వార్ని
చింతలూ బాపజేసి । అంతూ తెల్పెదననూ ॥ఆశ॥

(34) సాధనలుచేయబోకూ । వాదులతో తిరిగిరాకూ
మోదమున ముఖ్యమైన । బోధినుగో వినుతనయా ॥ఆశ॥

## —♦ అచల లక్షణం ♦—

(35) గుప్తమైనా పరమూ । జ్ఞప్తి లేనీస్థిరమూ
ఆప్పుడమైవై యదిగనుమూ । లిప్తలో యీజ్ఞప్తి విడుము ॥ఆశ॥

(36) నీవు నేనునుగాకా । యీమేనులోనిదిగాకా
తాను నేననకున్నది । పూవినిండినాపూర్ణం ॥ఆశ॥

(37) నామరూపులు లేనీ । ఆమహాపూర్ణమందూ
అమలసత్వారూపం । భూమలో తా లేకకర్తై ॥ఆశ॥

## —♦ మెరుక లక్షణం ♦—

(38) మాయ తెలియరాదూ । మాయమూలము లేదూ
తోయములో ఛాయవిధము । హాయిగకనుపించునయా ॥ఆశ॥

(39) మూడుభాగములయ్యే । ఆ డేటి శుద్ధమాయా
యేడో అంతస్తూలో । ఆడీయాడక నుండూ ॥ఆశ॥

(40) మలినమాయయె యిపుడు । తొలిభూతమాకాశం
సలలితాకరువలగ్ని । జలపృథ్వీజాతమయ్యే ॥ఆశ॥

(41) పంచభూతములైదూ । మంచిగా పంచబడీ
అంచితాసాంఖ్యసూత్రి । మెంచీ పంచైదులాయే ॥ఆశ॥

(42) నాలుగూతనువులిలా । మేలుగాజతగూడీ
స్థూలసూక్ష్మకారణ । మహాకారణాలై ప్రజ్వరిల్లె ॥ఆశ॥

(43) శుద్ధమలినములు రెండూ । వొద్దికగజతగూడీ
ముద్దుగామిశ్రిమన్నై । దేహీ దేహములయ్యె ॥ఆశ॥

(44) అంగమే దేహమూయె । లింగమే ఆత్మఆయె
అంగలింగసంగమె । యాలింగదేహమనిపల్కిరి ॥ఆశ॥

(45) మనసన్న రసంబాయె । యెన్నగ నీరంబుప్రాణం
సున్నానునేనన్నది తిన్నగ యివి కూడకున్నా ॥ఆశ॥

(46) మొదప్రతీగావలెనూ । జరుగురుగ తా వచ్చూ
అరుగు దీన్మొదలుదెలియ । సరగున సద్గురుజేరీ ॥ఆశ॥

(47) భూతపంచకమిశ్రం । చేతనంబై వెలసె
నేతినేతీతనియెడి । చైతన్యముతోగూడి ॥ఆశ॥

(48) ఈరీతి సాంఖ్యమునూ । కోరి క్లుప్తము వ్రాస్తి
తారకా భావమిప్పుడు । నేరుపుతో వినుమయ్యా ॥ఆశ॥

## —♦ తారకలక్షణం ♦—

(49) ద్వైగుణ్యాక్షరాలూ । ముదముమీరోంకారం
సదమలాషట్చక్రాల్ । మదిలో నెగనుశిష్యా ॥ఆశ॥

(50) భూలోకమందుననూ । నాలుగక్షరాలుండూ
మేలుగా విఘ్నరాజు మూలాధారమునుండూ ॥ఆశ॥

(51) అమ్మహాభువర్లోకాన్ । బమ్మదేవరయుండూ
యిమ్ముగా షడ్దళములు । నమ్మిది స్వాధిష్ఠానం ॥ఆశ॥

(52) యీదుంచుశువర్లోకాన్ । పదివేసముల స్వామిన్
సదమలా దశదళములు । ముదముమీర మణిపూరం ॥ఆశ॥

(53) చక్కనగా హతమునా । ముక్కంటిదేవుడుండూ
అక్కడ పన్నెండుదళాల్ । నిక్కము మహర్లోకమురా ॥ఆశ॥

(54) జాడగన్గాను నీంగో । షోడాసి దళములనూ
చూడు విశుద్ధకమల । మాడూ జీవుండచటా ॥ఆశ॥

(55) ప్రత్యగాత్ముడునీకూ । ప్రత్యక్షమాగ్నేయం
నిత్య మిచ్చట ద్విదళాల్ । సత్యమిదే తపోలోకం ॥ఆశ॥

(56) భ్రూమధ్యస్థానమునా । సోమసూర్యులమధ్యా
ఇమ్ముగా జ్యోతిరూపు । నమ్మునాదంబుండూ ॥ఆశ॥

(57) బింబ ప్రతిబింబంబూ । తుంబురా నాదమదే
అంబికాదేవియు గా । నంబూ చేయుచునుండూ ॥ఆశ॥

(58) వేదమాతయు నిదియే । నాదజ్యోతన నిదియే
ఆదిలో పెద్దలన్న । నాదానందంబిదియె ॥ఆశ॥

(59) పంచాదశక్షరాలూ । మించినా ఓంకారం
అంచితా తారకంబు । పొంచిచూడు భ్రూమధ్యాన్ ॥ఆశ॥

## —♦ అమనస్క లక్షణం ♦—

(60) వేదమున కంత్యాజుడూ । నాదరహిత బ్రహ్మం
ఆదిసద్గురురూపం । మీదాసహస్రారం ॥ఆశ॥

(61) మూలమూ లేనిగుర్తూ । కీలు కేవలరూపం
నాలుగోతనువు కవల వి । శాలా జగమేలు గురుడు ॥ఆశ॥

(62) పంచతన్మాత్ర లేనీ । మించినా అమనస్కం
పొంచున్న పారార్థం । ద్రెంచిన వరగురు చరితం ॥ఆశ॥

## —♦ మతాల లక్షణం ♦—

(63) ద్వైతభావమువారు । సతతనాదబ్రహ్మం
అతులితముగనమ్మి । మతవాదములనుంట్రీ ॥ఆశ॥

(64) శంకరాచార్యుండూ । పొంకముతో గురురూపై
పంకజాభవునిస్థితిలో । జంకువిడచినే బ్రహ్మనె ॥ఆశ॥

(65) సత్తుచిత్తానందం । మెచ్చనుచు మదినమ్మి
మచ్చ మాయను రోయక । దిచ్చయెరామానుజులు ॥ఆశ॥

(66) జీవతనువూలోనా । జీవోహమున్నదిరా
శివతనువూలోనా । శివోహమున్నదిరా ॥ఆశ॥

(67) అహములూ రెండూనూ । దేహములు రెండూనూ
మోహరూపంబైనా ఆహా యీ యెరుకాయె ॥ఆశ॥

(68) నాలుగూతనువులునూ । నాలుగవస్థలునూ
నాలుగభిమానబీజాల్ । నేలుగ మరుపెరుకలాయె ॥ఆశ॥

(69) యెరుక మరుపనియన్నా । గురుతుజ్ఞప్త్యనియన్నా
యెరుగు మొక్కటియనుచు । గురుగుంహ్యా మదియెరిగి ॥ఆశ॥

(70) యిన్ని వింతలనున్నా । చిన్ని చిన్మయరూపం
ఎన్నంగ దీన్మోదలూ । సున్నారగురు చెంతా ॥ఆశ॥

(71) శివరామ దీక్షితులూ । శివరూప చిన్మయునీ
చావుపుట్టుచునుండే తావుగలాయెరుకసిరీ ॥ఆశ॥

(72) కలవలెను యీ తెలిపీ । అలభూమలోగన్గే
యిలసలిలయనలమనిల । మాకాశభూతముతో ॥ఆశ॥

—♦ పరిపూర్ణబోధ ♦—

(73) రాకపోకలులేకా । యేకముగనున్నదిరా
లోకత్రయములనంతట । ప్రాకటముగ పరిపూర్ణం ॥ఆశ॥

(74) చూపు రూపులులేకా । పాపలోనిదిగాకా
ఆపోజ్యోతదిగాకా । సాపునున్న పరమార్థం ॥ఆశ॥

(75) సినీమా తెరమీదా । కానమా బొమ్మలెన్నో
మనమా విధముననే । ఘనమగుపరిపూర్ణమునా ॥ఆశ॥

(76) జంత్రిపూ బొమ్మలెన్నో । తంత్రముగ తెరపైన్వా
తంత్రించి వచ్చి జనిన । తంత్రిము తెరయెరుగదురా ॥ఆశ॥

(77) రంగుబొమ్మలరంగూ । కొంగుచిరిగినగానీ
రంగులేని తెరకూ । చెంగుచిరగలేనట్లూ ॥ఆశ॥

(78) ఆరీతి భూమలోనూ । వేరై యీయెరుకతానూ
నారీ నరరూపములై । సారే సారెకు వచ్చా ॥ఆశ॥

(79) వృత్తబట్టబయలేరా । రిత్తదేమీ లేదూ
తత్తరాపాటేలా । యిత్తరియదికనుగోరా ॥ఆశ॥

(80) వున్నదే పరమనుచూ । కన్నదేమీ లేదని
అన్న ద్వాదసిపల్కు । తిన్నగ నీమది నెరుగూ ॥ఆశ॥

(81) నాలుగూ ప్రిక్కలందూ । నాలుగూ మూలలందూ
మేలుగా నీకు ప్రిక్కల । చాలగ నిండున్నదిరా ॥ఆశ॥

(82) మూలాము లేనిగుర్తు । నాలవశరీరంబూ
వాలాయమెరిగేదిది । కీలెరిగిన యేమీ లేదూ ॥ఆశ॥

(83) గుర్తునే గురుడనుచూ । కర్తగా భావించీ
మూర్తి ప్రితిబింబమునె । కీర్తిగలా తెలివనుమూ ॥ఆశ॥

(84) జాలమంతయు జూడా । మాలగా పరిణమించే
మేలౌయా మేరుపూస । నాలవశరీరంబే ॥ఆశ॥

(85) మూలచేయగ మనకూ । కీలుసూత్రమువలెనూ
మూలమూ లేనిగుర్తు । కీలూగురు సూత్రమురా ॥ఆశ॥

(86) కలవంటిదీ తెలిపీ । కలకాలముండమురా
మేల్కొరిగి గురునీచె । కలకల్ల నీ తలచుమురా ॥ఆశ॥

(87) పదిరెండు మది తెలసీ । పదియారు నిను రోసీ
పద్దైను పత్యముగా । ముదముమీర నుండుమురా ॥ఆశ॥

(88) చెప్పి తా కలరాదూ । ఒప్పిదంబిది చూడూ
చప్పునా మేల్కొన్నను । తప్పున యాకలలేదూ ॥ఆశ॥

(89) నీ కలలో కన్నయట్టి । లోకములు లోకేశుల్
ప్రాకటముగ మేల్కొన్నను । యాక లేది ? తెల్పుమురా ॥ఆశ॥

(90) మంత్రిమూ మంత్రార్థం । తంత్రిముగ తరచిస్వ
తంత్రము పరతంత్రిమనెడి । తలపూ లేకనుయుండూ ॥ఆశ॥

(91) షోడసీ లేదనుచూ రూఢిగా మదినమ్మా
గాఢనిద్రిలో నీదగు । జాడపుడూ పొందుమురా ॥ఆశ॥

(92) ఈరీతి మంత్రమునూ । సారెకూ జపియించా
ఆరువత్సరములకూ । ఆరూఢ స్థితికుదురూ ॥ఆశ॥

(93) నమ్మి నమ్మకయున్నా । నమ్మికా లేకుండా
ఇమ్మహిని భర్తలేని । శృంగార స్త్రీచేష్టటు ॥ఆశ॥

(94) కర్పూరంబే నీవూ । నిప్పదే నేనోరా
ఇప్పగిది వెలిగి మనము । చప్పున చల్లారుదుమూ ॥ఆశ॥

(95) పెద్దలందున నీవూ । ముద్దుగా వర్తించీ
శుద్ధయిన పల్కులనూ । వద్దికతో వినుచుండూ ॥ఆశ॥

(96) గురువాజ్ఞ మీరాకూ । నరపశుల గూడాకూ
పరమునూ మదితెలసి । యెరుక నిన్ను రోయుమురా ॥ఆశ॥

(97) పూజచేసియు నీవూ । ఈజాయి తెలియుమురా
హాజరై గురుని చెంత । జోహారులు చేయుమురా ॥ఆశ॥

(98) నా గురుని మది నమ్మి । వేగ నే కన్న బోధా
జాగు చేయక మీకూ । బాగుగ వినిపిస్తి ॥ఆశ॥

## కవి వంశము

(99) భరద్వాజగోత్రమునా । ఆరట్ల వంశమందూ
సురనుత శ్రీరామరావు । కరమరుదుగ జన్మించే ॥ఆశ॥

(100) కలియుగా నాయకుడౌ । అల వెంకటేశ్వరునీ
సలలితా భక్తుండై । యెలమినితా వెలుగొందె ॥ఆశ॥

(101) రామాఖ్యుడిలలోనా । స్వామి సత్కృపచేతా
శ్యామలాంబావలనా । పుత్రద్వయమునుబడసె ॥ఆశ॥

(102) శ్రీనివాస ప్రభుడూ । మానిని శ్రీకృష్ణమాంబా
జానకీరాములవలె । మానితముగ వధువరులూ ॥ఆశ॥

(203) కృష్ణమాంబకు నేనూ । యిష్టతనయుడనగుచూ
స్పష్టముగ జన్మించితి । సృష్టిపిలచెరాముడనీ ॥ఆశ॥

(104) చిన్నతనమూలోనే । కన్న తల్లి గతియించా
పిన్నతల్లి కామేశ్వరమ్మ । కన్నతల్లిగా పెంచే ॥ఆశ॥

(105) కనతండ్రి తోబుట్టువు యెన్నగ నరసింగరావూ
చిన్నతనముననుండీ । యిన్ని విద్యలు నేర్పే ॥ఆశ॥

(106) కూరాకులా దుర్గా । నంద గురు మది నమ్మి
యీరీతి చిత్రభాను । చందన తదియకు జేస్తిని ॥ఆశ॥

(107) నూటెనిమిదీచరణాల్ । పాటమాలగ జేసీ
మేటి సద్గురు దుర్గయ । కంకితముగ నేవేస్తీ ॥ఆశ॥

(108) మంగళము గురువరుకూ । మంగళా మీసభకూ
మంగళము మహిమీదా । మహాభక్తులకు నెల్లా ॥ఆశ॥

జై శ్రీ సరస్వతీ దుర్గానంద పంచదసీ స్వామి సద్గురు ప్రభు
మహారాజుకీ జై జై జై.

"చల్లనిరాజా ఓచందమామా అనువరస" పాట.

(1) చల్లనిదేవా శ్రీ గురుదేవా । నాయుల్లామునను మిమ్మె । నమ్మితి
రావా । శ్రీ దుర్గదేవా॥

(2) కరుణామృత చూడ్కుల ప్రసరించుచూ । పరబోధలో ప్రజ్ఞను
కలిగించుచూ। తెరశావలి పరమును సూచించుచూ। నను కన్నుల
కన్నట్టి నాతండ్రి నీవే ॥చల్లని॥

(3) తొలిచూపులో నామది తిలకించిరీ । చలనంబగు యెరుకను తొల
గించిరీ । తలకిందుగ మంత్రము జపియించనీ । కల మేల్కొ-
ల్పినా । కరుణామయ మూర్తులు మీరేను దేవా ॥చల్లని॥

(4) గురుదక్షిణ యెరుకను । అర్పించనీ । పొరపాటునయైనను । నేనన
కనీ పరికించుము జగమును । నీకలయనీ । చిరస్థాయిని జూపిన
శ్రీ గురు దేవా ॥చల్లని॥